




శ్రీ

# BHAKTI YOGA.

# భక్తియోగము.




——(:)——

బ్రహ్మశ్రీ జంగంకోట శ్రీనివాసరావు
గారిచే రచియింపఁబడినది.

——(:)——

**CHITTOOR.**
**Printed by M. Ramanuja Chariar**
**At the Victoria Jubilee Press.**

——(o)——

వెల. 8-అణాలు

**1913.**














# BHAKTI YOGA.

# భక్తియోగము.

—(o)—

బ్రహ్మశ్రీ జంగంకోట శ్రీనివాసరావు
గారిచే రచియించఁబడినది.

—(o)—

**CHITTOOR.**
**Printed by M. Ramanuja Chariar**
**At the Victoria Jubilee Press.**

—(o)—

వెల. 8-అణాలు.



1913.






# INDEX.

## విషయసూచిక.




శ్లో॥ భగవద్భక్తిహీనస్య జాతిశ్శాస్త్రంజపస్తపః
అప్రాణస్యైవ దేహస్య మండనంలోకరంజనం॥

భగవంతునియందు భక్తిలేనివానికి ఉత్తమజాతియందు దయించుటయు, సకలశాస్త్రప్రవీణతయు, కోట్లసంఖ్యలజపించుటయు, తీక్ష్ణములైన తపంబులొనర్చుటయు, ప్రాణములేని దేహమునకు (పీనుఁగునకు) అలంకరించుటచే నెంతఫలమో అంతఫలమే అనగా వ్యర్థమని తాత్పర్యము.

శ్లో॥ కింస్యాత్ వర్ణాశ్రమాచారైః కిందానైఃకింతపశ్శతైః
సర్వాఘఘ్నోత్తమశ్లోకేన చేద్భక్తిరధోక్షజే॥ (భాగ).

భగవద్భక్తికి ముఖ్యసాధనములుగానుండనపుడు వర్ణాశ్రమాచారము లాచరించుటచే నేమిఫలము, పాత్రమెఱిగి సద్వృత్తిచే సంపాదించనది దాన మొసంగుటచే నేమిప్రయోజనము, మిగులకఠినమైన తపశ్చరణలచే నేమికార్యము, నాలుగువేదములధ్యయనముచేయుటచే నేమిలాభము అనగానివన్నియు భక్తిని పొందుటకు సాధనములు కానపుడు నిష్ఫలములని తాత్పర్యము. భక్తిని ఇంతశ్లాఘించి చెప్పుటకు కారణమువిచారింతము.

ఎవరెవరినేయేమార్గములు తరింపఁజేసినవో ఆయామార్గములే శ్రేష్ఠతమములని చెప్పియున్నారు. భక్తిమార్గముచే తరించినవారు దానినేశ్రేష్ఠమనియు, జ్ఞానమార్గమున తరించినవారు అదేశ్రేష్ఠమైనదనియు ఇట్లనే ఏమార్గమునతరించినవారు ఆమార్గము శ్రేష్ఠమనిచెప్పినారు. అన్నిమార్గములు భగవంతునినే పొందించుచున్నవి. ఆదియందువేర్వేరు మార్గములు ప్రత్యేకముగా ఒకరొకరికి సులభముగాను, శ్రేష్ఠముగాను తోచినను చివరకు అన్నిమార్గములభ్యసించి ఆఫలములు పొందినగాని భగవం

తుని చెందలేరు. అదెట్లన భక్తిమార్గమవలంబించువాఁడు జ్ఞాన సంపత్తియు, కర్మసిద్ధియు, యోగాభ్యాసమును లేక భగవంతుని యందు పరమభక్తి అనగా అనన్యభక్తి పొందఁజాలఁడు. అవ్విధమున నే ఇతరమార్గము లవలంబించువారికి భక్తియు కావలెను. ముందువ్రాయబోవు ప్రమాణములచే నిదినిశ్చయమని దృఢమగు.

భక్తులు భక్తిమార్గము శ్రేష్ఠమని చెప్పుటకు రెండుముఖ్య కారణములు గలవు.

మొదటిది, భక్తిమార్గమందు ఇతర మార్గములందున్నట్లు పద్రవములేదు. ఇతరమార్గము లభ్యసించుటకు అధికారము అనగా యోగ్యతను మొదటపొందవలసిన దవశ్యము. అట్లు యోగ్యతనుపొందక అభ్యసించినట్లైన ఉపద్రవము కలుగును. జ్ఞానమార్గమునకు వివేకాది సాధనచతుష్టయ మవసరము. దానిని పొందక జ్ఞానమార్గమందు ప్రవేశించువారికిఅహంకారమును, నాస్తికత్వమును ప్రాప్తించును. దీనికుదాహరణము ద్వైతాద్వైత విశిష్టాద్వైతులకును, ఇతరమతస్థులకునుండు పరస్పర ద్వేష భావముచాలును. యోగమార్గమునకు యమనియమాది అష్టాంగములవశ్యములు. ఇవిపొందక యోగమభ్యసించువారికి పలు విధములగు శరీరబాధలును, అసురత్వమును సిద్ధించును. భక్తి యోగమందు మాత్రమీ యపాయములేదని మహానారాయణోప నిషత్తు నందుదాహరింపఁబడినది.

మం॥ తస్మాత్సర్వేషామధికారిణా మనధికారిణాం
భక్తియోగప్రశస్యతేభక్తియోగోనిరుపద్రవః
భక్తియోగాన్ముక్తిః బుద్ధిమతామనాయాసే
నాచిరాదేవతత్వజ్ఞానం భవతితత్కథమితి
భక్తవత్సలస్స్వయమేవ సర్వేభ్యోమోక్ష
విఘ్నేభ్యోభక్తినిష్ఠాన్ పరిపాలయతి
భక్త్యావినాబ్రహ్మజ్ఞానంకదాపినజాయతే॥

ఆకారణముచే సమస్త అధికారులకును అనధికారులకును, భక్తియోగము ప్రశస్తమైనది. భక్తియోగమందేలాటియుపద్రవ మునులేదు. భక్తియోగముచే ముక్తి కలుగును. బుద్ధిమంతులకు ఆయాసములేక శీఘ్రముగతత్వజ్ఞానము లభించును. అదెట్లన:— భక్తవత్సలుఁడైన పరమేశ్వరుఁడుతానేసమస్తమైన మోక్షవిఘ్న ములను తొలగించి భక్తినిష్ఠనుపరిపాలించును. భక్తి లేక ఎప్పటికిని బ్రహ్మజ్ఞానములభించదని తాత్పర్యము. ఈ ప్రమాణముచేత భక్తియోగమందుపద్రవములేదనియు, ఏలాటి అధికారమును పొం దకనే అభ్యసించవచ్చుననియు దృఢపడుచున్నది.

ఇంక రెండవదైన పరమకారణము భగవంతునిపొందుటే.

భగవద్గీత ఏకాదశాధ్యాయము 54 శ్లోకము.

శ్లో॥ నాహం వేదైర్నతపసా నదానేనన చేజ్యయా
శక్యఏవంవిధో ద్రష్టుం దృష్టవానసిమాంయథా॥
భక్త్యాత్వనన్యయాశక్యఅహమేవంవిధోర్జున
జ్ఞాతుంద్రష్టుంచతత్వేన ప్రవేష్టుంచపరంతప॥

వేదములచేతగాని, తపస్సుచేతగాని, దానములచేతగాని, యజ్ఞములచేతగాని నన్ను నీవుచూచినట్లు చూచుటకుశక్యముకాదు అనన్యభక్తి చేతనే ఇవ్విధమున చూచుటకును, తెలిసికొనుటకును, ప్రవేశించుటకును, శక్యమగునని అర్జునునికి శ్రీకృష్ణులానతిచ్చిరని తాత్పర్యము.

అర్జునుఁడు ఏవిధమునభగవంతునిచూచినది అదే అధ్యాయ మందే (15) పదునైదవశ్లోకమునుండి (31) ముప్పదియొకటిశ్లోకము వరకు వర్ణించబడినది. అన్నిశ్లోకములు వ్రాయను విశేషముగా చోటుపట్టునుగనుక ఒకశ్లోకముమాత్రమువ్రాసెదము:—

శ్లో॥ పశ్యామిదేవాంస్తవదేవదేహే। సర్వాంస్తథా
భూతవిశేషసంఘాన్॥బ్రహ్మాణమీశంకమలాసనస్థం।
ఋషీంశ్చసర్వా నురగాంశ్చదివ్యాన్॥

ఓ దేవా, నీదేహమందు సమస్తదేవతలను, సకలభూతవిశేషముల గుంపును, కమలాసనమందుండు బ్రహ్మను, ఋషుల సమూహమును నాగులను చూచుచున్నానని అర్జునుఁడు శ్రీకృష్ణులకు చెప్పెను. బ్రహ్మాండమంతయు భగవంతునియందు చూచెననిదీనిముఖ్యాభిప్రాయము.

శ్లో॥ యోమాంపశ్యతిసర్వత్రసర్వంచమయిపశ్యతి,
తస్యాహంనప్రణశ్యామి సచ మేనప్రణశ్యతి॥

తా॥ ఎవఁడు సమస్తమందునన్ను, నాయందు సమస్తమును చూచుచున్నాఁడో వాఁడునన్ను విడువఁడు. నేను వానిని విడువను.

ఇట్టివిశ్వరూపమును చూచినవాఁడుతప్ప మరెవ్వఁడు భగవంతుని అన్నిటియందును, అన్నిటియందు భగవంతుని చూడగలడు? ఎవ్వనికీలాటిదర్శనమబ్బునో వాఁడే నిజమైనభక్తుఁడుగాని ఇతరులు అనన్యభక్తులుకారని దృఢముగా చెప్పవచ్చును.

వేలకొలదిజనులుతిరుపతి, శ్రీరంగము, కాశీరామేశ్వరములు, మొదలగు దివ్యస్థలములకు మితిమీరినద్రవ్యము వ్యయముచేసి ప్లేగు మొదలగువాని నిబంధనలకులోబడి, ఎండవేడిమిచేకాలినట్టియు, వానలచేతడసి అడుసైనట్టియుభూమిమీద పొరలుచుదండములుబెట్టుచు, అడుగడుగునకునమస్కారములుసేయుచు, నోటికిబీగములువేసికొనుచు, కేవలముశ్రమపడిపోయి అచ్చట స్వామిని అనేక విధముల ఆరాధించుచు, కానుకలుసమర్పించుచు, ఉత్సవములుచేయించుచు, స్త్రీలుసయితము తలవెంట్రుకలు తీయించుకొనుచు పలుతెరంగుల పూజించుచుండుట అందరికి తెలిసినవిషయమే. వారందరు అర్జునుఁడుచూచినట్టి స్వామినిజరూపము చూచుచున్నారా? లేదనిదృఢముగా చెప్పవచ్చును. అట్లున్నప్పుడు వీరికి భక్తి లేదనిచెప్పవలెనా? లేక భగవంతుఁడు భక్తులకు దర్శనమిచ్చెదనని చెప్పినది వృథావాక్యమనవలెనా? ఈ విషయము

విచారించిచూడ వీరుభక్తులనుటయు, భగవంతుని వచనము సత్య మనియు దృఢపడుచున్నది.

అదెట్లన:—భక్తి రెండువిధములు. సదోషమనియు, నిర్దోషమనియు, లేక శుద్ధభక్తి అశుద్ధభక్తియని ద్వివిధము. శుద్ధ భక్తి మరియు మూడువిధములు, నిర్నిమిత్తభక్తి, అవ్యభిచార భక్తి, అవ్యవహితభక్తియని. అశుద్ధభక్తియు ముచ్విధము:—సని మిత్తము, సవ్యభిచారము, సవ్యవహితమని. ఎవరైతే మొదటి దగు శుద్ధభక్తినిపొందియుందురో వారుఅర్జునుడుచూచినట్టిస్వామి నిజరూపము దర్శించుదురనుటకు సంశయములేదు. శుద్ధభక్తిని గురించి విమర్శించుటకుముందు అశుద్ధభక్తిని గురించి విచారించుద ము. ఏదైననొక నిమిత్తముచే దేవునిపూజించుట, స్తుతించుట, ధ్యా నించుట, కానుకలిచ్చుట మొదలగునవి సనిమిత్తభక్తికిచేరినవి. అదె ట్టిదన, రోగనివారణార్థముగాని, సంతానోద్దేశమునగాని, సంప దపొందుటకుగాని లేక ఇతరప్రయోజనమునకుగాని భగవంతుని ఆరాధించుట మొదలగునది. వీరుభగవంతుని ఆరాధించు ము ఖ్యోద్దేశము రోగనివారణాదులుకావలెననుటగాని స్వామినిజరూ పముచూచి పొందవలెననుటగాదు. రోగపీడితుడు రోగనివార ణమునకై వైద్యునింటికి మాటిమాటికి తిరుగుచు, ద్రవ్యమిచ్చుచు, స్తుతించుచుండి, రోగనివారణమైన తరువాతగాని, రోగము ఆ వైద్యునిచే నివారణకాకపోయినగానివెట్లు ఆవైద్యునియందుపేమా భావముకలుగునో అట్లనేస్వామిని ఏదైననొకయుద్దేశముచే గొలు చు వారికిని తమయుద్దేశము నెరవేరనపుడు స్వామియందుపేమ కలుగును గనుక ఒకనిమిత్తముతో స్వామినికొలుచుట అశుద్ధభక్తి యనబడును. దానికుదాహరణముగా దీనినిగైకొనవచ్చును. గ్రామములలో ధూముజాడ్యము (మారీకావ్యాధి, కాలరా) వ్యా పించినపుడు ఎచ్చటచూచినను రామభజనలుచేయుచు, జనులుగుంపు గుంపుగా ఊరంతచుట్టుచుందురు, ఆయుపాధినిలిచినతోడనే స

మారాధనలు చేసి భజనలునిలుపుదురు. వీరుభజనలు చేయు ఉద్దేశము ఆవ్యాధి నిలుచుటకుగాను. ఆయుద్దేశము నెరవేరినతోడనే భజనలునునిలుచును.

ఇకసవ్యభిచారభక్తిని గురించి విచారింతము. వ్యభిచార స్త్రీ ఎవ్విధమున భర్తయింటియందు సమస్తకార్యములు చేయుచుండినను మనసుతనకుయిష్టమైన పరపురుషునందుంచి యుండునో అవ్విధమున నే వ్యభిచారభక్తిగలవారు బాహ్యేంద్రియములచే దేవతాపూజలు సల్పుచుండినను వారిమనసు ప్రాపంచిక సంబంధమైన బహిర్వ్యాపారములందే పోవుచుండునుగాని భగవంతునందు సర్వదానిలిచియుండదు. ఇట్టిభక్తిచే భగవంతుని నిజరూపము చూచి, పొందుటసాధ్యముకాదు. ఇకసవ్యవహితభక్తిపదన దివసమంతయు తమతమ ప్రాపంచిక వ్యాపారములందు గడపుచు ఆపనులన్నియుముగిసి తీరుబాటైనపుడు, పురాణమువినుటకో, పారాయణముసేయుటకో, భగవత్కథలశ్రవణమునకో, దేవతార్చనలు సేయుటకో వినియోగించుట. భక్తిసంబంధమైన ఉపన్యాసమిచ్చుచున్నారు, వినుటకురమ్మని పిలిచినపుడెందరునాకు పనియున్నది పనితీరితే వచ్చెదనని చెప్పుటలేదు. అశుద్ధభక్తిగలవారికి భగవంతుడు పరమార్థముగా నుండడు. వారికిప్రపంచ విషయములే పరమార్థము. తమఅభీష్టములు పొందుటకుభగవంతునిసాధకముగా నెంచెదరు, గనుక నిట్టిభక్తిచేస్వామిదొరకడు. స్వామిదొరకుటకు నిర్నిమిత్తమును అవ్యభిచారమును, అవ్యవహితమునగు శుద్ధభక్తి కావలెను. ఇప్పుడుసామాన్యముగా దివ్యదేశములకుపోయి పూజించు వారిలో బహుజనులు అశుద్ధభక్తిగలవారు గనుక వారి అభీష్టములు మాత్రము అట్టిపూజలచే ఈడేరునేగానిస్వామి నిజరూపదర్శనముకానేరదు.

శుద్ధభక్తి నిర్నిమిత్తముగా (నిష్కారణముగ, ఫలాపేక్షయు లేక) భగవంతుని సర్వదా తలంచుచు, ధ్యానించుచు,

సేవించుచు, పూజించుచుండుట. ఎవఁడుగాని దేనినైన నిర్ని మిత్తముగ చేయువాఁడు లేడనే అందరికితోఁచుచున్నది. ఏప్రయోజనమును లేక ఏదైనపని చేయువానిని పిచ్చివాఁడందురు. భక్తులట్టి వారని భావించకూడదు. బ్రహ్మాండమందుండు సమస్తమును ఒక నిమిత్తముచేత, ఆత్మకు (తనకు) ప్రీతిగనుండును. ఆత్మ ఏదైనది, ఆత్మయొక్క నిజస్థితి తెలియకుండినను తత్కాలమందు ఆత్మయని (తానని) దేనినిభావించియుండునో దానికి ప్రతివస్తువును ప్రియముగనుండుననుట అందరికి తెలిసిన విషయము. వస్త్రములు నరునికి ప్రీతిగనుండుటకు, అవి తన్ను అలంకరించుచున్నవనుటయు, చలి ఆపుననుటయు నిమిత్తములు. భోజనము ప్రీతిగనుండుటకు తన్నుజీవింపచేయుచుండుట నిమిత్తము. ఇట్లనే తనకంటె నితరవస్తువులన్నియు ఏదోయొకనిమిత్తముచేత తనకు ప్రీతిగనుండునుగాని నిమిత్తములేక ప్రీతిగనుండవు. అట్లనే అశుద్ధభక్తిగలవారికి, భగవంతుఁడు ప్రీతిగనుండుటకు, తన్నురక్షించుననుటయో, ఆపదలనుండి తొలగించుననుటయో, బంధములనుండి వదలించుననుటయో, అభీష్టములు నెరవేర్చుననుటయో నిమిత్తములు. తనకంటె నితరవస్తువులన్నియు నిమిత్తములేనిది ఎవనికిని ప్రీతిగనుండదు. భగవంతుని తనకంటెనితరుఁడని తలచువానికి నిమిత్తములేనిది భగవంతుఁడెట్లు ప్రియుఁడగును? ఆత్మకంటె (తనకంటె) నెక్కువప్రియమైనదేదియు లేదని యెవరికి తెలియదు! తన్నుమాలిన ధర్మములేదనిలోకోక్తిగలదుకదా! తన్నురక్షించుకొనుటకేదిచేసినను దోషములేదని చెప్పుదురు. తన్నురక్షించుకొనుటకు హత్యచేసినను మన్నింతురు (Self defence). తనకంటె అనగా ఆత్మకంటె నెక్కువప్రియమయినదేదియు లేదని దృఢపడుచున్నది.

విదురనీతియందు విదురుఁడు ధృతరాష్ట్రునికిట్లు చెప్పినాఁడు.

శ్లో॥ త్యజేదేకంకులస్యార్థే

గ్రామస్యార్థేకులంత్యజేత్
గ్రామంజనపదస్యార్థే
ఆత్మార్థేపృథివీంత్యజేత్ ॥

కులమును రక్షించికొనుటకు ఒకనివదలవచ్చును, గ్రామమును కాపాడుటకు కులమును త్యజించవచ్చును, పట్టణమును నిలుపుటకుగ్రామమునువిడువవచ్చును, ఆత్మనురక్షించుటకు భూమినంతయుపరిత్యాగముచేయవచ్చునని శ్రీమద్భారతము ఉద్యోగపర్వమందువిదురుఁడుపలికినాఁడు. ఈకారణమునుపట్టి ఆత్మ సమస్తవస్తువులకంటె ప్రియమైనదని చెప్పుటకు సంశయమేమియు లేదు.

ఆత్మ ఎందుకు, ఏనిమిత్తముచే నింతప్రియమైనది? అదెందుకంత ప్రియతమమైనదో చెప్పువారు లేరు. దానికినిమిత్తము లేదు.

బృహదారణ్యకోపనిషత్తునందును భార్య, భర్త, కులము, ధనము, మొదలగుసమస్తములను ఆత్మార్థమే ప్రియములగుచున్నవని చెప్పఁబడినది.

శ్లో॥ "నవాఅరేసర్వస్య కామాయ
సర్వంప్రియంభవతి, ఆత్మనస్తు
కామాయసర్వంప్రియంభవతి"

ఎవఁడుతనయందుసర్వమును, సర్వమునందుతన్ను చూచుచున్నాఁడో వాఁడేఆత్మజ్ఞాని, వాఁడేసమదర్శి, వాఁడేయోగి, వాఁడేఏకత్వమును పొందినవాఁడు. వానికే శోకమోహములు లేవు.

శ్లో॥ సర్వభూతేషుచాత్మానం। సర్వభూతానిచాత్మని,
ఈక్షతేయోగయుక్తాత్మా। సర్వత్రసమదర్శనః"
అనిభగవద్గీతయందును

శ్లో॥ యస్మిన్ సర్వాణిభూతాని। ఆత్మైవాభూద్విజానతః,
తత్రకోమోహఃకశ్శోకః। ఏకత్వమనుపశ్యతః॥
అనియీశావాస్యోపనిషత్తునందును ఉదాహరింపఁబడినది.

వీని తాత్పర్యము పైన వ్రాయఁబడినది. ఇట్టివారే నిష్కామ కర్మము చేయువారు, వీరే నిర్నిమిత్తముగ జగదుపకారము చేయుచుందురు. అదెందుకనన వీరికే కామము లేదు. కామమనకోరిక, ఇచ్ఛ. కోరికలు తనకంటె నితరవస్తువుకును, తనకును కలుగఁజేయుబంధము. ఆత్మవేత్తలకు వేరువస్తువేదియు లేదు, తానే సర్వంబని తలంచుటచే కామమేదియు లేదాయెం గనుక నిష్కామముగ సమస్త కర్మములు సేయుచుందురు. వీరికిని, బ్రహ్మాండమందు సమస్తమునకును భేద లేకుండుటనుబట్టి సమస్తమును తాముగా చూచుటచేతను, తమయందు ప్రియము నిర్నిమిత్తముగనుండుటనుబట్టియు బ్రహ్మాండమంతయు వీరికి నిర్నిమిత్తముగ ప్రియముగనుండును.

ఎవండు తాను బ్రహ్మమనియు, బ్రహ్మ సర్వమనియు అపరోక్షానుభవముచే తెలిసికొనుచున్నాఁడో వాఁడే పరమాత్మయందు (బ్రహ్మలేక ఈశ్వరునియందు) నిర్నిమిత్త భక్తి చూపగలఁడు.

శ్లో॥ యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచ మయిపశ్యతి॥
తస్యాహం నప్రణశ్యామి, సచమే నప్రణశ్యతి

శ్లో॥ బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥

అని భగవద్గీతయందు ఈశ్వరుఁడైన శ్రీకృష్ణులుపదేశించినారు. సర్వము వాసుదేవుఁడని నన్నుచూచెడి మహాత్ములు మిక్కిలి దుర్లభము. ఆస్థితి బహుజన్మముల కనంతరము జ్ఞానులకు లభించునని తాత్పర్యము. ఇట్టివారు తప్ప ఇతరులెవరును నిర్నిమిత్తముగ ఈశ్వరుని భజింపఁజాలరు. ఈ కారణమును బట్టియే,

శ్లో॥ ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే
కుర్వంత్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః॥

కం॥ ధీరులు నిరపేక్షులు నాత్మారాములునైన మునులు హరిభజనము
ని। ష్కారణము చేయుచుందురు। నారాయణుఁడట్టివాడు నవ్యచరిత్రా

నిష్కారణముగ అనగానిర్నిమిత్తము హరినిభజించువారు నిష్కాములుగాను ఆత్మారాములుగాను, ధీరులుగాను ఉండవలెను. అట్టివారికే నిర్నిమిత్త భక్తికుదురును. వీరేజ్ఞానులు. జ్ఞానములేక ఇట్టిభక్తి కుదురదనుటనిశ్చయముగనుక భక్తికి జ్ఞానము ముఖ్యము.

నిర్నిమిత్త భక్తికి ఈక్రిందవ్రాసియుండు శ్లోకములో వివరించియుండునవి ఉపమానములుగా చెప్పఁబడినవి.

శ్లో॥ అంకోలంనిజబీజసంతతి రయఃకాంతోపలసూ్సచికా
సాధ్వీనైజవిభుంలతాక్షితిరుహంసింధుస్సరిద్వల్లభం
ప్రాప్నోతీహాయథాతథాపశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తిరుపేత్యతిష్ఠతిసదాసాభక్తిరిత్యుచ్యతే॥

అంకోలవృక్షముయొక్క (ఊడగచెట్టు) బీజములు వాన కురిసినప్పుడెట్లువిధమున ఆమ్రానికి అంటికొనునో, సూది సూదంటు రాతి నెట్లుతగిలికొనునో, పరమపతివ్రత పరీక్షని తనపతిని సర్వదా అనువర్తించియుండునో తీగెతాను అల్లికొనియుండు చెట్టు నెప్పుగిది ఎడతెగక చుట్టుకొనియుండునో, నదీనదములేలాగు వేగముగ సముద్రముఁజేరఁబోవుచుండునో అవ్విధమున మహాదేవుని పాదారవిందములెడతెగక మనసు పొందియుండుట భక్తి అని చెప్పఁబడునని తాత్పర్యము. పైనుదాహరించినవన్నియు ఎడతెగక పరస్పర మాకర్షించుటకేమి నిమిత్తముచెప్పుదురు? వానికి నిమిత్తమే లేదు. వానిస్వభావమే అట్లనువర్తించునని యందురు.

మహాపతివ్రతయగు సావిత్రి తనకెన్నివిధములగుకష్టములు దుఃఖములు ప్రాప్తమగునని తెలిసినను సత్యవంతునే వరించుట కేమి నిమిత్తమున్నది? మొదటసావిత్రిని సత్యవంతునికిచ్చి వివాహముచేయుటకు నిశ్చయించియుండ నారదులువచ్చి సావిత్రితలిదండ్రులకు ఆకన్యకను సత్యవంతునికిచ్చి వివాహముచేయుటచే మితిలేనికష్టములాబిడ్డకు ప్రాప్తమగునేగాక వివాహానంతర మొక

సంవత్సరమునకే వైధవ్యము లభించునని చెప్పెను. అప్పుడు వారు తమకొమార్తెకు వేఱువరుని వెతుకుటకు యత్నించనుద్దేశించిరి. దానినివిని సావిత్రి తలిదండ్రులయొద్దకుచని, ఇట్లువచించెను. "ఇదేమి చిత్రము, నన్ను మొదట సత్యవంతునికిచ్చి వివాహముచేయ నిశ్చయించి ఇపుడు వేరొకని కివ్వదలచినారని వింటిని. ఆర్యకన్యలకు ఇద్దరుభర్తలుండుట ఎక్కడైనకలదా? సత్యవంతునికిచ్చుటకెప్పుడు నిశ్చయించితిరో అప్పటినుండి నేనాయననే నాహృదయేశుఁడని భావించియున్నదాన, నేవేరొకని మనంబున దలచను. మీరితర ప్రయత్నముచేయకుడని" విన్నవించెను. దానికి సావిత్రి తల్లిట్లు చెప్పదొడగెను. అమ్మా, నీవుపసిదానవు, నీకుప్రపంచ విషయములేమియు తెలియవు, మంచిచెడ్డలు గుర్తెరుగవు, నిన్ను సత్యవంతునికిచ్చెదమని వాగ్దత్తముచేసితిమిగాని ఇచ్చివివాహముచేయలేదు. వివాహముసంపూర్తికాలేదు. నిన్నుమేము అమితప్రేమతో పెంచితిమి నీకు అవంతకష్టమువచ్చినను మేమోర్వజాలము. నిన్ను సత్యవంతునికిచ్చి వివాహముగావించితిమేని నీకు అమితకష్టములును, భరింపనలవిగాని దుఃఖములును ప్రాప్తమగును. అవన్నియు నీకువివరించిచెప్పెద వినుము. నీవిప్పుడు దివ్యమైన రాజగృహమందున్నావు. సత్యవంతుని పతిగాగ్రహించితివేని పర్ణశాల ప్రాప్తమగును. మహాపట్టణవాసమునకుమారు అరణ్యవాసమగును. వెలగలవస్త్రాభరణములకు బదులు నారచీరలు జడలుధరించవలసివచ్చును. పట్టువస్త్రములమీద నీహృదుపాదములిడుట విడిచి రాళ్లు, ముండ్లమీద నడచుట తటస్థించును. సేవకాస్త్రీలచే సేవచేయించుకొనుట తప్పిముసలిఅత్తకు గుడ్డిమామకును సేవచేయదగియుండును, శాల్యాన్నం, సఘృతంపయోదధి యుతంబులుగరుచ్యములు భుజించుటపోయి ఆకలములు స్వీకరించుట ఘటిల్లును. ఇవన్నియు అనుభవించవలసినదేగాక వివాహమైన ఒక సంవత్సరమునకు వైధవ్యమును

ప్రాప్తమగును. ఇన్నికష్టములపాలుచేసి మేమెట్లుభరింతుము. తల్లీ! సత్యవంతునివరించియుండుట వదలుము. నీకుతగిన వరుని వెతకెదము. ఇంకసత్యవంతుని మదిదలచకుమనిపలుకగా, సావిత్రి మారిట్లుపలికెను. అమ్మా! నన్నెంత నీచురాలుగాదలచితిరే! మహాసత్కుల ప్రసూతులగు మీశుద్ధగర్భమందు నే జనించలేదా? నేనార్యవంశజురాలనుకానా? కటకటా! నేను మీమనసులకెంత హీనముగాతోచితినే, ఏమికర్మమిది. సామాన్య స్త్రీలవలె నేనును, పట్టణవాసనిమిత్తముగాని, రాజమందిరమందుండుటకుగాని, వస్త్రాభరణముల యుద్దేశమునగాని, రుచ్యమైన భోజనాపేక్షతోగాని, సేవకాస్త్రీలచే సేవచేయించుకొనుకోరికతోగాని, మృదుమకూలములపైనదవవలెననెడి యిచ్ఛతోగాని లేక ఇతరయేనిమిత్తముతోగాని నేనుసత్యవంతునివరించలేదు. భార్యా అర్ధంమనుష్యస్య" అనిపెద్దలవచనముగలదు, నన్నుమీరు సత్యవంతునుండి విడదీసితిరేని ఒకశరీరమును రెండుగాచీల్చుటచే నెంతబాధకలుగునో అంతబాధకలుగును. నేను ఆయనలో సగమనుట తప్పనురేదియు నాకునిమిత్తములేదు. ఆయనయెడబాసి ఒకక్షణమైననుండజాల. సర్వదానామనసు ఆయనయందుండునే గాని వేరుపోదు. నాకువైధవ్యము కలుగునని చెప్పితిరి, పతియే దేహము విడిచిన ఆయనతోడనే సతియు దేహమువిడిచి వెంటనే వెళ్లును. నాకు సత్యవంతుడే, సర్వాభరణములు, ఆయననుండినచోటే నాకుదివ్యభవనము, దివ్యనగరము, ఆయనయొక్కయు ఆయన తలిదండ్రులయొక్కయు సేవచేయుటకంటె నాకెక్కువ సుఖమేదియులేదు, ఆయనయే నాకుదైవము, ఆయనయేనాఒప్పాలకుప్ప, నాహృదయేశుడు గనుక నన్ను ఆయనకేయిచ్చుటచే మీరు నాకు అనుపమమైనట్టి సుఖమును, అపారమైన ఆనందమును పొందించినట్లగును గనుక ఓ నన్నుకన్నతల్లీ! సత్యవంతునుండి నన్ను తొలగించకుడని సావిత్రిపలికెను.

భగవంతునందు నిట్టి భక్తి కలిగియున్ననది నిర్నిమిత్త భక్తి యనబడును. దానినే పరమభక్తుఁడగు ప్రహ్లాదుఁడిట్లు వివరించె.

శ్లో॥ యస్యఆశిషఆశాస్తేన వైభృత్యస్సవైవణిక్
స వైభృత్యోనసవైస్వామీగుణలుబ్ధౌ న కాముకౌ
అహంత్వకామస్త్వద్భక్తస్త్వంస్వామీఅనపాశ్రయః॥

ఎవఁడుపద్దైన ఆశచేభగవంతుని సేవించుచుండునో వాఁడు భక్తుఁడుగాఁడు వాఁడువ్యాపారస్థుఁడు. వ్యాపారస్థుఁడెవ్విధమున తన డబ్బుకొంతయిచ్చి బదులుగా అంతకంటె నెక్కువడబ్బునిచ్చు వస్తువును పుచ్చుకొనునో అవ్విధముననే ఆశచేగొలుచువాడు స్వామినుండిబదులుకోరును. ఏలాంటిఅపేక్షయు లేక ఎవడుస్వామిని కొలుచునో వాడేభక్తుడు, నేనై తేనో అకాముఁడను. నిన్నుండినే పొందవలసిన దేదియు లేదు, నీవు నాకుస్వామివి. నన్నుండినీకును ఏదియు కావలసినది లేదు. అని ప్రహ్లాదుడు స్వామితో చెప్పినట్లు భాగవతమందు దాహరింపబడినది. ఇదినిర్నిమిత్త భక్తి. సమస్తమును దృశ్యాదృశ్యములన్నిటిని ఈశ్వరునిగా భావించువానికి వేరు వస్తువెకటిఁడనుండును. అన్నిటియందును, తనవల్లభుడగు ఈశ్వరునే చూచువానికి ఇతరవస్తువెట్లుగుపడును? వాఁడుబ్రహ్మాండమే ఈశ్వరునిగా భావించి అందరికి సంతోష మొసంగుచుండును.

శ్లో॥ ఏనకేనప్రకారేణపరస్యపురుషస్యతు
సంతోషంజనయేత్ప్రాజ్ఞః తదేవేశ్వరపూజనం॥

ఎవ్విధమునగాని పరులను సంతోషపెట్టుటయే ఈశ్వర పూజయని ప్రాజ్ఞులందురని తాత్పర్యము.

సమస్తమును ఈశ్వరునిగా భావించువారి మనసు వేరువిధముగాపోవుటకు వేరువస్తువే గన్పడదు. కనుక ఇట్టిస్థితినిపొందిన వారు అవ్యభిచారభక్తి గలవారు.

ఈకాలమూకాలమనక తాను చేయు సమస్త కార్యములును భగవంతునిదని పరిశుద్ధమనసుతో చేయువానికి వేరువిధముగ కాల

ముపుచ్చుటకు విరామమే లేదు.

శ్లో॥ ఆత్మాత్వంగిరిజామతిఃపరిజనాఃప్రాణాఃశరీరంగృహం
పూజాతేవిషయోపభోగరచనానిద్రాసమాధిస్థితిః
సంచారఃపదయోఃప్రదక్షిణవిధిస్తోత్రాణిసర్వాగిరో
యద్యత్కర్మకరోమితత్తదఖిలంశంభోతవారాధనం॥

ఆత్మే నీవు, మనస్సే పార్వతి, పంచప్రాణములే పరిజనము, శరీరమే గృహము, విషయము లనుభవించుటే నీపూజ, నిద్రే యోగఫలంబగు సమాధి, పాదములచే సంచరించుటంతయు ప్రదక్షిణము, ఉచ్చరించు సమస్తమును నీస్తోత్రము, నేనుచేయు సమస్తకర్మలు నీఆరాధనమే తప్ప వేరు కాదని తాత్పర్యము.

శ్లో॥ యత్కరోషియదశ్నాసియజ్జుహోషిదదాసియత్
యత్తపస్యసికౌంతేయతత్కురుష్వమదర్పణం॥ (గీ. 9-37)

ఏదిచేయుచున్నావో, ఏదిభుజించుచున్నావో ఏదిహోమముచేయుచున్నావో ఏదియిచ్చుచున్నావో, ఏనియమములనాచరించుచున్నావో, దానిని నాకర్పింపుమని శ్రీకృష్ణులుపదేశించిరి.

సర్వదా చేయుకార్యములన్నియు భగవంతునికైనపుడు ఇతరత్రపుచ్చుటకు కాలమే లేదు గనుక నిది అవ్యవహితభక్తి.

పైచెప్పినరీతిని నిర్నిమిత్తమును, వ్యభిచారమును, అవ్యవహితమును నైన భక్తి శుద్ధభక్తి అనన్యభక్తి అని చెప్పఁబడును.

శుద్ధభక్తికి, ఏకభక్తి, నన్యభక్తి, పరాభక్తి అని నామాంతరములు కలవు.

ఈభక్తి ఎట్టివారికి సాధ్యమైనదియు శ్రీభగవద్గీతయందిట్లు వివరింపఁబడినది.

శ్లో॥ చతుర్విధాభజంతేమాంజనాస్సుకృతినోర్జున
ఆర్తోజిజ్ఞాసురర్థార్థీజ్ఞానీచభరతర్షభ॥
తేషాంజ్ఞానీనిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే
ప్రియోహిజ్ఞానినోత్యర్థమహంసచమమప్రియః॥

పుణ్యము చేసినవారు నాల్గువిధములవారు నన్ను భజించుచున్నారు. ఆపత్తులందుండువారును, బ్రహ్మ విచారపరులును, పురుషార్థములుకోరువారును, జ్ఞానులును వీరందరునన్ను భజించుచున్నారు. వీరిలో జ్ఞానులు సతతముయుక్తమనస్కులై ఏకభక్తి, అనఁగా అనన్యభక్తితో వెలుగుచుందురు. జ్ఞానులకు నేనుఅత్యంత ప్రియముగాను నాకువారుఅమితప్రీతిగానుందురని తాత్పర్యము.

ఈశ్లోకాభిప్రాయముచే జ్ఞానములేక ఏకభక్తి కుదరదని నిశ్చయమగుచున్నది. పరమార్థమును పొందుటకు భక్తిజ్ఞానములు రెండును అత్యావసరములు.

శ్లో॥ మోక్షసాధనసామగ్ర్యాంభక్తిరేవగరీయసీ
స్వస్వరూపానుసంధానంభక్తిరిత్యభిరుచ్యతే॥

అని వివేక చూడామణియందు శ్రీశంకరులానతిచ్చినారు. మోక్షమునుపొందుటకుగల సాధనములలో భక్తియే శ్రేష్ఠమైనదనియు, స్వస్వరూపమును అనుసంధానముచేయుట భక్తియనియుఁ దాత్పర్యము.

శ్లో॥ నవినాజ్ఞానవిజ్ఞానే మోక్షస్యాధిగమోభవేత్
నవినాగురుసంబంధం జ్ఞానస్యాధిగమఃకుతః॥

జ్ఞాన విజ్ఞానములులేక మోక్షము దొరకఁజాలదు. గురుసంబంధములేక జ్ఞానమెట్లుప్రాప్తమగును? అని తాత్పర్యము. జ్ఞానములేక మోక్షముదొరకదు, ముక్తుఁడుగాక పరమాత్మను అనగా ఈశ్వరుని చూడజాలఁడు. కనుక పరమార్థమునకు భక్తిజ్ఞానములు రెండును అవశ్యము.

ఇట్టిజ్ఞాన యుక్తమగు భక్తిని ఎట్లుపొందదగుననిన:—

శ్లో॥ జన్మానేకశతైఃసదాదరయుజాభక్త్యాసమారాధితా
భక్తైర్వైదికలక్షణేనవిధినాసంతుష్టఈశఃస్వయం
సాక్షాత్ శ్రీగురురూపమేత్యకృపయాదృగ్గోచరస్సన్ప్రభుః
తత్వంసాధువిబోధ్యతారయతితాన్సంసారదుఃఖార్ణవాత్॥

ఈశ్వరుఁడు అనేక శతజన్మములు, శ్రుత్యుక్తమగు విధి ననుసరించినభక్తిచేత సాదరముగ ఆరాధించుటచేత స్వయముగ సంతుష్టిచెందినవాఁడై కరుణారసముచేత గురురూపమున ప్రత్యక్షముగ కంటికగుపడి తత్త్వములను బాగుగబోధించి సంసారదుఃఖ సాగరమునుండి తరింపఁజేయునని తాత్పర్యము.

మఱియు శ్రీమద్భాగవతమునందు:—

శ్లో॥ జన్మాంతరసహస్రేషుతపోధ్యానసమాధిభిః
నరాణాంక్షీణపాపానాంకృష్ణేభక్తిఃప్రజాయతే॥

అనేకజన్మసహస్రములందు తపస్సుచేతను, ధ్యానముచేతను, సమాధిచేతను పాపములను బాపినట్టి నరులకు కృష్ణునందు శుద్ధభక్తిపుట్టునని తాత్పర్యము శుద్ధభక్తితో తప్ప వేరువిధముగ భగవంతుఁడుప్రీతిఁజెందఁడు. ఇప్పుడెందరు తాముభుజించుటకుమంచినెయ్యి ఉంచుకొని కంపునెయ్యిదేవునిదీపారాధనకెనుపయోగించుటలేదు? ఇట్టికార్యములతోభగవంతుఁడుతృప్తిచెందునా? మలమూత్రక్రిములతో నిండియుండుదేహమునకంటె భగవంతుఁడు తక్కువాయె. ఇదేమి భక్తి అనవచ్చును. ఈలాటివంతయు దంభమునకుచేయు కార్యములుకాని భక్తితోచేయు కార్యములు కావు. ఇట్టిపూజలు సేయువారి హృదయము లెట్టివని భావించవలెను? ఎవరిహృదయములు శుచిగానుండునో అట్టివారెట్టి కార్యములుచేసినను శుద్ధముగా నేయుండును. ఈశ్వరునికిహృదయమే స్థానము. శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాంహృద్దేశేఽర్జునతిష్ఠతి॥

అని గీతావాక్యములేదా? ఈశ్వరునికి స్థానమగు హృదయము సర్వప్రయత్నములచే నిర్మలముగఁగదా చేయుచుండవలయు. సామాన్యముగ లోకవ్యాపారమందును హృదయ నిర్మలముండెనేని అట్టివాఁడు అజాగ్రతచే తప్పుపనిచేసినను అపనిలెక్కగొనరు. "ఆయన అంటేకోపపడకుడు, ఆయన హృదయము మంచిదని" లోకమునసామాన్యముగ అనుకొనుచుండుట అందఱకు

తెలిసినవిషయము గనుక హృదయ నిర్మలముండువానియందే ఈశ్వరుఁడు వెలుగుచుండును. ఈ కారణమునుపట్టియే శ్రీమద్భారతమందు "తీర్థానాంహృదయంతీర్థం శుచీనాంహృదయంశుచిః"॥

అని చెప్పబడినది తీర్థములలోపల హృదయ పరిశుద్ధమే శ్రేష్ఠమైన తీర్థము, సమస్త శౌచములలో హృదయశుచియే ముఖ్యమైనశుచి. సకలమైనయాత్రలు, తీర్థస్నానములు మొదలగునవన్నియు హృదయనిర్మలమునకుగదా చేయుచుండుట? కాఁబట్టిభక్తులకుహృదయనిర్మలము చేసికొనుటయేముఖ్య కార్యము. హృదయపరిశుద్ధియెట్టిది? ఎవఁడు హృదయపరిశుద్ధముగలవాఁడనగా.

శ్లో॥ విమలమతిరమత్సరః ప్రశాంత
శ్శుచిచరితోఖిలసత్వమిత్రభూతః
ప్రియహితవచనోస్తమానమాయో
వసతిసదాహృదితస్యవాసుదేవః॥

నిర్మలమైనమనసును, మాత్సర్యరాహిత్యమును, పగలేకుండుట, శాంతమును (అనగా ఏవిపత్తువచ్చినను ఏనష్టముసంభవించినను, ఏదుఃఖముప్రాప్తమైనను, ఎవఁడెట్లునింధించినను, ఎవఁడెంత స్తోత్రముచేసినను, ఎంతలాభముపొందినను, ఎట్టిగొప్పపదవిలభించినను మనసు అటు ఇటు వికలమొందక, అలలులేని సముద్రమువలె స్థిరముగనుండుట శాంతమనఁబడును) కేవలపరిశుద్ధమైన ఆచారమును, సమస్తమైనభూతములందుమైత్రియు, ప్రియమైనట్టియు హితమైనట్టియు వాక్కునుగల మాయారాహిత్యమైన వారెవరో వారు హృదయనైర్మల్యము గలవారు. అట్టివారి హృదయమందెల్లప్పుడును వాసుదేవుఁడు నివసించియుండుననివిష్ణుపురాణమందు చెప్పఁబడినది.

ఎవరిహృదయమందు వాసుదేవుఁడు వెలుగవలెనని ఇచ్ఛయుండునో వారు పైచెప్పఁబడినగుణములను పొందవలెను. ఇట్టిగుణములుపొందకమునుపు వాసుదేవుడు వెలుగుటకుఅడ్డముగనుండు

హృదయమాలిన్యమునుతొలగించవలయు. అదేపురాణమందే;—

శ్లో॥ హరతిపరధనంనిహంతిజంతూ
న్వదతితథానిష్ఠురాణియశ్చ
అశుభజనితదుర్మదస్యపుంసః
కలుషమతేహృదితస్యవాస్త్యనంతః॥
నసహతిపరసంపదంవినిందాం
కలుషమతిఃకురుతే సతామసాధుః
నయజతినదాతి యశ్చసంతమ్
మనసినతస్యజనార్దనోధమస్య॥

పరుల ద్రవ్యమును అపహరించుట, జంతువులనుచంపుట, నిష్ఠురములైనమాటలాడుట, కల్మషమువలనబుట్టిన ఇట్టిగుణములు గలదుర్మదాంధులహృదయములందు వాసుదేవుడుండడు. పరుల శ్రేయస్సునోర్వనట్టియు, సజ్జనుల నిందసేయునట్టియు, యజ్ఞము సేయనట్టియు (పరోపకారి కానట్టియు), ఒకరికివ్వనట్టియు మనసు గలఅసాధువైననరాధమునందుజనార్దనుడుండడని తాత్పర్యము.

నిజమైన భగవద్భక్తి నపేక్షించువారందరు ఈరెండు శ్లోకములందు చెప్పబడిన దుర్గుణములను పోనాడి ఆశ్లోకములకుముందుదాహరించిన శ్లోకములలో వివరించియుండు సద్గుణములనుపొంది హృదయములను నిర్మలముగ చేసినగాని భక్తిని పొందజాలరనుట మూటికి మూమ్మాటికి నిశ్చయము.

సద్గుణములలో మొదటపొందదగినది విమలమతిఅని చెప్పబడినది. అనగా మనసును మలరాహిత్యముగ చేయవలెననుట. అశుద్ధమనసును శుద్ధముచేసికోవలెను. ఉపనిషత్తులందు మనసు రెండువిధములని యుదాహరింపబడినది:—

శ్లో॥ మనోహిద్వివిధంప్రోక్తం శుద్ధంచా శుద్ధమేవచ
అశుద్ధంకామసంకల్పం శుద్ధంకామవివర్జితం॥

మనసు శుద్ధమని అశుద్ధమని రెండువిధములు. కామసం

బంధమైన తలంపులుకలది అశుద్ధమనసు, కామములేపియు లేనిది శుద్ధమనస్సని తాత్పర్యము.

నిజమైన భక్తుఁడు సమస్తకోరికలకు మూలమగు సంకల్పములను విడుచుటచే పరిశుద్ధమనసుకలవాఁడు కావలెను. విమల మతిలేనివాని హృదయమందుభగవంతుఁడు ప్రకాశించఁడని మొదటిశ్లోకమందుస్పష్టముగ చెప్పఁబడినది. భగవంతునిపొందవలెననెడి కోరికతప్ప ఇతరపకోరికగాని లేనివాఁడెవఁడో వాఁడే భక్తుఁడగును. వాఁడేముక్తుఁడగును. ముక్తునికిగాని భక్తునికి కాని నిష్కామమనసే మొదటిచిహ్నము. ప్రతిమనుష్యుఁడు తాను నిజమైన భక్తుఁడైనది కానిదియింకొకఁడు చెప్పనక్కరలేదు. తనకుతానే తెలియవచ్చును. ఉదయమునుండిరాత్రివరకు కోరికలుతప్ప వేరొకటేదియు మనుష్యునికార్యములందు ప్రవేశపెట్టుటలేదు కదా? దేహేంద్రియమనోబుద్ధులకు సుఖంబులనితోచు ఇచ్ఛలుమనకుండునది లేనిది మనకు తెలియకపోదుగదా?

శ్లో॥ ఆత్మైవహ్యాత్మనస్సాక్షీకృతస్యాపకృతస్యచ॥

మంచిచేసినందుకు చెడ్డచేసినందుకు తనకుతానేసాక్షియని భారతమందుదాహరింపఁబడినది. కొందఱు దేహము తామనుకొన్నవారు ఆహారనిద్రాదులే కోరికలుగా కలవారలై వానికి తగిన కార్యములు సేయుచుందురు. ఇంద్రియములు తామనుకొన్నవారు, దివ్యమైనభవనములు, రమ్యమైనతోటలు, సుందరమైన స్త్రీలు, పరిమళద్రవ్యములు, పుష్పములు, మృదువైన పరుపులు ఇంపైనగానములు మొదలగుఇంద్రియములకు సుఖంబులగు వస్తుసంపాదనకు తగినకార్యములందు కాలముగడుపుచుందురు.

మనసుతామనుకొనినవారు సత్రములునియమించుట, విద్యనేర్చిపండితుఁడనిపించుకొనుట, తానుగొప్పవాఁడని ప్రసిద్ధిచెందుట మొదలగుమనసుకుల్లాసమైన కార్యములందుప్రవేసించియుందురు. బుద్ధితామనుకొన్నవారు, తమకుశాగ్రబుద్ధిచే ననేకవస్తుతత్వ

పరిశీలన చేసి, వానిసారమును, గుణమునుకనుగొని గొప్పగొప్ప శాస్త్రములు గావించుటయందు వ్రానియుందురు. దేహేంద్రియ మనోబుద్ధులకు మీరినఆత్మనిష్ఠయందును, తద్వారాబ్రహ్మనిష్ఠయందును (భగవద్భక్తి) ప్రవేసించియుండువారు కడుదుర్లభము.

చాలామట్టుకు జనులందఱు అశుద్ధమనసుగలవారని చెప్పవలసియున్నది. ఈ కారణమునుపట్టికదా "జన్మాంతరసహస్రేషు, తపోధ్యానసమాధిభిః నరాణాంక్షీణపాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే" అని చెప్పఁబడినది.

శుద్ధభక్తినిపొందవలసినప్పుడు ఈక్రింద చెప్పఁబోవుసంపత్తును పొందియుండవలయుననిశ్రీకృష్ణులుగీతయందు చెప్పియున్నారు.

శ్లో॥ బుద్ధ్యావిశుద్ధయాయుక్తో ధృత్యాత్మానంనియమ్యచ
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌవ్యుదస్యచ
వివిక్తసేవీలఘ్వాశీయత వాక్కాయమానసః
ధ్యానయోగపరోనిత్యం వైరాగ్యంసముపాశ్రితః
అహంకారంబలందర్పం కామంక్రోధంపరిగ్రహం
విముచ్యనిర్మమశ్శాన్తోబ్రహ్మభూయాయకల్పతే
బ్రహ్మభూతఃప్రసన్నాత్మానశోచతినకాంక్షతి
సమస్సర్వేషుభూతేషుమద్భక్తింలభతేపరామ్
భక్త్యామామభిజానాతియావాన్యశ్చాస్మితత్వతః॥
తతోమాంతత్వతోజ్ఞాత్వావిశతేతదనంతరమ్॥ (18.అ)

భగవంతునియందు శుద్ధభక్తిని పొందగోరువాఁడు మొదట విశుద్ధబుద్ధిగలవాఁడు కావలయును. అనఁగా బుద్ధినిశుద్ధపరచవలయును. పరమాత్మతత్వమును తెలియుటకు బుద్ధిఅత్యంత సూక్ష్మముగకూడనుండవలయును. కేవలముమందబుద్ధిగలవారు ఆత్మతత్వమును త్వరగా తెలియఁజాలరు. సూక్ష్మబుద్ధిగలవారిని అనేకులను చూడగలముగాని, సూక్ష్మముగాను, విశుద్ధముగానుండు బుద్ధిగలవారు అరుదుగాగన్పడుదురు. బుద్ధిసూక్ష్మ

నొక విషయమును త్వరలో గ్రహించి దానినే పలువిధముల అర్థముచేసి ఇతరులకు నానావిధముల అభిప్రాయములగునట్లు వాదించువారెందరో గలరు. ఒకవిషయమును ఒకప్పుడు ఒకరి పరముగాను ఇంకొకప్పుడు దానినే వారి విరోధుల పరముగాను తగిన కారణములతో వాదించు నిపుణులెందరు లేరు? బుద్ధిసూక్ష్మముచేత అతివిచిత్రములైన పనులుసేయువారేమి, అద్భుతములైన యంత్రములుకల్పించువారేమి, కట్టడములుకట్టువారేమి, ఇంకను ననేకవిధములబుద్ధికౌశల్యముచూపువారేమి, తరుచుగా కనబడుదురు. వీరు పరమాత్మతత్త్వమందు తమబుద్ధిని ప్రవేశపెట్టుట చాలాఅరుదు. ఇట్టివారికి ప్రాయశః అహంకారమెచ్చుగనుండును. దీనిచేతనే శ్రీశంకరాచార్యులవారు పరమాత్మతత్త్వమును తెలియుటకు సూక్ష్మబుద్ధియు, విశుద్ధబుద్ధియు కావలెనని సెలవిచ్చినారు. వివేకచూడామణియందు

శ్లో॥ అతీవసూక్ష్మంపరమాత్మతత్త్వం
నస్థూలదృష్ట్యాప్రతిపత్తుమర్హ
సమాధినాత్యంతసుసూక్ష్మదృష్ట్యా
జ్ఞాతవ్యమార్యైరతిశుద్ధబుద్ధిభిః॥




అతిసూక్ష్మమైన పరమాత్మతత్త్వము స్థూలదృష్టిచేత తెలియుటకుశక్యముకాదు. సమాధిచేతను, అత్యంత సూక్ష్మదృష్టిచేతను అతిశుద్ధబుద్ధిగల ఆర్యులచేత తెలియఁదగినదని తాత్పర్యము.

బుద్ధిదేనిచేత శుద్ధమగునన:—

శ్లో॥ అ [illegible]
విద్యాతపోభ్యాంభూతాత్మాబుద్ధిర్జ్ఞానేనశుద్ధ్యతి॥

జ్ఞానముచేత బుద్ధిశుద్ధమగుచున్నదని చెప్పఁబడినది. జ్ఞాని తనబుద్ధిని అనిత్యములైనట్టియు దుఃఖహేతువులైనట్టియు విచారమందు ప్రవేశపెట్టడు. సర్వదా నిత్యానందము కలుగఁజే
మార్థమునే విచారి

ఇట్టివిచారముచేత అనిత్యవస్తు విట్టిది, నిత్యవస్తు విట్టిదని దృఢపరచుకొనును. కేవలముసూక్ష్మబుద్ధికలవారికితప్ప మందబుద్ధి గలవారికి అత్యంతసూక్ష్మమైన పరమాత్మ తత్వము విచారించి గ్రహించుటకు శక్యముకాదు. విశుద్ధబుద్ధిగలిగి యుండినతప్ప అల్పములైన, అశాశ్వతములైన విషయాదిగ్రహణమందు బుద్ధిప్రవేశించక, పరమార్థవిచారమందేనిలువదు. ఈకారణమును పట్టియే శ్రీకృష్ణులు పరాభక్తికి మొదటిమెట్టు విశుద్ధబుద్ధియని సెలవిచ్చిరి.

సూక్ష్మమైనట్టియు విశుద్ధమైనట్టియు బుద్ధిచేత పరమాత్మతప్ప ఇతరమైనవన్నియు అనిత్యమైన దుఃఖయుక్తమైన సుఖములేగాని బహిరంతస్సదానందమునిచ్చునవి కావని గ్రహించవచ్చును. బుద్ధిచేత పరమాత్మ సదానందుఁడని గ్రహించినమాత్రమే చాలునా? ఇదేనా పరమావధి? ఇదిచాలదు, ఇదేపరమావధి కాదు. ఈఆనందమును, అనగా సదానందస్వరూపుఁడైన పరమాత్మను, తాను పొందవలెను. సదానందముతనది కావలయును, తానుఆయానందమనుభవించుచుండవలయును. పరమాత్మనుపొందవలెననినదర్థమేమి? పరమాత్మ సదానందుఁడు. ఆయననుపొందవలెననిన తాను సదానందుఁడు కావలెననుట స్పష్టము.

ఎట్లుపొందవలెనన? ఈపరమాత్మను పొందుటకు విరోధమైనవేవియో వానిని జయించవలెను. విరోధులను జయించవలసియున్న, ధృతియు (ధైర్యము) తగిన ఆయుధమును కావలయును. గనుకనే శ్రీకృష్ణులు "ధృత్యాత్మానం నియమ్యచ" అని పరాభక్తికి ధృతిరెండవమెట్టుగా అర్జుననికి బోధించిరి.

శాండిల్యోపనిషత్తునందు ధృతి లక్షణమిట్లుచెప్పబడినది.

శ్లో॥ ధృతిర్నామఅర్థహానౌ స్వేష్ట
బంధువియోగేతత్ప్రాప్తౌ సర్వత్రచేతస్థాపనం॥

ధృతి అనగా తాను సంపాదించిన ద్రవ్యము సర్వము పోయినను, స్వకీయులైన ఇష్టులు, బంధువులు, ఇవన్నియు నష్ట

మైనను మనసును స్థిరముగా నిలుపుట అని తాత్పర్యము. ఇట్టి సందర్భములు అనగా ద్రవ్యనష్టము, బంధుమిత్ర నాశనము గృహస్థాశ్రమమందు తప్ప వేరెచ్చటను సంభవించదనుట విశదము గనుక గృహస్థాశ్రమమే శత్రువులను జయించుటకు తగిన యుద్ధరంగము. జీవుఁడు బహుజన్మములనుండి శత్రుసమూహము కామక్రోధలోభ మోహమదమాత్సర్యములచేఁజిక్కి అహంకారము రాజవశుఁడై తప్పించుకొనుటకు శక్తిలేక పలువిధముల బాధపడి పడి చివరకు విశుద్ధబుద్ధిని పొంది విచారింప బూని ధృతిని పొందును. ఈధృతిచేత క్రమక్రమముగ నొక్కొక్క శత్రువునుగా జయించుచు రావలెను. అదెట్లజయించవలెననిన:—

శత్రురాజగు అహంకారముయొక్క మొదటి సేనానాయకుఁడు కామము. వీనిని తొలుత జయించినట్లయిన వీనిని అనుసరించి విచ్చలవిడి సంచరించుచు నమిత పరాక్రమము చూపు క్రోధమను రెండవ సేనానాయకుఁడు తనంతటనే జయింపఁబడి వశుఁడగును. ఎప్పుడుక్రోధమను రెండవ సేనానాయకుఁడువశపడునో వానిననుసరించి పోరాడు లోభమను సేనానాయకుఁడు ఫలాయనమగును. ఇట్లు అహంకారమనుశత్రురాజును మహాపరాక్రమశాలురగు సేనానాయకులను ఎప్పుడుజయించితిమో, వెంటనేపర సేనయంతయుమనకులోబడిమనఆజ్ఞానుసారముగ ప్రవర్తించును. అప్పుడు పరమాత్మను పొందుటకు పోవలసిన మార్గమందు భంగపరచు శత్రువులెవరును లేకుండుటను పట్టి నిరాటంకముగ ఆ మార్గమందు ప్రవేశించిపరమానంద స్వరూపుఁడగు పరమాత్మను అనన్యభక్తిచేపొందవచ్చును.

సామాన్యముగ శత్రువులనుజయించ నిశ్చయించినవాఁడు శత్రుబలమునకు మూలస్థానమేదైనది విచారించి దానిని నాశము చేయుటకెన్నియుపాయములు, ఎన్నిసాధనములు, ఎన్నియేర్పాట్లుచేయవలెనో బాగుగవిచారించి దానిని నాశమొనరించును.

శత్రువులయొక్క సామర్థ్యమును సయితము లెక్కగొనును.

అవ్విధముననే మనముకూడ శత్రుసామర్థ్యపరిమితిని తెలియవలెను. మొదటజయించఁదగిన కామక్రోధములనెడి సేనానాయకుల బలమెట్టిదని తెలియవలెను. వానిబలమెట్టిదైనది యు భగవద్గీతయందిట్లు వివరింపఁబడినది.

శ్లో॥ కామఏషక్రోధ ఏషరజోగుణసముద్భవః
మహాశనోమహాపాప్మావిద్ధ్యేనమిహవైరిణం॥

రజోగుణమునుండిపుట్టిన కామము, క్రోధము అత్యంత ఆశనము కావలసినవిగాను అమితపాపకరమైనవిగానున్నవి. వీనిని గొప్పశత్రువులుగా తెలియుమని తాత్పర్యము.

ఎప్పుడు ఈ యిద్దరు సేనానాయకులు అమిత ఆశగలవని తెలియుచున్నదో అప్పుడేభక్తిగోరువారు, శత్రువులను జయించుటకు ఏర్పడిన సామ, దాన, దండ, భేదములగు చతుర్విధోపాయములలో దానముచే జయించుటకివి శక్యముకాదని తలంచి వీనిమూలస్థానమును నాశ మొనర్చుటకు దండోపాయమును పూనవలెను. ఈ కామక్రోధమనుశత్రుసేనానాయకులను దానముచేత జయించనశక్యమైనవగుటచేతనే మనుస్మృతియందును, విష్ణుపురాణమందును ఇట్లుచెప్పఁబడినది.

మను॥ నజాతుకామఃకామానా ముపభోగేనశామ్యతి
హవిషాకృష్ణవర్త్మేవభూయఏవాభివర్థతే॥

విష్ణుపురాణం॥ మనోరథానాంనసమాప్తిరస్తి
వర్షాయుతైర్వాయదివాపిలక్షైః
పూర్ణేషుపూర్ణేషుపునర్నవానాం
ఉత్పత్తయస్సంతి మనోరథానాం॥

ఎప్పటికైనను కామము, కామ్యవస్తువులనుభవించుటచే శమించునదికాదు, అనుభవించినకొలది ప్రజ్వలించుచుండెడి మంటయందు నెయ్యిపోసినకొలది మంట హెచ్చునట్లు హెచ్చుచునే

యుండునని మొదటిశ్లోకముయొక్క తాత్పర్యము. మనోరథముల కనగా కామములకు లక్షసంవత్సరములుపభోగించినను అంతమే యుండదు. ఒక్కొక్క కామము అనుభవించుటచేతృప్తిచెందించుచు రానురానుమరియుక్రొత్త కామములుత్పత్తియగుచున్నవని రెండవ శ్లోకాభిప్రాయము. ఈ కారణముచే కామమను శత్రువును దానముచే గెల్చుటకాదు. •

అదిదండముచేతనేసాధ్యముకావలెను. దీనిజన్మస్థానమేదో దానిని నాశముచేసినట్లయిన మరలపుట్టుటకు చోటులేకపోవుటచే కామము నాశమగును. దీనిజన్మస్థానమేదన, భగవద్గీతయందు

శ్లో॥ సఙ్కల్పప్రభవాన్కామాంస్త్యక్త్వాసర్వానశేషతః
మనసైవేన్ద్రియగ్రామంవినియమ్యసమన్తతః

సఙ్కల్పములనుండిపుట్టిన కామములను విడిచి, మనసుచేనింద్రియ సమూహమును నియమించవలెనని తాత్పర్యము. మఱియు,

శ్లో॥ కామజానామితే మూలంసంకల్పాత్త్వంహిజాయసే
నత్వాంసంకల్పయిష్యామితస్మాత్త్వంనభవిష్యసి॥

ఓ కామమా! నీమూలము నేనెఱుగుదును. నీవు సంకల్పములనుండి పుట్టుచున్నావుగనుక నేనునిన్ను సంకల్పించను. దానిచేత నీవు మరల పుట్టవని తాత్పర్యము. కామములను చంపవలయునన్న దానిమూలమగు సంకల్పమును ఛేదించవలెను.

ఏసంకల్పముగాని లేకుండుట సాధ్యమా? నరుడుసర్వదా ఏదైనసంకల్పించుకొని ఆసంకల్పమునెరవేర్చుకొనుటకు సకలకార్యములుచేయుచుండునేగాని సంకల్పములు లేనివానినెచ్చటనుసామాన్యముగ చూడలేము. నిద్రయందు తప్ప నితరసమయములందంతయు సంకల్పమహిమచేతనే సమస్తమును జరుగుచుండును. ఈశ్వరుడు సంకల్పముచేతనే జగత్తునుసృజించెనని చెప్పుదురు. సామాన్యముగ సంకల్పములేకుండవలెననిన నిద్రపోవలెనని అర్థమగుచున్నది. అదియుండెసంకల్పములు విడువవలసినది, ఎట్లు

విడువవలసినది

శ్లో॥ ధ్యాయతోవిషయాన్పుంసస్సంగస్తేషూపజాయతె
సంగాత్సంజాయతేకామః కామాత్క్రోధోభిజాయతె
క్రోధాద్భవతిసమ్మోహస్సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥

విషయములను ధ్యానించుటచే సంగము (వానియందురాగము, పొందవలెననెడి ఆసక్తి) కలుగుచున్నది, దానినుండి కామముత్పత్తియగుచున్నది, తద్వారా క్రోధ ముద్భవించుచున్నది, క్రోధమునుండి మోహము జనించుచున్నది, మోహముచే తెలివితప్పుచున్నది, తెలివిలేమివినాశనమునకు కారణమగుచున్నది. కనుకవిషయసంగసంకల్పములను విడువవలయునని అర్థముచేయవలయునేగాని అన్నిసంకల్పములను విడువవలయుననికాదు.

ఇంద్రియవిషయములను ధ్యానించి తద్వారా ఉత్పత్తియగు కామమును తీర్చుకొనుటకు చేయుప్రయత్నశక్తిని, సద్విషయములను ధ్యానించివానిని పొందుటకు సర్వప్రయత్నములుచేసి, వినియోగించవలయును. ఇంద్రియవిషయములనగా ఇంద్రియములకు తాత్కాలికసుఖములని తోచువస్తువులు. అవేవన పురుషులకుస్త్రీలు, స్త్రీలకుపురుషులు; నానావిధములైన సుగంధవస్తువులు; రుచ్యములగు భోజనపదార్థములునుపానీయంబులును; వీరోద్రేకమును కలుగజేయు యింపైనపాటలును, మాటలును, ఆటలును, మొదలగునవి. స్త్రీపురుషులపరస్పరసంస్పర్శముత్వగింద్రియమునకు సుఖముగాదోచును. వాసనగల పదార్థములు ఘ్రాణేంద్రియమునకు సుఖమిచ్చునట్లుండును, భోజనపదార్థములును, పానీయంబులునుజిహ్వేంద్రియమునకుబాగుగగన్పడును. ఇట్లువివిధంబులగు వస్తువులు వేర్వేరు ఇంద్రియములకు సుఖములుగాదోచును. ఇవన్నియు స్వల్పకాలము సుఖములుగా దోచునట్టివిగా నుండుటేగాక అనుభవించిన వెనుక అమితదుఃఖమును కలుగజేయును గను

కనే శ్రీశంకరాచార్యులవారు పంచరత్నస్తుతియందిట్లు చెప్పినారు.

శ్లో॥ స్రక్చందనవనితాదీన్విషయాన్ సుఖదాన్మత్వావిహరసే । గంధఫలీసదృశానను తేమీభోగానంతరదుఃఖకృతః । చేతోభృంగభ్రమసివృథాభవమరుభూమౌనిరసాయాం । భజభజలక్ష్మీనరసింహానఘపదసరసిజమకరందమ్॥ •

స్రక్చందనవనితాది విషయములను సుఖమిచ్చునట్టివిగా తలంచి అనుభవించెదవు. ఇవన్నియు ఓమనస్సను తుమ్మెదా, చంపక పుష్పములవలె భోగానంతరము దుఃఖముకలుగ జేయునట్టివిగనుక. సంసారమనెడి చవిటినేలయందు వృథావిహరింపకుము లక్ష్మీనృసింహుల పాదపద్మములను భజించి మకరందమును పానముసేయుమని తాత్పర్యము. స్త్రీపురుష సంగమువిశేషసుఖమిచ్చునని భ్రమించి ధర్మముతప్పి అమితముగ చేసినట్లైన రోగముత్పత్తియగును. "భోగేరోగభయం" అనిభర్తృహరి వాక్యము కలదు. "సౌఖ్యంబిందుమాత్రేణ దుఃఖంపర్వతమేవచ" అని లోకోక్తిగలదు. గనుక స్త్రీపురుషసంభోగము క్షణమాత్ర సుఖకరమైనదిగాని నిరంతర సుఖకరంబైనదికాదు. రుచ్యములైన భోజ్యంబులను మితిమీరి తినినట్లైన జీర్ణించక నానావిధములగు రోగములకాకరమగును. ఇట్లనే ప్రతివిషయమును భోగానంతరము దుఃఖముకలుగజేయునవి గనుక విషయసంగకామమును, ఆకామము పుట్టుటకుకారణమగుతత్సంబంధమైన సంకల్పములను వదలవలయునని చెప్పఁబడినది. ఎప్పుడు కామముత్పత్తియగుటకుబీజమగువిషయ సంకల్పము నాశమగునో, అప్పుడే కామమునుండి పుట్టెడిక్రోధము లేకనేపోవును. క్రోధముపుట్టుటకు బీజమగు విషయకామమే నాశ మొందినవెనుక క్రోధ మెట్లుత్పత్తియగును? తనతండ్రియగు కామమెంతబలవత్తరమైనదో క్రోధమునుఅట్టిదే. ఇదియు అహం

కారమును రాజుకుబలిష్టమైన సేనానాయకులు. వీని నెంతమాత్రమైనను మనసునందుంచి పెంచగాదు. పెంచితిమా సమస్తదోషముల పాలుచేయును. క్రోధమునకు చిక్కినవాడు త్రాగుబోతువలె, మంచిచెడ్డలు రెండునుగుర్తించక ఎట్టిదుష్కార్యమునైనను చేయును. ఆంజనేయుడు సీతాన్వేషణమునకైలంకకు పోయియుండినపుడు రావణాసురునిమీద మిక్కిలికోపపడి ఆక్రోధముచేత లంకను కాల్చి అనంతరము సీతకూడా కాలిపోయెనేమోయనెడిశంకచే మిగులభీతిచెంది తానుక్రోధమునకు చిక్కినందుకై మిగులదుఃఖించి క్రోధమునుగురించి యిట్లు వివరించుచున్నాడు:—

"శ్లో॥ క్రుద్ధఃపాపంనకుర్యాత్కః క్రుద్ధోహన్యాద్గురూనపి
క్రుద్ధఃపరుషయావాచానరస్సాధూనధిక్షిపేత్
వాచ్యావాచ్యంప్రకుపితోనవిజానాతికర్హిచిత్
నాऽకార్యమస్తిక్రుద్ధస్య నావాక్యంవిద్యతేక్వచిత్

క్రోధముగలవాడేపాపముచేయడు? అనగా ఎట్టిపాపమునైనచేయునని తాత్పర్యము. క్రోధముగలవాడు గురువునైనను చంపును, పరుషవాక్కులతో సాధువులనుకూడాధిక్కరించును, అట్టివాడు ఏమాత్రమైనను ఇది అనవచ్చును ఇది అనరాదని ఎరుగడు, క్రోధికి అకార్యమేదియులేదు, ఆడరానిదేదియులేదు, ఎట్టికార్యమైన చేయును, ఎట్టిమాటనైన నాడును.

ఈకారణముచేతనే అదేగ్రంథమందచ్చటనే దానిని చంపు విధమును, చంపినవాని శ్రేష్ఠత్వమును యిట్లువర్ణించబడినది.

శ్లో॥ యస్సముత్పతితంక్రోధం క్షమయైవనిరస్యతి
యథోరగస్త్వచంజీర్ణాం సవైపురుషఉచ్యతే॥

ఎవడైతే పుట్టినటువంటి క్రోధమును, పాము జీర్ణమైన పొరనువిడిచినట్టు విడుచుచున్నాడో వాడేపురుషుడని తాత్పర్యము. క్రోధమునుచంపుటకు క్షమయే ఉత్కృష్టమైన సాధనము. క్షమగలవాడే పురుషుడు, పౌరుషముగలవాడు. ఇట్లు క్రోధమునుచంపి

నవాడే ధన్యుడనియు, పురుషశ్రేష్ఠుడనియు చెప్పబడినది.

శ్లో॥ ధన్యాస్తేపురుషశ్రేష్ఠాయేబుద్ధ్యాకోపముద్ధితం
నిరుంధంతిమహాత్మానో దీప్తమగ్నిమివాంభసా॥

ఏమహాత్ములు తమయందుత్పత్తియైన కోపమును నీళ్లచే అగ్నిని చల్లార్చినట్లు, బుద్ధిబలముచేత నిరోధించుచున్నారో వారు పురుషశ్రేష్ఠులు ఉత్తమపురుషులును, ధన్యులునని అభిప్రాయము.

కనుకనే భగవద్గీతయందు,

శ్లో॥ శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్
కామక్రోధోద్భవంవేగం సయుక్తస్ససుఖీనరః

శరీరము విడువకముసుపే అనగా జీవితకాలమందే ఇక్కడనే అనగా నీ భూలోకమందు ఎవడు కామక్రోధములచే గలుగు బాధను భరించుటకు శక్తుడగుచున్నాడో వాడేయుక్తుడు, వాడే సుఖియని చెప్పబడినది. అనగా కామక్రోధముల నణచినవాడు శాంతమునుబొంది సుఖియగునని తాత్పర్యము. కామక్రోధము లుండువానికి పరాభక్తి ఎప్పటికిని లభించదు. సద్గురువులుఆత్మ విద్యను అట్టివానికి బోధించరు.

దీనికావలవచ్చు లోభమింతకంటె తక్కువైనదికాదు. ఇవన్నియు సమానమైనబలముగల శత్రువులు. దీనినిజయించుట మనుష్యులకు మిగులకష్టము. దేవతులకు కామమెచ్చుగను, రాక్షసులకు క్రోధమధికముగను, మానవులకులోభమెక్కువగనుండును. లోభమనతృష్ణ, ధనకాంక్ష, ఆశ. ఆశాపాశమునుండివదల్చుకొనుట అమితకష్టము.

మహాభారతమందు తృష్ణను గురించియిట్లు వివరించబడినది.

శ్లో॥ తృష్ణాహిసర్వపాపిష్ఠా నిత్యోద్యోగకరీస్మృతా
అధర్మాబహుళాచైవ ఘోరాపాపానుబంధినీ
యదుస్త్యజాదుర్మతిభిః యానజీర్యతిజీర్యతః
యోసౌప్రాణాంతకోరోగః తాంతృష్ణాంత్యజతస్సుఖం

అనాద్యంతాతుసాతృష్ణాఅంతర్దేహగతానృణాం
వినాశయతిభూతాని అయోనిజయివా నలః॥

తృష్ణ, అనగా లోభము, మిక్కిలి పాపిష్ఠమైనది, ఎల్లప్పటికి నేరైదైనపని చేయుచుండును. పలుతెరగులగు నధర్మములచే యించుచున్నది, ఘోరమైన పాపముల పాలుచేయుచున్నది, దుర్జనులచేవిడుచుట కశక్యమైనది, మనుష్యుడు సమసినను అది సమయదు, మనుష్యుడుతగ్గినను అది పెరుగుచుండును, ప్రాణాంతమువరకునుండు రోగముగనుక త్యజించదగినది, దానికిఆద్యంతములులేవు నరులకుదేహములో నాటియుండును. ప్రాణులనువినాశముచేయు అగ్నివలెనుండునని తాత్పర్యము. కామక్రోధలోభములు మూడును బలిష్టములైన శత్రువులు, నరకమునకుముఖ్యసాధనములు గనుక నే భగవద్గీతయందు,

శ్లో॥ త్రివిధంనరకస్యేదంద్వారంనాశనమాత్మనః
కామఃక్రోధస్తథాలోభస్తస్మాదేతత్త్రయంత్యజేత్॥

అనిచెప్పబడినది. కామక్రోధలోభములు ఆత్మనాశహేతువులగుచు ద్వివిధములైన నరకద్వారములుగనుక ఈమూటినివిడువవలయునని అర్జునునికి శ్రీకృష్ణులు బోధించినారు.

మోహమును ప్రబలమైన సేనానాయకుడే. మోక్షాపేక్షకలిగి ఈశ్వరభక్తికోరువారందరికి మోహము మృత్యువుగానుండును గనుక వివేకచూడామణియందిట్లు చెప్పబడినది.

శ్లో॥ మోహఏవమహామృత్యుర్ముముక్షోర్వపురాదిషు
మోహోవినిర్జితోయేనసముక్తిపదమర్హతి
మోహంజహిమహామృత్యుం దేహదారసుతాదిషు
యంజిత్వామునయోయాంతితద్విష్ణోపరమంపదం॥

ముముక్షువులకు అనగా ముక్తిగోరువారికి శరీరాదులందు మోహముఅనగా భ్రాంతి మహామృత్యువుగానుండును. ఎవనిచేనిది జయింపబడుచున్నదో వాడుమోక్షమునకు యోగ్యుడగును

గనుక దేహమందు, భార్యయందు, కొడుకులందుండు మహా మృత్యురూపమైన మోహమును జయింపుము, దానిని జయించి మునులు విష్ణుపదమును పొందుదురని తాత్పర్యము.

కనుకనే భగవద్గీతయందు పుత్రదారగృహాదులందు మోహమువదలి వర్తించుటజ్ఞాన సాధనముగఁ జెప్పఁబడినది.

శ్లో॥ అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు

పుత్రకళత్ర, గృహము మొదలగువానియందు ఆసక్తి అనగా మోహమువదలియుండుటె జ్ఞానమునకు హేతువని తాత్పర్యము.

మదమత్సరములును అట్టివే. మదముగలవారిని అంధులని చెప్పుదురు. వారిని మదాంధులనుదురు. మదముగలవారు పెద్ద చిన్న లెరుగరు. తమకంటెగొప్పవారెవరును లేరని విఱ్ఱవీగుదురు. వీరికి వివేకమెట్లులభించును? మత్సరముండువానికి నిదురరాదు. మత్సరమునుభయమును ఎల్లప్పటికి కలసియుండును. భయముండు వాడు నిదురలేకకుండును. కాబట్టిమత్సరమును బలమైన శత్రువు గనుక ఈ ఆర్గురు శత్రువులను జయించవలెనని వసిష్ఠులవారు చెప్పినారు. ''అరిషడ్వర్గంజహి'' అని చెప్పబడినది.

ఈశత్రుసేనానాయకులను తెగటార్చుటెట్లు? వీరుపత్రదేశమందుతమ పరాక్రమముచూపుదురు? వీరు పరాక్రమతిశయించి నపుడు ఎట్టిధైర్యముండవలసినది?

గృహస్థధర్మము క్రమముగ నడుపువాడు ఏవిధమున ధృతి చూపి శత్రువులను జయించి స్వామి మెప్పుపడయవలసినది ఈదిగువ వివరింపఁబడును.

గృహస్థుగానుండు వానికి, పుత్రకళత్రాది బంధువులనుపోషించుటకును, అతిథి అభ్యాగతులను సత్కరించుటకును, దేవతులకు, పితరులకు హవ్యకవ్యములొసంగుటకును, ద్రవ్యమొనగూర్చుట అవసరమైయుండును. ఒనగూర్చినద్రవ్యము నష్టమైపోవుట సంభవించును, పుత్రకళత్రాదులు అనుకూలముగనుండుటయు,

ప్రతికూలముగ నుండుటయు తటస్థించును. అనుకూలముగానుండు పుత్రకళత్రాదులు మృతులగుటయు ప్రాప్తమగును. దరిద్రుడు గానుండు గృహస్థునకు బహుకుటుంబ పోషణయు ఘటిల్లును. ఇవి ప్రాప్తమైనప్పుడు భగవంతునందనన్యభక్తిపొంద నపేక్షించువా డెట్లు ధృతిచేత మనస్సును నిగ్రహించవలసినది ఈక్రింద వివరింపబడును.

అనన్యభక్తినపేక్షించదలచిన గృహస్థుతనకుటుంబ పోషణార్థమై న్యాయముదప్పకధనమార్జించవలెగాని అన్యాయముగా ఆర్జించదగదు.

"శ్లో॥ అన్యాయేనార్జితైర్విత్తైర్యఃకరోత్యౌర్ధ్వదేహికం।
నసతస్యఫలంప్రేత్యభుజ్తేఽర్థస్యదురాగమాత్ ॥"

అన్యాయముగ సంపాదించిన ద్రవ్యముచేత పారమార్థిక కార్యముల చేయదలచినవాడు, తప్పుదారినుండి ద్రవ్యముపొందియుండిన కారణముచే ఆఫలమును అనగా పరమార్థఫలమును పొందజాలడని దక్షస్మృతియందు చెప్పబడినది.

"శ్లో॥ న్యాయాగతంధనంచైవ న్యాయేనైవవివర్థితం।
సంరక్ష్యంయత్నమాస్థాయధర్మార్థ మితినిశ్చయః॥
నధర్మార్థంనృశంసేన కర్మణాధనమార్జయేత్ ।
శక్తితఃసర్వకార్యాణికుర్యాన్నర్ధిమనుస్మరేత్ ॥"

న్యాయముగ సంపాదించిన ద్రవ్యమును న్యాయముగ వృద్ధిచేసి న్యాయముగ ధర్మార్థమునకయి రక్షించవలయు. ధర్మార్థమునకుగాను కాఠిన్యముచే ద్రవ్యముకూర్చకూడదు. తనకు న్యాయార్జన ద్రవ్యముచే సత్కర్మములు చేయుటకెంత శక్తియుండునో అంతలోనే సమస్త కార్యములును చేయవలెనని తాత్పర్యము.

పరమాత్మయందుఅనన్యభక్తి సంపాదించుటకంటె నెక్కువైనధర్మమేదియు లేదని ధర్మరాజు భీష్మాచార్యులవారిని ("కోధ

ర్మస్సర్వధర్మాణాంభవ తఃపరమోమతః") అన్ని ధర్మములకంటె నెక్కువ ధర్మమేదిఅనిఅడిగిన ప్రశ్నకు ఉత్తరమిచ్చినారుగనుక పరమ ధర్మంబగు భగవద్భక్తి నపేక్షించు వాడెప్పటికిగాని, అన్యాయముగకుటుంబ పోషణార్థమైధనమార్జించదగదు.

భక్తిని సంపాదింప నిశ్చయించినవానికి రు౧౫ పదైమరూపాయలు మాత్రము మాసమునకు వరుమానముండి ఇరువదిమంది గల కుటుంబమును భరించవలసినపుడు, ఆయన రు 15లలో ఆకుటుంబమునకును తనకు నెంతమాత్రము సుఖముకలుగుట సాధ్యమో అంతమాత్రము సుఖముతో తృప్తిజెందియుండవలెగానిఆనెుత్తమునకు మీరిసుఖమునుకోరరాదు. ఒకవేళ రెండువేళలభుజించుటకు చాలకపోయినల్లైన ఆకలిభరింప జాలని పసిబాలురకును వృద్ధులకును రెండువేళల భుజింప జేసిపెద్దవారందరును ఒకవేళమాత్రము భుజించుచు దేహయాత్ర జేయవలయునుగాని అధర్మముచే సంపాదించి దేహమునకు అవశ్యమైనవి సయితమొనర్చదగదు. తాను దినయాత్ర నడుపునపుడు ఇవ్విధంబున ధృతిచేత మనస్సునునిరోధించవలెను.

ఓదయానిధే, నీవుత్రిలోకకుటుంబివి. నాకును నాకర్మానుసారముగ నింత పెద్దకుటుంబము నిచ్చినావు. వీరిసంరక్షణకు వీరికర్మానుసారంబుగను నాకర్మానుసారంబుగను రు 15లుమాత్రము నియమించియున్నావు. నీవు నియమించినకర్మఫలమగు హద్దునతిక్రమించకవీనినిరక్షించుచు నేనుజీవించెదనని చెప్పుచు, కార్యమందు తనఆయమునమసరించి పుత్రకళత్రాదులకన్న వస్త్రములమర్చుచు అప్పులుచేయక, అధర్మమందు ప్రవేశించక, యన్యులనొప్పించక, తానొవ్వక మిక్కిలిసంతుష్టిజెంది భగవత్ప్రీతిగ కుటుంబమును పోషించు చుండవలెనుగాని వేరువిధముగ వర్తించదగదు.

భార్యాపుత్రులు ఇరుగుపొరుగుధనికులయింటిస్త్రీలుబాలురు పండుగదినములందు వెలగల వస్త్రములను శ్రేష్ఠమగు ఆభర

ణములను ధరించియుండుటను చూచి మాధ్యముచేతమనకును అట్టి వస్త్రాభరణములను తెచ్చియివ్వని బాధపెట్టగా, వారికికర్మఫల సిద్ధాంతము బోధించి సమాధానపరచి ప్రాప్తమున్నంతటితో తృప్తి చెందునట్లుచేయవలెనుగాని నీతిమార్గము తప్పిఅన్యుల నొప్పించి వెలగల వస్త్రాభరణములనిచ్చి తృప్తిచెందించదగదు. అట్లు అధర్మార్జనచే భార్యాపుత్రులను తృప్తిచెందించువాడు యిహపరములందుదుఃఖపడును. వానికిభక్తియెప్పటికినిరాజాలదు.

శ్లో॥ సంచినోత్యశుభంకర్మకళత్రాపేక్షయానరః ।
తతఃక్లేశమవాప్నోతి పరత్రేహత్రైవచ॥

భార్యను తృప్తిచెందించవలెనని ఎవడు అశుభకర్మ (అధర్మము) చేయుచున్నాడో వాడు ఈలోకమందును, పరలోకమందును దుఃఖమునే పొందును.

శ్లో॥ మోహేనహింసమావిష్టఃపుత్రదారార్థముద్యతః
కృత్వాకార్యమకార్యంవాతుష్టిమేషాంప్రయచ్ఛతి॥

మోహముతోఎవడు దారాపుత్రాదులను కార్యమునోఅకార్యమునో చేసి తృప్తిచెందించుచున్నాడో వాడుబద్ధుడై దుఃఖమనుభవించునుగనుక భక్తుడగువాడు తనకున్నంతలోనే సర్వకార్యములు చేయవలెను.

ఇదిగాకభక్తుడు తనకు ప్రారబ్ధానుసారముగపపనిచేయుట ప్రాప్తమైయుండునో ఆపనితోనేతృప్తిచెందియుండు. దానినీచమైనదని తలంచి, తానుపొందుటకును పొందినను బాగుగనెరవేర్చుటకును అలవిగానియితరులపనులందాశపడితనకు లభించినపనిని ఉపేక్షించివృథాగ్రుందదగదు. తనకుప్రాప్తమైనపనినే తనమనో నిర్మలభావముచే పవిత్రపరచి దానినే భగవదర్పణచేయును. అదెట్లనిన:—కాశీపట్టణమున గ్రామపరిశుద్ధసంఘు(Municipal) సేవకుడొకడుండెను. వానికి ఆపట్టణములో నొకప్రదేశమందు కొన్ని వీథులలో దీపములు వెలిగించుపని జీవనమునకై ప్రాప్తమైయుం

డెను. వాడుపరమభక్తుడు, తానుచేసెడిపనులంతయు పవిత్ర పరచి భగవదర్పణ చేయుచుండెను. వేకువలేచి గంగయందు స్నానముచేసి, తనకులాచారములను క్రమముగ దీర్చికొని తనకు నియమింపబడిన పనిని సేయుటకుగాను నూనెనంతయు నేమాత్ర మైన అపహరింపక తనకుస్వాధీనపరచిన లాంద్రలలో నించివత్తు లను బాగుగ కత్తరించి అన్నార్పి,, లాంద్రలను శుభ్రముగ ఏమాత్ర మైన మలినములేక కడగితుడిచిసిద్ధముగనుంచి సాయంత్రినియమిత కాల మతిక్రమించక అన్నిలాంద్రలను వెలిగించుచుండెను. ఈపై చెప్పిన పనులు చేయునపుడంతయు ''జానకిజీవనరాం కరింగే తే రే కాం'' ఓజానకీపతియయినరామచంద్రా నేనునీపనిచేయుచు న్నానని పాడుచుండెను. వీడుదీపములు వెలుగించుపని భగ వంతుఁడేతనకు ప్రారబ్ధానుసారముగ నిచ్చినాడనితలచి, ఆయన యిచ్చినపని నేమాత్రమైన ఉపేక్షించక కేవలవిశ్వాస పూర్వ కముగ ఆపనియందు లేశమైనలోపములేక పరిపూర్తిఎట్లుచేయశ క్యమో అట్లుపరిపూర్తి చేసిభక్తిపూర్వకముగ ''ఓదీనబంధూ! నా కెట్టిశ్రేష్ఠమైనపనినియమించితివి, తండ్రీ! దీనిచేతనీపూజలెంతబా గుగ చేయుసమయముదొరకె! నీవుజ్ఞానచక్షువులిచ్చి అజ్ఞానాంధ కారమునుతొలగించి నాకునీనిజరూపమునుదర్శనమిచ్చి ఆనందింపఁ జేయుదువు.

శ్లో॥ సాక్షాత్ జ్ఞానస్వరూపస్యకుతోదీపప్రభాభవేత్ ॥

సాక్షాత్ జ్ఞానస్వరూపునికి దీపప్రభచే నేమిప్రయోజనము? నేను వెలిగించుదీపములతో నీకేమిప్రయోజనము లేకపోయినను, నీఅంశలేహృదయములందు గలమనుష్యులకు రాత్రికాలమునగలిగి న అంధకార నివారణ నేనువెలిగించు దీపములచేగావించి వారి నానంద మొందించి నన్నుకృతార్థునిచేయుచున్నావు. ఇదెంత దయ'' యని స్వామినిపొగడుచు తనకబ్బినకార్యమును భగవ త్ప్రీతిగచేయును.

ఇవ్విధమున తమకబ్బినయేపనిగాని సర్వభూతహితమునకు లోపము చేయక సమర్పించిన భగవంతుఁడు తృప్తిజెంది భక్తులకు భక్తివృద్ధిచేసి ప్రీతిచెందునుగాని, గొప్పయుద్యోగములు చేయుచు లంచములుతినుచు, అధికారబలము బీదలందుచూపి వేధించువారియెడగాని, విశేషముగ వ్యాపారములుచేసి బహుమందికి ద్రోహముచేసి తప్పులెక్కలు మొదలయిన అకృత్యములతో విశేషముగ ధనార్జనముచేసి దేవాలయములు కట్టించి, పూజలొనర్చి, సమారాధనలుచేసి తాము వెన్నకాచిన నెయ్యిభుజించుచు, దేవుని దీపములకు గబ్బునెయ్యినుపయోగించుచు జేయుపూజలచేగాని భగవంతు డెప్పటికినితృప్తిచెందడు. అట్లుచేయుటభక్తిపురస్కర పూజయుకాదుగనుక భక్తుడుధృతిచే తనకున్నంతలో కుటుంబపోషణచేయుచు అందుకై తనకు ప్రాప్తమైనపనియు భగవదర్పణముగనేచేయును.

ధనికుడుగానుండువాఁడెట్లు ధృతిచూపవలెనన:—తనకువచ్చుచుండెడి ఆయములో నెంతమాత్రముతానును తనకుటుంబమును సుఖముగా జీవించుటకవశ్యమో అంతమాత్రమే భగవంతుడు తనయుపయోగమునకు నియమించినాడని నిశ్చయించి దానికి అవశ్యమైనంతమట్టుకు వ్యయముచేయుచు మిగిలినదంతయు లోకహితార్థమై ఏయేకాలమందేయేకార్యములకవసరముసంభవించునో ఆయాకార్యములకు వినియోగించుచుండవలెను. భగవంతుడు జగత్తుకు హితముచేయుటకే అవతరించుచుండును గనుక జగత్తుకుహితముచేయుకార్యములకువినియోగించిన సమస్తమునుభగవదర్పణమే యగుననుటకు సంశయముండదు.

రాజాంగములో పన్నురాబట్టి వశములోనుంచుకొనియుండు అధికారి (తహశీల్ దారు, Tahsildar)ఎట్లురాజుకురావలసిన పైకమునిర్దాక్షిణ్యముగ కాపులనుండి రాబట్టి బొక్కసమునందుంచి కాపాడుచు, గ్రామముచే జనులు కృశించునపుడును లోక

హితమునకయి చెరువులుకట్టుటకో కాల్వలుత్రవ్వుటకో, సత్రములు నియమించుటకో, ద్రవ్యములు యివ్వవలెనని యుత్తరవువచ్చినతో డనే యెవ్విధంబున ఆ అధికారిజాగుసేయక, దుఃఖమొందక, సంతోషముగనిచ్చుచున్నాడో అట్లనేధనికుడగు భక్తుడుండవలెను. తహశీల్ దారుతనకు నియామకమయిన రెండువందలరూపాయల కధికముగనెట్లు బొక్కసమునుండి తనకైవినియోగించడో అట్లనే భక్తుడునుతనయొద్దనెంత అధికముగధనముండినను తనసెలవులకు తగినంత మాత్రము వాడుకొని మిగిలినది పరోపకారమునకే వినియోగించవలయు. పరోపకారమే భగవంతుడవతరించుటకు ముఖ్యకారణము:—

"శ్లో॥ పరోపకృతికైవల్యేతులయిత్వాజగద్గురుః
గుర్వీంచోపకృతింమత్వాఅవతారాన్దశాగ్రహీత్॥

పరోపకారమును, కైవల్యమును (మోక్షమును) జగద్గురువగు ఈశ్వరుఁడు తూఁచి పరోపకారము కైవల్యమునకంటె నెక్కువబరువుగా నుండుటను బట్టి తానునిత్యముక్తుడైనను కైవల్యానందమును వదలిజగదుపకారమునకై దశావతారము లెత్తెనని తాత్పర్యము.

"శ్లో॥ జగద్ధితాయకృష్ణాయగోవిందాయనమోనమః"

అనిగోవిందుని జగద్ధితుడనివర్ణించబడినది. నిత్యముక్తుడగు భగవంతుడు మోక్షసామ్రాజ్యమువిడిచిలోకహితముగొప్పదనిఅందుకైసర్వదాపనిచేయుచుండ ముక్తులును అట్లనేతాముముక్తిపొంది యుండినను లోకహితార్థమై పనిసేయుచుండుట సహజము. భక్తులను గురించిచెప్పనేల? భక్తినపేక్షించు ధనికులు తమకుటుంబ సంరక్షణార్థమై వినియోగించవలసిన ద్రవ్యముతప్ప మిగిలినదంతయు పరోపకారమునకే వినియోగించవలెననుటకు సంశయములేదు. అట్టివారికే భక్తిలభించునుగాని ద్రవ్యమార్జించిదాచిపెట్టు వారికిలభించదు.

మఱియు భక్తినపేక్షించుధనికులు కాలవశాత్తు ఆర్జించి

యుంచినద్రవ్యము నష్టమైపోయినపుడేమాత్రమైన వగవక ధృతిని పొందియుండవలెను. సర్వస్వముపోయినను ఓ దేవుఁడా! ధృతిని పరీక్షించుటకు ఎట్టిసమయమిచ్చితివి! నేనుధనము నేనమ్మినవాడనో కాదోయని తెలిసికొనుటకు నాధనమునంతయు నష్టపరచితివి, కలిమిలేములు కావడికుండలవలె స్థిరముగనిలువకయూగుచుండును. ధనమే కాపాడునను భావములేశమైన్న నాహృదయమందుండక శాశ్వతములగు నీపాదములే గతియనెడి దృఢమును కలుగజేసితివని స్వామినిపొగడుచుదరిద్రుడైనందుకు వగవకమనో వైకల్యమును చెందకసమచిత్తుడై యుండుటకు అభ్యసించవలెను.

అనన్యభక్తినపేక్షించువారు తమబంధువులు మిత్రులుగతించినను వగవకమనసును స్థిమితముగా నుంచుకొనవలయును. అదెట్లన:— కేవలము అనుకూలవతిగా నుండుభార్యగాని, సర్వవిధంబుల సుఖమొసంగువాడును, గొప్పపదవిలోనుండువాడును నగు పుత్రుడుగాని మరణమొందినపుడు "అయ్యయ్యో నాగతియేమి వీరినినమ్మియుంటినే, ననువిడిచిపోయిరే దిక్కులేనివాడనయితినే, నేనెట్లుజీవింతు" నని అత్యంతసంతాపమొందక, మిక్కిలిధృతి గలిగి, పుత్రకళత్రాదులు ఋణానుబంధముననుసరించి ప్రాప్తమగుదురనియు, సత్కళత్ర సత్పుత్రులులభించుట పూర్వజన్మములందు ఋణగ్రస్థులుగానుండి ఆఋణముతీర్చుటకయి భార్యాపుత్రులుగా నవతరించి యెంతమట్టుకు ఋణముండినదో అంతయుతీర్చి, వెళ్లిపోదురనియు మనస్సునుసమాధానపరచుకొనవలయును. ఒకవేళ భార్యదుష్టురాలుగాను, ఎదిరించి మాటలాడునదిగాను, ఏమాత్రమైన అనుకూలవతిగా నుండనిదిగాను, పుత్రులువంశమునకు అపకీర్తి తెచ్చువారుగాను, దుష్టప్రవర్తన కలవారుగాను ప్రాప్తమైనపుడు, వీరివద్ద పూర్వజన్మములందు ఋణముచేసియో లేకవీరిని బాధపెట్టియో యుండినందున, ఈజన్మమందు ఆఋణముతీర్చుకొనుటకును, నావల్లవారు ఆజన్మములందుపడినబాధలకుగాను ప్రతిచేసి

నేనుపునహాఅట్టిభాధలు యెవరికిని పెట్టకుండునట్లు పాఠము గఱి పుటకును వచ్చినారని మనసును సమాధాన పరచవలయుగాని సంతాపపడకూడదు. సంతాపముచే ఏమియులాభము లేదు.

శ్లో॥ సంతాపాత్ నభవేతిగ్రంచి
తేగ్రవలంపరితప్యతే
సంతాపాత్ భ్రిస్యతేజ్ఞానం
సంతాపాత్ భ్రిస్యతేబలం
సంతాపాత్ భ్రస్యతేరూపం
సంతాపాత్ వ్యాధిన్పృచ్ఛతి॥

అనగా సంతాపమువల్ల మనసుకు దేహామునకు పరితపన తప్ప మరేమియు కాజాలదు. సంతాపముచే జ్ఞానమునశించును, బలముడుగును, రూపముచెడును, వ్యాధిఘటిల్లును అనివిదురుడు ధృతరాష్ట్రునికి బోధించినట్లు ఉద్యోగ పర్వమందుదాహరించ బడినది. కాబట్టిభక్తులు సతిగ్రశత్ర, పుత్రాదులు చనిపోయినను దుష్టబంధువులచే బాధగలిగినను ధృతినొంది మనసును ఏకరీతిగ నుంచవలెను.

ఇంతియెగాక ద్రవ్యనష్టమును, స్వేష్టబంధు వియోగమై నపుడు కేవల ముత్సాహపరుడు కావలెను. ఎట్లన:—సార్వ భౌముండగు మహారాజువద్దనుండిన అత్యంత శౌర్యవీర్యబల పరా క్రమములుగల సుభటుడు రాజుకుదుర్జయులయిన శత్రువులరాక నిరీక్షించుచుండి, అట్టిశత్రువులుదండెత్తివచ్చినపుడు కేవలముత్సా హపరుడై రణరంగమందు జొచ్చి తన శౌర్యవీర్యబల పరాక్రమ ములను యథేచ్ఛగచూపి శత్రువులను హతముచేసి తనస్వామియ గు రాజునెట్లు మెప్పించునో అట్లనేభక్తినపేక్షించువాడును తనకు అర్థహానిబంధువియోగముగలిగినపుడు "స్వామీ! నాధృతిచూపు టకు ఎంతశీఘ్రముగ సమయమొసంగతివని మిగులనుత్సాహము నొందియుండవలెనుగాని అయ్యోనాకింత కష్టము తెచ్చితివేఅని

స్వామిని నిందింపకూడదు వగవఁగూడదు. ఇవన్నియు తన మేలుకై ప్రాప్తమైనదని తలంచవలెను ఎందుకన:—

"శ్లో॥ హరిర్దుఃఖానిభక్తేభ్యో హితబుద్ధ్యాకరోతి వై।
శస్త్రక్షారాగ్నికర్మాణి సుపుత్రాయయథాపితా॥"

ఎవ్విధమున తండ్రితనపుత్రునికి బలమైన పుండుపుట్టినపుడు ఆపుండుమాన్పుటకు శస్త్రచికిత్సకుని పిలువనంపి, తనపుత్రునికి, ఆచికిత్సకుడు పుండును కోయుట కారపువస్తులు వేయుట మొదలగు పనులుచేయుటచే ఎంతబాధతో చివద్దనిచెప్పినను వినక కోయించి చికిత్పచేయించునో తద్వతేజగత్పితయగుస్వామి (ఈశ్వరుడు) తన భక్తులు పూర్వజన్మములందుచేసిన దుష్కృతఫలమంతయు కొన్ని జన్మములలోనే అనుభవించి తనపాదములుచేరి ఆనందించుటకై భక్తులహితమునకై దుఃఖములు ఎక్కువగా తెచ్చినట్లగుపరచును. అజ్ఞానులు మూఢత్వముచేబాధలధికముగకలిగెనని దుఃఖపడుదురు. భక్తులట్లుదలంచరు. ప్రహ్లాదుడు భక్తవత్సలుండగు స్వామిని తలంచినట్లంతయు హిరణ్యకశిపుడు అధికముగ బాధపెట్టుచు వచ్చెను. ప్రహ్లాదుడు అదిబాధగాతలంచి హరినామోచ్చారణ విడిచెనా? బాధపెట్టినకొలదియు హరిస్మరణ ఎక్కువగానే చేయుచుండెనుగదా? ప్రహ్లాదునికున్నంత దృఢమందరికి కలుగదు. అయినను భక్తిగోరువారందరు చివరకు అట్టిదృఢముపొందుటకు కష్టములు ప్రాప్తమైనప్పుడంతయు అవిమేలుకొఱకేప్రాప్తమైనవని క్రమక్రమముగ మనసును దృఢపరచుచురావలెను.

"శ్లో॥ నవాసుదేవభక్తానామశుభం విద్యతేక్వచిత్"
"నమేభక్తఃప్రణశ్యతి"

అనుభగవద్వాక్యముల స్మరించవలెను. వాసుదేవభక్తులకు ఎప్పటికిని అశుభము ఘటిల్లదు. వారునాశమును పొందరని దృఢపరచుకొనవలెను.

దీనికొక యితిహాసముకలదు:—ఉత్తరదేశమందొక రాజుం

డెను. ఆయనమహాధర్మిష్ఠి, భక్తిజ్ఞానములుకలవాడు. తనజాతి కర్మములందేలాటిలోపములును లేక విధికాలక్రమములననుసరించి చేయుచుండెను. తనప్రజల మనంబులుల్లసిల్ల జేయుచు న్యాయముతప్పక అఱువది సంవత్సరములవయసు వరకు రాజ్యపరిపాలనమొనర్చి తదనంతరము వానప్రస్థాశ్రమముసల్ప నుద్యుక్తుడై రాజ్యభారము తనపుత్రునందునిచి పట్టాభిషిక్తునిగావించి, గంగాతీరమునందొక నిర్జనప్రదేశమున వసించి సర్వదాపరమార్థ చింతయందుండవలెనని నిశ్చయించెను. మహారాజుగనుక జీవనమునకుచాలినంతద్రవ్యము వెంటకొనిపోదలచి అనేకవరహాలు బొంతయందునిచి కుట్టించి దానిని మోయుటకు శక్తిలేక ఒక గుఱ్ఱమును తెప్పించి ఆగుఱ్ఱముమీద యీబొంతనునిచెను. రాత్రికాలమందు చీకటిలో తిరుగుట అలవాటు లేకుండుటనుబట్టి దీపముంచుటకొక లాంద్రతీసికొనెను. ఎప్పటికిని వేకువబ్రాహ్మీముహూర్తమున లేచివిధ్యుక్తముగ సమస్తకార్యములు చేయుచుండువాడు గనుక ఆకాలమునకు గడియారములు లేకుండుటచేతను కాలమునతిక్రమించక కూయుచుండుకోడిని ఒకటినితీసికొని, బొంత, గుఱ్ఱము, లాంద్ర, కోడివీనినన్నిటిని వెంటబెట్టుకొని గంగాతీరమున నొకగ్రామమునకు కొంతదవ్వునందొక పర్ణశాల నియమించుకొని అచ్చటవసించుచునిత్యకర్మలు విధికాలక్రమములు తప్పకసల్పుచు సర్వదాభగవంతుని భక్తితో ధ్యానించుచు కాలము పుచ్చుచుండెను. ఇట్లుకొంతకాలముజరిగెను. పిదప ఒకానొకనాడు అర్ధరాత్రిసమయమందు విశేషముగ గాలివీచుచు, అంతరిక్షమందు అతిదట్టముగ మబ్బుకప్పి అతిభయంకరముగనుండెను. ఈమితిమీరిన గాలికి ఉన్నతప్రదేశముననుంచియుండిన లాంద్రక్రిందికిపడి పగిలిదీపముచల్లారెను. అప్పుడారాజు ఇదేమి దైవసంకల్పము! నేడుముఖ్యముగా దీపముండవలసిన రాత్రి, మహాభయంకరముగానున్నది, ఇట్టిసమయమందు దీపము

చల్లారిపోయెను. దీనికి కారణము స్వామికే తెలియునని చింతించుచుండ నొక అడవిపిల్లివచ్చి కోడినినోటకరచుకొనియురికెను. బ్రాహ్మీ ముహూర్తమునకు లేచుటకు కాలము తెలిసికొనుటకు లేకుండ కోడియు పోయెను. ఎందుకో తెలియదని అనుకొనుచుండగనే ఒకపులివచ్చి గుఱ్ఱమును తినిపోయెను. రాజు వెంట తెచ్చిన బొంతతప్ప తక్కిన వన్నియు నష్టమొందెను. అయినను రాజు తననిత్యకర్మవదలక కష్టపడి కాలమునకు సరిగముగించి తెల్లవారినతరువాత అక్కడి కగుపడుచుండిన యూరికిపోయి ఇంకొకలాంద్ర, కోడి, గుఱ్ఱము తేదలచి వెళ్లెను. ఆగ్రామముప్రవేశించి గ్రామమంతయు చుట్టగా సమస్తమైనఅంగళ్లు,ఇండ్లుఆరాత్రియే దోచినట్లుండెను. ప్రతిఅంగడి యొక్కయు యింటియొక్కయు తలుపులుపగలకొట్టి వానియందు కాపురముండినవారినందరిని ఒకరినిగాని విడువకచంపి సర్వమును దోచుకొని పోయియుండిరి. ఇదిచూచి మిక్కిలిఅచ్చెరువొంది కారణము చెప్పువారొకరును లేకుండుటచే ఏమియుతలంచక ఇంకొక గ్రామమునకు పైవస్తువులు కొనుటకయి పోవుచుండెను. పోవునపుడు ఆగ్రామము వెలుపల దారియందుయిరుప్రక్కలనుండుసాలు చెట్లలో నొకచెట్టుమీద నొకడుకూర్చుండెను. వానినిచూచి యీరాజు ఓరీ ఈగ్రామమందిట్లు సంభవించుటకు కారణమేమని యడుగ వాడిట్లుత్తరముచెప్పెను. అయ్యారాత్రి రెండుగంటల సమయమున నేనుదేహబాధ తీర్చికొనుటకు ఊరివెలుపలవంకగట్టునకు వచ్చియుంటిని, ఆసమయమునరోహిలాలగుంపుగుఱ్ఱములమీద సవారిచేయుచువచ్చి గ్రామముప్రవేశించియూరివారినందరిని చంపి సర్వమునుదోచుకొనిపోయె. నేనుజడిసి ఈచెట్టెక్కి అప్పడినుండి దిగుటకుకూడా కాళ్లాడక కూర్చునియున్నాననేను. అదివినిన రాజుభగవంతునియిట్లుకొనియాడదొడగె. స్వామీ! నీవుభక్తవత్సలుడవను టెంత నిక్కము. ఎందాక నాకు, లాంద్ర, కోడి, గుఱ్ఱము బాధకరములుగాక నుపయోగముగనుండెనో అందాక వానినుంచి

తివి. ఎప్పుడవినాకు బాధకరములగుననితోచెనో వెంటనే వానిని లేకుండ చేసితివి. నీదయయెన్ని విధముల కొనియాడుదును! ఆదీప మేరాత్రిపోకుండెనేని ఆదీపమీయూరికగుపడుచుండుటనుపట్టిఆదొంగలగుంపునావద్దికివచ్చి నన్నుహతముచేసి అంతయుతీసికొని వెళ్లియుందురు. ఆసమయమునకుతప్పక దీపముతీసివేసితివి. కోడియుండెనేని అదికూయుసమయము సమీపించియుండెను. దానికూత యిక్కడికి వినపడుచుండెను. అదికూసియుండినను వారునావద్దకు వచ్చి నాకుదుర్మరణముసంభవింపజేసియుందురు. అదిసంభవించకుండసమయమునకేదానిని లేకుండజేసితివి. గుర్రముబ్రతికియుండిన దొంగలుతెచ్చియుండిన గుఱ్ఱములనుచూచి సకిలించుచుండెను. అట్లైననువచ్చినన్నుసంహరించుచుండిరి. అకస్మాత్తైనదుర్మరణము నీ భక్తులకెంచుకుకలుగ జేయుదువని భగవంతునిస్తుతించుచు "నవాసుదేవభక్తానాం అశుభంవిద్యతేక్వచిత్" అనువాక్యమునుమాటిమాటికి స్మరించుచు అవిపోయినందుకు దుఃఖించక ఆనందించుచుండెను. కనుక భగవద్భక్తికోరువాడు గృహస్థాశ్రమధర్మము నడుపునపుడు సంభవించు సమస్తనష్టములు, కష్టములు, మేలు కొరకే సంభవించుచున్నవని ధృతిచేమనస్సును నియమమందుంచుకొని తానుభగవంతుని భృత్యునిగా దేహయాత్రసల్పుచు, తెల్లవారి తానుచేయుపనులకు మొదలిడకముందు ఈ శ్లోకము పఠించవలెను:—

"శ్లో॥ లోకేశ చైతన్యమయాధిదేవ
శ్రీకాంతవిష్ణోభవదాజ్ఞయైవ
ప్రాతస్సముత్థాయతవప్రియార్థం
సంసారయాత్రామనువర్తయిష్యే॥"

లోకమునకు ఈశుడైన హేవిష్ణో, శ్రీకాంతా! వేకువలేచి నీప్రీతికొరకు నీయాజ్ఞానుసారముగ, ఈఆలుపిల్లలను సాకుట మొదదలగు సంసారయాత్రచేయుచున్నానుగాని, నాసుఖమునకుగాని

నాఆలుపిల్లలసుఖమునకుగాని అన్యాయ వృత్తితో చేయనుతంౘ్రీ, నీవిచ్చినపరిమితిలోనే సర్వమును ఎంతబాగ, ఎంతసలక్షణముగ తీర్చవలెనో అంతతృప్తికరముగ చేయుచున్నానని స్వామికివానివి చేయుచుధృతిచెడకమనసునునియమించవలెను. ఇది రెండవమెట్టు. ఈమెట్లెక్కుటకు గృహస్థాశ్రమముతప్ప ఇతరాశ్రమములలో సాధ్యపడదుగనుక కామక్రోధాదులగు శత్రువులను జయించుటకు గృహాశ్రమమే రణరంగమని చెప్పబడినది.

ఇంక మూడవమెట్టునుగురించి విచారింతము.

శ్లో॥ శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌవ్యుదస్యచ॥

రాగద్వేషములనుండి పుట్టినకొన్నియింద్రియ విషయము లందు అపేక్ష కొన్ని యింద్రియ విషయములందుపేక్ష ఈ రెంటిని ఓడువవలెనని తాత్పర్యము.

పూర్వజన్మములందు జనులెట్టి సుఖవస్తువులనెడివాటిని అపేక్షించుచు అనుభవించుచుందురో, ఏవస్తువులందు అసహ్యము కలిగిఓడచిద్వేషించుచుందురో, అట్టివస్తువులందపేక్షించునట్టియు, ద్వేషించునట్టియు స్వభావముగల దేహమునంబులే ఈజన్మమం దును వారికి ప్రాప్తమగునని సిద్ధాంతము. ఈజన్మమందునుఅట్టి అపేక్షలనేఅపేక్షించుచు,అట్టిఉపేక్షలనేఉపేక్షించుచుండినంతట భగవంతునియందు భక్తియేమాత్రమును అంకురమెత్తకముక్తినొం దక, ఎడతెగని జన్మమరణములపాలై సర్వదాదుఃఖములే అను భవించుట సంభవించును గనుక భగవంతుడయిన శ్రీకృష్ణులు అర్జునునికి ఈరెంటిని విడచితేనేకాని భక్తికుదురదని బోధించి నారు. గాబట్టిభక్తిగోరువారందరు వీనినిసర్వ ప్రయత్నములు చేసి విడువవలెను.

కొందరు కేవల లుబ్ధభావమునొంది, తాముకదాన్నమునే భుజించుచు, ఎడతెగక ధనార్జనయందేఅపేక్షగలవారైగె ఇతర సమస్తకోరికలందుపేక్షాభావమునొందియుండుట చూచుచున్నార

ము. మరికొందరుతమ పెద్దలెంత ధనార్జన చేసియుంచియుండినను దానియందుపేక్షగలవారై స్త్రీసుఖమే ముఖ్యాపేక్షగాగలవారై ధనంబునంతయు వెలయాండ్రకిచ్చి పాడుచేయుచుండుటయు చూచుచున్నారము. ఇట్లనే ఇతరవిషయములందపేక్ష యుపేక్షలుండువారెందరోగలరు. ఇవిపూర్వజన్మకర్మానుగతముగ సంభవించిన దేహమనోభావముల ననుసరించిస్వభావమై యేర్పడుచున్నది. దీనినిపోనాడుట సులభముకాదు. అతిదృఢమయిన ప్రయత్నము చేసినగాని సాధించుటకుశక్యముకాదు. చేష్టలన్నియుఆస్వభావమునుపట్టియే చేయబడుచున్నవిగనుకనే భగవంతుడుఅర్జుననినికిట్లు ఆజ్ఞ యిచ్చినారు.

"శ్లో॥ సదృశం చేష్టతేస్వస్యాః ప్రకృతేఃజ్ఞానవానపి
ప్రకృతింయాంతి భూతానినిగ్రహాఃకింకరిష్యతి॥"

విశేషముగ శాస్త్రములుచదివి జ్ఞానవంతులయినను ప్రకృతిని అనుసరించేపనులు చేయుచుందురు, భూతములన్నియు ప్రకృతిని (స్వభావమును) అనుసరించే నడచుచుండును. నిగ్రహమెట్లు చేయుదురని తాత్పర్యము. ఈప్రకృతిఅనగా స్వభావమిట్టి దృఢశక్తిగలిగినదిగనుకనే వానికిచిక్కవద్దని దానికావలిశ్లోకములోనే చెప్పియున్నారు.

"శ్లో॥ ఇంద్రియాణీంద్రియార్థేషు రాగద్వేషౌవ్యవస్థితౌ
తయోర్నవశమాగచ్ఛేత్తౌహ్యస్యపరిపంథినౌ॥"

రాగద్వేషముల ననుసరించి యింద్రియములు యింద్రియార్థములందనగా శబ్దాదివిషయములందు లాగుచున్నవి, అవిదుష్టమార్గములందు ప్రవేశింప జేయుచున్నవిగనుక వానికినీవు వశుడు కావద్దని శ్రీకృష్ణులుపదేశించిరి. ఎట్లువశుడు గాకుండవలెను? దీనికిశ్రేష్ఠమైన యుపాయమొకటిగలదు. దానినివదలక అనుసరించినట్లయిన యేబాధయులేక రాగద్వేషములువదలి క్రమక్రమముగ ఇంద్రియములన్నియు వశమ్మైజీవునికిబాధకములుగాక సాధక

ములగును. ఆయుపాయ మేదన శాస్త్రీను సారవర్తన.

మితిమీరి స్త్రీసంగమాపేక్షగలవాడు శాస్త్రములను చదువుచు మననచేయుచు వచ్చినపుడు దానివలన దేహబలముచెడి పలురోగములకు చిక్కి ప్రత్యక్షముగ ఈలోకమందె నరకమనుభవించుట సిద్ధమనిదృఢపడుచున్నది. అట్లుదృఢపడినను ఆయపేక్ష ప్రబలముగా నుండుటనుపట్టి ఆయపేక్షను నెరవేర్చుకొనుటకు మార్గమువిచారించగా పెండ్లిచేసికొనిభార్యతో సుఖించవచ్చునని తోచుచున్నది. అట్లుకొంతకాలము జరిగినపిదప శాస్త్రమునకు లోబడుటకు యిచ్ఛకలుగగానే ఋతుకాలమందు మాత్రమట్లు చేయుటశ్రేష్ఠమని తెలియుచున్నది. మరియు నెక్కువ శాస్త్రములను చూచుచురాను ఒక పుత్రుడుపుట్టిన వెనుక నాయపేక్ష వదలుట శ్రేష్ఠతమమనియు తెలియుచున్నది. తద్వారా అభ్యాసముచే ఆయపేక్ష క్షీణమైనశించుచున్నది.

అవ్విధముననే జిహ్వేంద్రియమునకుజిక్కిఉదయమునుండి రాత్రి నిద్రించు సమయమువరకును తినుచుత్రాగుచునుండు తిండిపోతులకును శాస్త్రసమ్మతముగ ఆచరించుటచే ఆయింద్రియము వశమగుచున్నది. స్నానముచేసిసంధ్యావందనము దేవతార్చన మొదలయిన కర్మలుచేయక ఏమియుకడుపునతీసికొనకూడదని నియామకముండుటచే,అట్లుఆచరించుటవ్రానినతోడనే "బెడ్ కాఫీ" అలవాటుతప్పిపోవుచున్నది అట్లనేశాస్త్రములనుచూచుటచేగృహస్థుయిరుప్రొద్దుమాత్రము భుజించుటేదైవనియామకమని తెలిసిఅట్లు వర్తించుటచేఇతరఫలాహారాదులు(Tiffin) అకాలభుక్తియుపానంబులును వదలుచున్నవి. చివరకు "ఏకభుక్తంసదారోగ్యం" అనునది ప్రాప్తమైరోగాదులకు జిక్కకసదా ఆరోగ్యభాగ్యముగలవాడై జిహ్వేంద్రియమునుజయించును. మరియు శాస్త్రములందు భక్ష్యాభక్ష్యంబులును పేయాపేయంబులను ఆహారపరిమితియు నియమించియుండుటను పట్టి సాత్వికాహారంబును, మితభోజ

నంబును ప్రాప్తమగును.

సకలేంద్రియ వ్యాపారంబులకు నియమమును, పరిమితియు, కాలమును శాస్త్రములందు చెప్పియుండుటచే, ఆశాస్త్ర ప్రకారము అనుసరించుటకు యత్నముచేయుటే ఇంద్రియముల వశపరచుకొనుటకు సంశయము లేదు.

ఇవ్విధముననే ప్రతియింద్రియ విషయమును వర్తింప వలయు. అట్లుచేయక ఏదైన నొకయింద్రియమునకు లోబడితిమా అన్నియింద్రియములు తప్పుదారినే లాగుచున్నవి.

శ్లో॥ సర్వేషామేవేంద్రియాణాంయద్యేకం క్షరతీంద్రియం
తదస్యహరతిప్రజ్ఞాంబు తేకుంభోదకానివ॥

అన్నియింద్రియములలో నేదైన నొకయింద్రియము వశము తప్పిజారినా, ఓటికడవనుండి నీరంతయు కారినట్లు ప్రజ్ఞనంతయు హరించునని మనుస్మృతియందు చెప్పబడినది.

మరియు శ్రీశంకరాచార్యులును వివేకచూడామణియందు

"శ్లో॥ శబ్దాదిభిఃపంచభిరేవపంచపంచత్వమాపుఃస్స్వగుణేనబద్ధాః
కురంగమాతంగపతంగమీనభృంగానరఃపంచభిరంచితఃకిం॥

ఒక్కొక జంతువు అనగా జింకశ్రోత్రేంద్రియ విషయమగు శబ్దమునకు లోబడిచచ్చుచున్నది, ఏనుగ స్పర్శేంద్రియ విషయమగు మృదువైనపచ్చికకులోబడి గుంటబడుచున్నది, పతంగమనమిడతనేత్రేంద్రియమునకు లోబడిమంటలోబడుచున్నది, మీనమనగా చేపజిహ్వేంద్రియ విషయమగు రుచియైన మాంసమును తినవలెనని గాలమునకు జిక్కిమృతినొందుచున్నది. భృంగమనగా తుమ్మెద ఘ్రాణేంద్రియ విషయమగు చంపకపుష్పవాసనకులోబడి చచ్చుచున్నది. ఇవ్విధంబున ఒక్కొకయింద్రియమునకులోబడి ఒక్కొక జంతువు మరణమొందుచుండ, అయిదింద్రియములకును జిక్కిన మనుష్యునిగతి చెప్పనేల అని తాత్పర్యము.

ఇంద్రియములను విషయములందు ప్రవర్తింపజేయుట

సర్వానర్థములకు హేతువగుటంబట్టి స్వామి వానిని వద లుట భక్తునికి మూడవ మెట్టుగా చెప్పినారు.

అనన్యభక్తినిపొందువారికి నాల్గవ మెట్టు వివిక్త సేవత్వము అనగా ఏకాంతవాసము. ఇంద్రియములను నిగ్రహించి మనసు ను ఏకముఖముగనుంచవలసియున్న ప్రతిదినమును కొంతదడవు విజనప్రదేశమున కూర్చుండి ఇంద్రియములను విషయములందు బోనివ్వకుండ అభ్యసించవలయును. ఇంద్రియములను నిగ్రహిం చుటకును తద్వారామనస్సును ఏకాగ్రతగనుంచుటకు నిదిప్రథమ ద్వారము. అనగా మొదటచేయదగిన అభ్యాసము.

భక్తులకు ధ్యానయోగము నేడవ మెట్టుగా శ్రీకృష్ణులర్జు నికుపదేశించినారు. అట్టియోగమునకు వివిక్త సేవత్వము (ఏకాంత శీలత) అత్యవసరము. ఇదిప్రథమద్వారమని శ్రీశంకరాచార్యుల వారు వివేకచూడామణి యందుదాహరించినారు.

శ్లో॥ యోగస్యప్రథమంద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః
నిరాశాచనిరీహాచనిత్యమేకాంతశీలతా॥
ఏకాంతస్థితిరింద్రియోపరమణే హేతుర్దమశ్చేతస
స్సంరోధేకరణంశమేనవిలయంయాయాదహంవాసనా॥

వివిక్త సేవత్వము, అనగా ఏకాంతస్థితి యోగమునకుప్రథ మద్వారంబనియు, ఇంద్రియనిగ్రహమునకు ముఖ్యకారణంబనియు పైశ్లోకములనుండి విశదమగుచున్నది. అదేట్లన జన్మజన్మ ములనుండి విషయములననుభవించుచుండిన యింద్రియములు సా మాన్యముగ స్వాధీనమునకురావు. నిరంతరాభ్యాసము గా వలయు. ఒకగదిలోకూర్చుండి తలుపుమూసి ఏదైననొక పర మార్థవిషయమందు చిత్తమునుంచుటకు ప్రయత్నపడినతోడనే మనసు ఇంద్రియములకులోబడి నానాప్రదేశములకుపోవుటఅందరికి ననుభవసిద్ధము. ఎట్టిగొప్పయోగియైనను, జీవన్ముక్తుడైనను, మనోనిగ్రహమునకు ప్రయత్నించినపుడు ఈ అనుభవము ఆది

యందుపొందేటీరవలెను. ఈ అనుభవమును పొందనివాడెవడును లేడు. అర్జునుడు శ్రీకృష్ణులకు,

శ్లో॥ చంచలంహిమనఃకృష్ణప్రమాథిబలవద్దృఢం
తస్యాహంనిగ్రహంమన్యే వాయోరివసుదుష్కరం॥

హేకృష్ణ! మనసు చంచలమైనది, ప్రమాథమైనది, బలిష్ఠమైనది, దృఢమైనది, దీని నిగ్రహించుట వాయువును నిగ్రహించుటెంత దుష్కరమో అంతదుష్కరమని చెప్పగా, శ్రీకృష్ణులు

శ్లో॥ అసంశయంమహాబాహోమనోదుర్నిగ్రహంచలం
అభ్యాసేనతుకౌంతేయవైరాగ్యేణచగృహ్యతే॥

హేమహాబాహో! మనసుచంచలమైనదనుటకును, నిగ్రహించుటకు దుష్కరమైనదనుటకును సంశయములేదు అభ్యాసముచేతను వైరాగ్యముచేతనుగ్రహించదగునని చెప్పిరి. అభ్యాసము విరాగములేక ఎవరికిని సాధ్యముకాదు. కాబట్టి ప్రతిదినమును ఏకాంతమునకూర్చుండి అభ్యసించవలసినదివిధి.

ఒకగదియందు తలుపుమూసికొని కూర్చుండుటచే ఇంద్రియములకు తాత్కాలికమందాహార మివ్వనట్లాయె. అప్పుడవి ఊరకుండవు. పశువులు నెమరువేసినట్లు తాము వెనుక అనుభవించిన విషయములను జ్ఞాపకమునకు తెచ్చికొని ఆయనుభవమును తలంచునుగాని అప్పుడుతలంచవలసిన పరమార్థమును దలంచవు. ఏకాంతమందుండక జనమధ్యమందుండి ఇంద్రియ నిగ్రహమును చేయనలవిగాదు. జనమధ్యమందుండునపుడు ఇంద్రియములన్నియు తమకు కావలసిన ఆహారములనుపుచ్చుకొనుట కవకాశముండును. కన్నులకు రమ్యమైన వస్తువులుచూచుటకును, చెవులకింపైన విషయములు వినుటకును, నాసికమునకు సొంపైన పరిమళములు ఆఘ్రాణించుటకును, జిహ్వకు రుచ్యములైన పదార్థములను భుజించుటకును, అవకాశముండును. కనుక జనమధ్యమందింద్రియ మనోబలంబులంతగాదెలియదు. ఎప్పుడు

ఏకాంతమున గదిలోకూర్చుండి ఏకాగ్రతను అభ్యసించుటకు ప్రయత్నించెదమో అప్పుడు వానిబలముగుపడును. మనసుసమస్త యింద్రియానుభవములను జ్ఞప్తికి తెచ్చికొని స్మరించుచుండును. కొన్నిసమయములందు ముందుచేయబోవు కార్యములను స్మరించును. కనుకశ్రీశంకరాచార్యులవారు చిత్తమనుపక్షికి విషయానుభవస్మృతిని, ఆశాపాశమునకులోబడి ముందుచేయబోవు కార్యములను, రెండురెక్కలుగా వర్ణించినారు.

శ్లో॥ విషయాణాంస్మృతిశ్చాశా పక్షౌద్వౌచిత్తపక్షిణాం
తాభ్యాముద్ధియ తేచిత్తం తదుచ్ఛేదేనశామ్యతి॥

చిత్తమనుపక్షికి విషయస్మృతియు, ఆశయు రెండురెక్కలు. ఆరెక్కల బలముతో చిత్తమెగురుచునుండును. ఆరెండు రెక్కలను విరచినంతట ఆపక్షిఉనిచినచోటునుండి కదలకుండును.

తలుపుమూసికొని గదిలోకూర్చునియుండినపుడు మనసు నానాదిక్కులకుపోయినట్లంతయు మరల్చి తానుతలంచబూనిన దానియందేయుండునట్లు అభ్యసించవలెను. మరలమరల మనసు ఎగిరిపోవుచునేయుండును, పోయినప్పుడంతయు విసుకుచెందక త్రిప్పుచునేరావలయును. శ్రీకృష్ణులు అర్జునునికీవిషయ మిట్లనే బోధించియున్నారు.

శ్లో॥ యతోయతోనిశ్చరతిమనశ్చంచలమస్థిరం
తతస్తతోనియమ్యైతదాత్మన్యేవవశంనయేత్॥

అస్థిరమైన, చంచలమయిన మనసు ఎచ్చటెచ్చటికి పోవుచున్నదో అచ్చటచ్చటినుండి మరల్చితనస్వాధీనముచేసికోవలెనని తాత్పర్యము. మనసు స్వాధీనమునకు వచ్చువరకు ఈఅభ్యాసము చేయుచునే యుండవలయును. ఇన్నిదినములభ్యసించితినే! మనసు నిలువకపోయెనే! అనివిసుకుచెంది అభ్యసించుటవదలరాదు. తుదకు ఒకజన్మమంతయు అభ్యసించినను మనసునిలువక పలుదిశలుపోవుచుండినను అభ్యసించుటవిడువదగదు. దీనినిగురించి

అర్జునుడు శ్రీకృష్ణులను ప్రశ్న చేసినాడు.

శ్లో॥ అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః
అప్రాప్యయోగసంసిద్ధింకాంగతింకృష్ణగచ్ఛతి
కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివనశ్యతి
అప్రతిష్ఠోమహాబాహోవిమూఢోబ్రహ్మణఃపథి॥

శ్రద్ధతో ప్రయత్నముచేసినను మనసు నిలువక చంచలించు చుండినవానికి యోగసిద్ధిలభింపక ఏగతి ప్రాప్తమగుచున్నది? బ్రహ్మామార్గమందు ప్రతిష్ఠ కాక మూఢుడై చెదరిన మేఘమువలె ఉభయభ్రష్టుత్వముపొందుచున్నాడా? ఈ సంశయము నివారింప జేయుమని కృష్ణుని అర్జునుడడుగగా శ్రీకృష్ణులిట్లుత్తరమిచ్చిరి.

శ్లో॥ పార్థనైవేహనాఽముత్రవినాశస్తస్యవిద్యతె
నహికల్యాణకృత్కశ్చిద్దుర్గతింతాతగచ్ఛతి
ప్రాప్యపుణ్యకృతాంలోకానుషిత్వాశాశ్వతీస్సమాః
శుచీనాంశ్రీమతాంగేహేయోగభ్రష్టోభిజాయతే
అథవాయోగినామేవకులేభవతిధీమతాం
ఏతద్ధిదుర్లభతరంలోకేజన్మయదీదృశమ్
తత్రతంబుద్ధిసంయోగంలభతేపౌర్వదైహికం
యతతేచతతోభూయస్సంసిద్ధౌకురునందన
పూర్వాభ్యాసేనతేనైవహ్రియతేహ్యవశోపిసః॥

ఓ పార్థా! ప్రయత్నముచేసి మనసునిలువకుండిన స్థితిలో చనిపోయినవానికి ఇక్కడగాని (భూలోకమందు) పరలోకమందు గాని నాశముకలుగదు. శుభకార్యమునకు ప్రయత్నముచేసిన వానికి దుర్గతి ఎప్పటికిని సంభవించదు. అనేకపుణ్యకార్యములుచేసినవారు పొందులోకములను పొంది బహుకాలమచ్చట సుఖమనుభవించి శుచిమంతులును శ్రీమంతులు నగువారియింటి యందో లేక యోగులకులమందో పుట్టును. యోగులకులములో పుట్టుట కడుదుర్లభము. పూర్వజన్మమందుచేసిన అభ్యాస

ఫలమైనబుద్ధి యోగమునుపొందుచున్నాడు, మరియు సిద్ధికొరకు ప్రయత్నించుచున్నాడు, పూర్వాభ్యాసబలముచేతఆమార్గమునకే ఈడ్వబడుచున్నాడని తాత్పర్యము. ఈకారణముచేత ఎవరు గాని ఇంద్రియ నిగ్రహమునకును తద్వారా మనస్థైర్యమునకు చేసిన ప్రయత్నమెప్పటికిని విఫలముకాదు. ఈ జన్మమందు చేసిన అభ్యాసము ఆవలిజన్మమునకు తోడ్పడును. మనస్థైర్యము ఒకజన్మమందేలభింప నేరదు.

శ్లో॥ అనేకజన్మసంసిద్ధస్తతోయాతిపరాంగతిం॥

అనేకజన్మము లిట్టిప్రయత్నముచే సిద్ధిచెందినవాడు పరమ గతినిపొందునని శ్రీకృష్ణులుచెప్పినారు. గనుక జన్మజన్మములు అభ్యసించుచుండవలెను. విచ్చలవిడితిరగమరిగినకుక్కను కట్టి వేసినప్పుడెట్లది విడిపించికొని పోవుటకై, త్రాడుకొరుకుచు, మొరుగుచు సర్వప్రయత్నములుచేయునో అట్లనే మనసును గట్టి వేయవలెనని ప్రయత్నించినపుడు వదలించుకొనిపోను బలమైన ప్రయత్నముచేయును. విడిపించుకొనుటకు ప్రయత్నించిన కుక్కను దానియిచ్ఛానుసారముగ పోనివ్వక, ఎంత మొరిగినను, ఎన్నిత్రాళ్లు తెగకొరికినను విడువక క్రొత్తత్రాళ్లు తెచ్చి యెడ తెగక కట్టివేసియుండినయెడల కొంతకాలమునకైనను అదికట్టి వేసినచోట నూరకయుండును. అట్లనే జన్మజన్మములనుండి యిచ్ఛానుసారముగ తిరుగుచుండిన మనసును ఎడతెగకకట్టివేసి యుండిన తప్పనిలువదు. ఒకజన్మమందభ్యాసముచే మనసు స్వాధీనపడకపోయినను దేహమయిన స్వాధీనపడును. దేహ మును కదలకస్థిమితముగనుంచుకొనుటకును అభ్యాసముకావలెను.

ఒకరాజు తనదేశమందనేక అన్నసత్రములు నియమించి యుండెను. ఆసత్రములందు ప్రయాణీకులకు మూడురోజులు మాత్రము అన్నము వేయునట్లు నిబంధన చేసియుండెను. ఈసత్ర

ముల విచారణకుగా ఒకఅధికారిని ఏర్పరచియుండెను. ఈఅధికారి ఒకసత్రములో నొక మానికి ప్రతిదినమును ఒకపూట భోజనముపెట్టుటకు ఉత్తరువిచ్చియుండెను. ఆమాని అనేక సంవత్సరములు సత్రములోభుజించుచు ఒకమూలకదలక ఒకరితో మాట్లాడక మానముధరించి కూర్చునియుండెను. కొంత కాలమునకు ఆవిచారణాధికారి పనిచాలించుకొనెను. ఆయనకు బదులు యింకొక అధికారి ఏర్పరుపబడెను. ఆయధికారి ఈమానియుండిన సత్రమునకువచ్చి లెక్కలుచూడ, ఈమాని పేరు భోజనముచేసినవారిలో ప్రతిదినమును సంవత్సరములనుండి వ్రాయబడియుండెను. దానినిచూచి ఆయధికారి "ఇదేమి ఒకని పేరు నిబంధనలకు విరోధముగ ప్రతిదినమును భుజించిన వారిపేర్లతో వ్రాయబడినది, ఇంతకాలము వీనికి భోజనము పెట్టుటకు కారణమేమని" గుమాస్తాను అడుగగా ఆయన, "కారణమునాకు తెలియదు. మీయుద్యోగములోనుండిన పూర్వపు అధికారి ఉత్తరువుమేరకు నేనుభోజనముపెట్టుచున్నానని" లిఖితమయిన యుత్తరువుచూపెను. అప్పుడాయధికారి ఇట్లూరక కూర్చున్నవారి కన్నముపెట్టుటచే సోమరితనమును ప్రోత్సాహ పరచినట్లగుచున్నది. ఇదిసరికాదు. ఎందుకువీనికిన్ని రోజుల నుండి అన్నముపెట్టుచుండినది విచారించి ఇకముందు నిలుపవలెనని తలంచి, ప్రకృతము వానిని యూరకుండకుండ చేయుటకుగాను గుమాస్తాకు, వానిని ప్రతిదినమును విస్తర్లుకుట్టుటకు నియోగించమని ఆజ్ఞచేసెను. ఆయాజ్ఞానుసారముగ ఆగుమాస్తా విడియాకులు, పుడకలు వానిసమీపమునయునిచి విస్తర్లుకుట్టమనెను. ఆమానిఆయాకులను తాకకకదలకఎప్పటివలెకూర్చుండియుండెను. మరునాడు అధికారివచ్చి విచారించగా విస్తర్లు ఆమానికుట్టలేదని తెలిసెను. అందుకాయన మిక్కిలి ఆగ్రహపడి వీడెంతసోమరి, ఎంతగర్విష్ఠియని ఆమానికడ రేగి, నీకెందుకు నాకుముందుండిన

అధికారి అన్నము పెట్టుచుండెను, చెప్పుమనిధిక్కరించి అడుగగా ఆవతానిమాటలాడక కూర్చుండుటకు సంజ్ఞచేసెను. ఆయధికారి ఏమోకారణముచెప్పుననికూర్చొనెను. ఈవతానిపలుకక ఎప్పటి వలెనే గదలకుండెను. ఎన్నిమారులు అధికారి తానుచేయ తలంచిన అనేకపనులు స్మరణకు వచ్చినట్లంతయు లేవనుద్యమించినను ఈవతానికూర్చుండమని సంజ్ఞచేయుచువచ్చెను. ఈఅధికారికి ఒకగంట కూర్చునియుండుటకలవికాకమిక్కిలిశ్రమనొంది, ఊరక కూర్చుండుట బహుకష్టమని అనుభవముచే తెలిసి, ఇకమీద ఈ వతానికి రెండుపూట్లభోజనముపెట్టమని గుమాస్తాకు ఆజ్ఞాపించెను.

దీనిచేనేమి తెలియుచున్నదన, మనసుపోయినట్లంతయు దేహమునుపోవుచున్నది. మనసుపోయినను దేహమును పోనివ్వక ఆపుటకు ప్రయత్నముచేయుచు అభ్యసించవలెను. ఈ జన్మమందు దేహమును స్వాధీనమందుంచికొనుటకు సమర్థతను పొందినట్లైన ముందుజన్మమందు దీనికై ప్రయత్నించ పనియుండదు.

గదిలో కూర్చునియుండినపుడు మనస్సు నియమింపబడిన చోట నిలచినట్లైన, బాహ్యమందే కార్యము చేయబూనినను ఆ కార్యమందు మనసును నిలుపుటకు సులభముగానుండును. బాహ్యవ్యాపారములకుకూడనిది కేవలముపయోగముగనుండును.

ఇట్లు ఒకప్రదేశమందు మనసుండునట్లుచేయుటకు ధారణ యనిచెప్పుదురు. భక్తిసంపాదింప నుద్యమించినవారికిది ముఖ్యమని శ్రీకృష్ణులుఅర్జుననికుపదేశించిరి.

అనన్యభక్తి నపేక్షించువారు లఘ్వాహారముగలవారుగా నుండవలెను. ''లఘ్వాశీ'' అనిస్వామి అర్జుననికి ఆనతిచ్చినారు. అమితముగాగాని, రాజసతామసాహారమునుగాని, తినదగదు.

ఎందుకనన అట్లుభుజించుట ధ్యానమునకు యోగమునకు భంగముగానుండును. ధ్యానయోగములురెండును భక్తికి

ముఖ్యసాధనములని వివరింపఁబడియున్నది. ఈ ధ్యానయోగములనుగురించి పదవయెనిమిదవమెట్లు వ్రాయునపుడు విశదపరచఁబడును.

"శ్లో॥ నాత్యశ్నతస్తుయోగోస్తి॥"

అని శ్రీకృష్ణులు చెప్పినారు. అతిగా భుజించువారికి యోగము సిద్ధించదు.

"శ్లో॥ యుక్తాహార విహారస్య"॥

ఆహారము మితముగానుండుటేగాక యుక్తముగానుండవలెను. అయుక్తముగానుండదగదు. అనగా రాజసతామసగుణములు వృద్ధిచేయునవిగానుండదగదు. రాజసాహారముచే వ్యాధిసంభవించును. వ్యాధిబాధచే మనసు స్థిమితముగానుండదు. మనస్థిమితములేనివానికి యోగమెక్కడిది? మఱియు రాజసాహారముగలవానికి దుఃఖముగలుగును. రోగికి దుఃఖములేకపోవునా? పూర్ణారోగ్యముగలవాఁడే పరమార్థమును సాధింపగలఁడుగాని నిత్యరోగికెట్లుసాధ్యమగును?

శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారారాజసస్యేష్టాదుఃఖశోకామయప్రదాః

వగరు, పులుసు, కారము, ఉప్పు, దాహముగలుగఁజేయు పదార్థములు, మొదలగునవి రాజసగుణముగలవారికిష్టముగానుండును. ఇవిదుఃఖము శోకము, రోగముకలుగఁజేయునని భగవద్గీతయందర్జునునికుపదేశింపఁబడినది.

"శ్లో॥ ఆయుస్సత్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః
రస్యాఃస్నిగ్ధాఃస్థిరాహృద్యాఆహారాస్సాత్వికప్రియాః॥"

ఆయుస్సును, సత్వగుణమును, బలమును ఆరోగ్యమును, సుఖమును, ప్రియమును, వృద్ధిచేయునట్టివియు, రసవంతమైనట్టివియు, మృదువైనట్టివి, స్థిరమైనట్టివియు, హృద్యమైనట్టివియునైన ఆహారము సాత్వికులకిష్టముగానుండును.

తామసాహారముచే సోమరితనమును, మరపునువృద్ధియగును, మదమెచ్చును, తెలివితప్పును, మైకముచే యుక్తాయుక్తములెరుగక తప్పుమార్గప్రవర్తనగలుగును. ఆహార విహారగుణముల ననుసరించి దేహగుణములును పెరుగుచువచ్చును. దేహపరిశుద్ధికిని దేహలఘుత్వమునకును, దేహారోగ్యమునకును ఆహార నియమము అత్యవసరము. సర్వకార్యములందును నియమముంచుకొని ఆనియమానుసారము తప్పకయుపక్రమించుచుండుట అత్యంతావశ్యకము. నియమము ప్రకారము జరుగుటకే తపశ్చరణయని పేరు.

శ్లో॥ "నియమేష్వతపశ్శబ్దః॥"

అని ఆపస్తంబసూత్రముగలదు. తపస్వియనగా నియమానుసారము వర్తించువాఁడని అర్థము. తపస్సులేనివానికి అనగా నియమము ననుసరించి నడవనివానికి భక్తియోగమెప్పటికిని లభించదనుటె సిద్ధాంతము. శ్రీకృష్ణులు భగవద్గీత పదునెనిమిదవ అధ్యాయమందు సర్వసారంబైన అనన్యభక్తియోగము తపశ్చర్యలేని వారి కుపదేశింపఁదగదని ఆజ్ఞయిచ్చినారు.

శ్లో॥ ఇదం తేనాఽతపస్కాయ నాఽభక్తాయకదాచన
నచాఽశుశ్రూష వే వాచ్యంనచమాంయోఽభ్యసూయతి॥

ఇది సర్వధర్మములు విడచితన్నే (ఈశ్వరునే) శరణుపొందుమనెడి గీతాశాస్త్రసారవాక్యము తపశ్చరణ లేనివానికి చెప్పవద్దని తాత్పర్యము. కాఁబట్టి నియమాచరణ అనగా తపశ్చరణలేనివానికి భక్తిలభించదు. మరియు ఆహార విహారనియమములులేని వానికిదేహము ఆటోపములోనుండదు. దేహము, వాక్కు, మనస్సు ఈమూఁడును ఆటోపములోనుంచికొనియుండుట దీనికావలిమెట్టుగా స్వామిఆజ్ఞయిచ్చినారు.

"శ్లో॥ యతవాకాయమానసః"॥

వాక్కును, దేహమును, మనస్సును స్వాధీనములోనుంచు

కొనియుండుటకు ప్రయత్నించుట భక్తిని పొందుటకు ఆరవమెట్టని తాత్పర్యము.

అమితముగా భుజించువానికిని, నియమములేక ఏపదార్థమైన తినువానికిని దేహమాటోపములోనుండుటయెప్పటికిని సిద్ధించదనుట మాటికిముమ్మాటికి నిశ్చయము. స్వాధీనముతప్పి జలమలవిసర్జనయు, సోమరితనమును, ఏపనిచేయుటకుగాని సమర్థతలేకుండుటయు అమిత అయుక్తాహారముగల వానికి సిద్ధించుననుట అందరికివిశదము. ఈఆరవమెట్టులో మొదటిది వాక్కును స్వాధీనమందుంచుకొనుట.

ఇదియోగమునకు ప్రథమద్వారమని ఇంతకుముందే చెప్పఁబడియుండెను.

"శ్లో॥ యోగస్యప్రథమంద్వారం
వాఙ్నిరోధోఽపరిగ్రహః॥"

అనెడి శ్రీశంకరాచార్యులవారి వచనమును ఉదాహరింపబడియుండెను. యోగమునకిది మొదటిద్వారమనుట నిస్సంశయము. వాక్కును నియమమందుంచుకొనుట బహుజాగ్రతచేనభ్యసించవలయు. నోటనుండి మాటవెళ్లునపుడంతయు వెళ్లుమాట సత్యమా అసత్యమా అనువిషయము యోచించి మాటవెలుపలికివదలవలయును. సత్యమైతేనే వదలవలయునుగాని అసత్యమైతే వదలదగదు. మరియు ఆమాటసత్యముగానుండుటయేగాక ప్రియముగానుండవలయు.

"శ్లో॥ సత్యంబ్రూయాత్ ప్రియంబ్రూయాత్
నబ్రూయాత్సత్యమప్రియం॥

అనిస్మృతిచెప్పుచున్నది గనుక ప్రియమైన సత్యమేచెప్పవలెగాని అప్రియమైన సత్యముచెప్పతగదు. గనుకనే భగవద్గీతయందు శ్రీకృష్ణులు వాఙ్మయ తపస్సునుగురించి యిట్లుచెప్పినారు,

"శ్లో॥ అనుద్వేగకరంవాక్యంసత్యంప్రియహితంచయత్

స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయంతప ఉచ్యతే''॥

సార్థకమైనట్టియు, ప్రియమును హితమునైనట్టి మాటలాడుటయు, అధ్యయన మభ్యసించుచుండుటయు వాఙ్మయ తపస్సని చెప్పఁబడుచున్నది.

పరమార్థమును గోరువారు వ్యర్థమైన సంభాషణ చేయదగదు.

''శ్లో॥ నతువృథా వాక్యంసముచ్చార్యతాం''॥

అని శ్రీశంకరాచార్యులవారానతిచ్చినారు. ఇప్పుడు సామాన్యముగా జనులాడు మాటలలో ముప్పాతికెపాలు వ్యర్థమైనమాటలుగానున్నవేగాని సార్థకమైనమాటలుగావు. ఎట్టి ప్రయోజనమును లేని సంభాషణే ఎచ్చటను వ్యాపించియున్నది. ఇట్లుండునపుడు జనులకు భక్తియెట్లుకుదురును? ఇంతియెగాక ఆడుమాటలు పరుషములుగా అనగా కఠినములుగా నుండదగదు. మృదువుగాను మధురముగాను ఉండవలయు.

''శ్లో॥ జిహ్వాపారుష్యంచానృతమపినావద॥''

నాలుకతో పరుషవాక్కులును, అనృతమును పలుకకూడదని సప్తఋషులలో నొకరు చెప్పినారు.

పరుషవాక్కులతో (కఠినమైన నిష్ఠురమైన మాటలతో) పరుల మనస్సు నొప్పించువాఁడు భక్తి చెందఁజాలఁడు.

''శ్లో॥ అన్నస్యదానంమధురాచవాణీ
యమస్యతేనిర్వచనాభవంతి॥''

ఎవరు అన్నదానముచేయుచు, మధురమైనమాటలాడుచుందురో వారిని యముఁడుపలకరించడని మహాభారతమందు చెప్పబడినది.

''శ్లో॥ చక్షుర్దద్యాన్మనోదద్యాద్వాచందద్యాచ్చసూనృతాం
ఉత్థాయచాసనందద్యాదేషధర్మస్సనాతనః

మంచిచూపుతో ఇతరులనుచూడవలెను. మంచిమనసుతో

ఆదరించవలెను, సూనృతములైన వాక్కులతో మాటలాడవలెను. లేచి ఆసనమిచ్చి కూర్చుండ చేయవలెను. ఇదిసనాతనధర్మమని ధౌమ్యులు ధర్మరాజునకుపదేశించినారు.

నిష్ఠురములైన పరుషోక్తులాడువారి హృదయములందు అనంతుడుండడని విష్ణుపురాణమందుదాహరింపఁబడినది.

"శ్లో॥ హరతిపరధనంనిహంతిజంతూన్

వదతితథానృతనిష్ఠురాణియశ్చ

అశుభజనితదుర్మదస్యపుంసః

కలుషమతేఃహృదితస్యనాస్త్యనంతః॥"

హృదయమందు విష్ణువులేనివానికి భక్తియెట్లులభించును. దీనిచేత భక్తినిగోరువారందరు అనృత పరుషవాక్కులను వదలి సూనృత మధురవాక్కులు పలుకుటే అభ్యసించవలెను.

మరియు వాక్కును నియమమందుంచుటయందు పరనింద చేయకుండ నిరోధించవలెను.

"శ్లో॥ పరాపవాదంపరిహర॥"

అనిసప్తఋషులలో నొకరు నుడివినారు.

"శ్లో॥ కోహీనవాచ్యస్సుధియాం

పరదోషశ్చానృతంతద్వత్॥"

బుద్ధిమంతులేవి పలుకరన పరులదోషమును, అనృతమునని శ్రీశంకరాచార్యులానతిచ్చినారు. భక్తిగోరువాఁడు స్వదోషముల ను గణించి ఆదోషములు హృదయమునుండి తరిమి పరిశుద్ధము గలవాఁడుకావలెగాని పరదోషములనుకువుచు ఆదోషములను తనయందుండు దోషములతోచేర్చి దోషబుద్ధి గలవాఁడు గా రాదు.

శ్లో॥ పరాపవాదంపారుష్యం పైశున్యమనృతంతథా

చత్వారివాచారాజేంద్ర నజల్పేనానుచింతయేత్॥

పరాపవాదమును, పరుషవాక్కును, కొండెముచెప్పుటయు,

అనృతమును ఈనాల్గును ఎప్పటికిగాని నోటనుడువఁగూడదని, శ్రీమన్మహాభారతమందు చెప్పఁబడినది. ఈ కారణమునుపట్టి భక్తిగోరువారందరు ఈవాఙ్మయతపస్సును ఆచరించవలెను. అనగా సత్యమాడుటయు, ప్రియమాడుటయు, హితమాడుటయు, సూనృత మృదుభాషలాడుటయు, పరులగుణములే నుడువుటయు, అభ్యసించుచుండవలయు. ఇవి అభ్యసించుచురాగా వీనికి విరోధమైన అనృత, అప్రియ, పరుషనిష్ఠుర, పరాపవాదవాక్కు-లన్నియు దూరముగ తొలగిపోవును. ఇది భక్తికి ముఖ్యము.

కం|| మనమునకుహితంబునుబ్రియ
మునుపథ్యముతథ్యమునున మోఘముమధురం
బునుబరిమితమునునగుపలు
కొనరఁగఁబలుకునదిధర్మయుతముగసభలన్||

కం|| చెలిమియుఁబగయును దెలివియుఁ
గలకయుధర్మంబుఁబాపగతియును బెంపుం
దులవతనంబునువచ్చును
పలుకుబడిన కానపొసఁగఁబలుకఁగవలయున్||

కాయమన దేహము. భక్తినపేక్షించువారు దేహమును అత్యంతపరిశుద్ధముగా నుంచవలెను. దేహముస్వాధీనములోనుండుటకు లఘ్వాహారమును, యుక్తాహారమును అవశ్యకమని యింతకు ముందు వ్రాయబడెను. దేహపరిశుద్ధికిస్నానాదులు అత్యవసరము.

శ్లో|| మలనిర్మోచనంపుంసాం జలస్నానందినేదినే||

దేహమలము పోవుటకు దినదినమును స్నానముచేయవలయు.

శ్లో|| అద్భిర్గాత్రాణి శుద్ధ్యంతి

గాత్రములనగా శరీరములు నీళ్లచేశుద్ధిజెందును. పరమభక్తులు తనుజీవనంబులు భగవదర్పణచేయుదురుగనుక భగవంతుని కర్పించదగినతనువులనగా దేహమేమాత్రమైన మలినముగా నుంచరు. మరియు జలమల విసర్జనములందు మృత్తికాదిశౌచ

ములును అవశ్యకమైయుండును. దేహమును యెన్నివిధముల శుచిగానుంచవలెనో అన్నివిధములను వినియోగించి దేహపరిశుద్ధిచెందుట భక్తులకుధర్మము.

భక్తిగోరువారు శరీరముతో దినదినము చేయవలసిన పనులివియని భగవద్గీతయందు చెప్పఁబడినది.

శ్లో॥ దేవద్విజగురు ప్రాజ్ఞపూజనంశౌచమార్జవం।
బ్రహ్మచర్యమహింసాచ శారీరంతపఉచ్యతే॥

దేవపూజ, బ్రాహ్మణపూజ, గురుపూజ, ప్రాజ్ఞులు అనగా ప్రజ్ఞగలవారిపూజ, అనగాబ్రహ్మవేత్తలు, (వీరెవరయినను చింత లేదు, బ్రాహ్మణజన్మమెత్తినవారుగానే యుండవలసిన అవశ్యము లేదు ప్రాజ్ఞులుగానుండిన యేజాతివారినిగాని పూజించుట) ఋజుత్వము, బ్రహ్మచర్యవ్రత మవలంబించియుండుట, అహింస, (ప జీవజంతువునుగాని బాధించకుండుట) ఇవన్నియు శరీరసంబంధమైన తపస్సని తాత్పర్యము. ఈపనులుచేయుటకు దేహముపయోగించుటచే అదెట్లుపరిశుద్ధమును పొందువిషయము విచారింతము.

మొదటిది దేవపూజ. ఇచ్చట దేవపూజయనగా నీస్థూల దేహముతో దేవాలయములలోనుండువిగ్రహములనుగాని, ఇండ్లలో నుండు సాలగ్రావ, లింగములను దేవతారూపములుగా దీర్చినప్రతిమలనుపూజించుట యనేఅర్థము చేయవలెను. ఈపూజగావించుటకుతులసి, బిల్వము, సుగంధముగలదవనము, మాచీపత్రి మొదలగు పత్రములుఅనగా ఆకులు, జాజి, మల్లికాదిసుగంధ పుష్పములు, శ్రీగంధము, కేసరి, కస్తూరి, పచ్చకర్పూరము మొదలగు పరిమళద్రవ్యములును, ధూపమునకుగాను, సాంబ్రాణి, గుగ్గిలము, శ్రీగంధపుపొడి, గోఘృతము (ఆవునెయ్యి) మొదలగుసువాసనగల పొగవచ్చుపదార్థములను, హారతికిగాను కర్పూరము ఈద్రవ్యములలో శక్తికొలదియు అనుకూలముకొలదియు సంపాదింపవలసివచ్చును. వీనిలోప్రతివస్తువునందును దేహపరిశుద్ధిజేయు గుణముగలదు.

తెలిసినమట్టుకు వానినిగురించి సంక్షేపముగ వ్రాయుచున్నాను.

తులసియందు దేహపరిశుద్ధము చేయుగుణము విశేషముగల దు. మొదటిదికొన్నిరోగములను నివారించును. ప్రతిదినమును తులసిఆకును ఉదయము నూరుదళములు తినుచుగాగా మల బద్ధ రోగము నివారణై విరోచనముసుకరముగానగును. జ్వరము మొదలగు రోగములను రానివ్వదు. దేహ్యామందుమారికాది అంటు రోగములుత్పత్తిజేయుఅణువులను అంటనివ్వదు. కొన్నిసంవత్సరములకు వెనుకతులసియొక్క సుగుణము ఒకడాక్టరుకనిపెట్టిన విషయము అందరికి తెలిసియుండిననుమంచిదని ఇందుదాహరించెద.

గుంటూరుసమీపముననుండు ఒకగ్రామములో కొంతకాలమునకుమునుపు ఒకఖూనీకేసుజరిగెను. (ఒకడుచంపబడెను). చంపబడిన వానిదేహాము తులసిచెట్లగుంపులో వేయcబడియుండెను. కొన్నిరోజులకావల ఆదేహమునువెతకితీసి డాక్టరుపరీక్షకివ్వబడెను. డాక్టరుపరీక్షించి తానుపరిక్షించిన ఒకరోజు అథవా రెండు రోజులకు పూర్వముహత్యేజరిగినట్లు తాత్పర్యపడినిశ్చయ పత్రిక (Certificate) వ్రాసియిచ్చెను. అనంతరము కేసువిచారణకు రాగా నీహత్యడాక్టరుపరిక్షించుటకు 10 రోజులకుముందే జరిగినదని బలమైనసాక్ష్యమువచ్చెను. డాక్టరునుపకారణముమీద నీవు పరిక్షించుటకు ఒకటి, రెండురోజులు క్రిందట ఈకార్యము జరిగినదని చెప్పుచున్నావని అడుగగా 10 రోజులక్రిందట హత్య జరిగియుంటె దేహమంతయుకుళ్లి అమితదుర్వాసనగలిగి పరిక్షించుటకు అనగాకోయుటకు వీలుకానంతచెడి నీరైపోయియుండునని చెప్పెను. ఇతరసాక్షులందరుపదిదినములకుముందే ఈపనిజరిగినదని దృఢముగచెప్పిరి: ఇదివినిడాక్టరు వీరిట్లుచెప్పుటకు పమికారణముండవచ్చునని మిక్కిలియోచించిశవమును వేసియుండిన చోటును తెలిసికొని తరువాతఒకకోడిని తెప్పించి దానినిచంపి ఒకగుడ్డలో తులసిఆకువేసి ఆచంపినకోడినిచుట్టి ఒకచోపదిరోజులుంచిపెట్టెను.

తదనంతరము ఆగుడ్డనువిప్పికోడిదేహమునుచూడగా నేమాత్రమైన చెడి దుర్వాసనపట్టక చంపినతరుణమందెట్లుండెనో అట్లనేయుండి నది. డాక్టరు చంపబడినవాని దేహముతులసిచెట్ల మధ్యవేషి యుండినదే పదిరోజులైనను దేహముమురగకుండుటకు కారణము నితెలిసికొనెను. ఈసమాచారము మద్రాసుమెయిలను నిత్యవా ర్తాపత్రికయందు ప్రచురించియుండిరి. జీవరహితమైన దేహమునే చెడకుండ నుంచియుండు గుణము తులసికిగలిగినపుడు జీవసహిత మైనదేహమును గురించిచెప్పనేల? దీనిచేతనే ప్రతియింటిలోగిలి లోనో, ముంగలిలోనో, లేకవెనుకభాగమందో హిందువులందరు అందులోబ్రాహ్మణులువైశ్యులుతప్పకతులసిచెట్టునుపెంచుచు, దాని చుట్టుచుట్టుచు, పత్రములుతినుచు, ఆమట్టినొసటధరించుచు, దూర మునైనపోయి తులసిదళములుకోసితెచ్చుచు, దేవాలయములందు విగ్రహములకుగాని, ఇండ్లయందుండు సాలిగ్రామాదులకుగాని పూజలొనర్చుచు, ఆదళములను ప్రసాదముగస్వీకరించుదురు. మరియు తులసిపూసలదండలను ఎడతెగకధరించుచుండిరి. ఇప్పు డిట్టి సులభమైనదేహారోగ్య, దేహపరిశుద్ధవిధులందు నమ్మకము తప్పిపోయినది. పూర్వపువారికి శాస్త్రములందు పరిపూర్ణ నమ్మక ముండినందున ప్రతిఆచారమునకు కారణములు చెప్పుచుండలేదు.

తులసిలోనెంత గుణమున్నదో బిల్వములోను అంతగుణ మున్నదనుటకు సంశయములేదు. ప్రతిదినమును లేతవైన బిల్వద ళములు తినుటచే జ్ఞానమువృద్ధియగునందురు. అనేక దీర్ఘ జాడ్యములకు బిల్వవృక్షమూలములను (మారేడుచెట్టువేళ్లను) ఉపయోగపెట్టుదురు. మారేడుకాయలు పగలగొట్టి నిప్పులో కాల్చి నెత్తికిపట్టించినట్లయిన ఉష్ణమునుపోగొట్టి శిరస్సునకును కండ్లకును చలవకలుగజేయును. ఈమారేడాకునుండి కలిగిన స్వానుభవమునుగురించి కొంచెముగా వివరించెద. నేనురెండు సంవత్సరములక్రింద మాభూములలోని పంటను తెచ్చుటకు గుత్తి

తాలూకు యంగిలిబండయను గ్రామమునకుపోయి అచ్చటపదునైదు దినములుంటిని. అప్పుడు ఆప్రాంత్యమున అధికవర్షములతో ఆ చుట్టునుండు గ్రామములలోను, ఆగ్రామములోను ఉండు బహు మందిపలుదినములనుండి జ్వరబాధ అనుభవించుచుండిరి. కూలికి జనులు చిక్కకేకష్టముగనుండెను. వీరు క్వైనైను మొదలైనయింగ్లీషుమందులనుపుచ్చుకొనరు. వీరిబాధచూడజాలక మిక్కిలిచింతించు చుంటిని. ఒకనాడు మారేడు లేతచిగుళ్లు యిచ్చినట్లయిన జ్వరము నివారణమగునని నాకుతోచెను. వెంటనే మారేడు చిగుళ్లు తెప్పించి, మిరియాలతోచేర్చినూరి గచ్చకాయంత మాత్ర లుచేసి నాకుసంబంధించిన రైతులిద్దరికిచ్చితిని. వారుఉదయము సాయంత్రము పూటకుమూడుమాత్రలు తీసుకొనుచుగాగా రెండు రోజులకేజ్వరమునిలిచిపోయెను. వారికి నివారణైనదితెలసి ఆయూ రిలోజ్వరమునుండి బాధపడుచుండిన వారందరు నావద్దకివచ్చి యీమందును పుచ్చుకొనిరి. రమారమి యేబదియరువదిమంది యుండవచ్చును వారందరికి ఈమారేడుఆకుమిరియాలనుండి జ్వర మునివారణైతమతమపనులుకుపోదొడగిరి. వీరందరిలోనిద్దరికిమాత్ర ము నివారణకాలేదు. దీనిచేచాతుర్థికజ్వరముకూడానివారణై నది. ఇదివినిచుట్టునుండు గ్రామములవారును రాదొడగిరి. అచ్చ టను ఆమందుపుచ్చుకొన్నవారికి స్వస్థమైనది. మాచిపత్రి మొదల గు సుగంధముగల ఆకులలోను దేహజాడ్య నివారణచేయు గు ణమున్నది. సువాసనగల పుష్పములును దేహారోగ్యమును వృద్ధిపరచును. అప్పుడప్పుడు దేవాలయములకుపోయి సుగంధ పత్రపుష్పములవాసనను ఆఘ్రాణించుటచేతను శిరస్సునందు ధ రించుటచేతను, కేసరి, పచ్చకర్పూరము, కస్తూరి మొదలగు ద్రవ్య ములతో మిళితమైన తీర్థమును లోపలికి పుచ్చుకొనుటచేతను, సాంబ్రాణి మొదలగు ధూపములపొగ నాసికారంధ్రములనుండి లోనికిపోవుటచేతను, వ్యాధిసంబంధమైన అణువులు దేహమందు

ప్రవేశించుటకు ఆటంకముగా నుండుననుటకు సంశయములేదు. ఇండ్లలో దేవపూజచేయుటచే ప్రతిదినమును దేహారోగ్యమునకు అనుకూలమగు అణువులు దేహమందు చేరుటయు ప్రతికూలమగు అణువులు తొలగిపోవుటయు సంభవించునుగనుక దేవపూజ శరీరతపస్సని చెప్పబడినది. ద్విజులనగా బ్రాహ్మణులు, ద్విజులనుపదము బ్రహ్మక్షత్రియవైశ్యులకు అన్వయించినను ఇచ్చట బ్రాహ్మణులనే అర్థము చేయవలెను. బ్రాహ్మణులన, యిప్పుడు మనకెచ్చటను అగుపడు వకీలుబ్రాహ్మణులును, గుమస్తా, మునసపు తహశీల్ దారు మొదలగు ఉద్యోగములందు నిపుణులగు బ్రాహ్మణులును, కల్లు సారాయి మొదలగు అబ్ కారి కంట్రాక్టుబ్రాహ్మణులును జౌళీవ్యాపారము, దళాలీవ్యాపారము పూటకూలి వ్యాపారము, చేయుబ్రాహ్మణులును, పాకపరిచారకాదులు చేయుబ్రాహ్మణులును, ద్రవ్యముపుచ్చుకొని విధికాలక్రమములను వదలి సమస్తశుచివ్రతములను విడచిసమస్తవ్యవహారములందు ప్రవేశించుచు, సత్యశీలములను పారదోలి, వైదికమంత్రకర్మముల రహస్యమించుకైన తెలియక ఉపనయనవివాహాది సంస్కారములను చేయించు వైదికులను పిలువబడు బ్రాహ్మణాదములునని తలంచదగదు.

ఇచ్చట బ్రాహ్మణులన లోకమునుతరించుటకై బద్ధకంకణులగు బ్రాహ్మణులని తెలియవలెను. వీరినిసృజించినదే లోకమునుకడతేర్చుటకనిమహాభారతశాంతి పర్వమందుదాహరించబడినది.

శ్లో॥ బ్రాహ్మణాలోకసారేణ సృష్టాధాత్రాగుణార్థినా
లోకస్తారయితుంకృత్స్నమ్మర్త్యేషుక్షితిదేవతాః॥

బ్రాహ్మణులు, లోకములోనందరిని తరించుటకుగాను బ్రహ్మచే భూదేవతలుగా లోకసారభూతములతో సృజింపబడిరని తాత్పర్యము. అనగాలోకమును తరింపజేయుటకు అనగా కడతేర్చుటకు సర్వప్రయత్నములు చేయువారెవరో వారుబ్రాహ్మణులు, ఈబ్రాహ్మణులకు సాధనభూతమైన ధనమేదన.

శ్లో॥ నైతాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తం
యథైకతా సమతా సత్యతా చ
శీలే స్థితిర్దండవిధానమార్జవం
తతస్తతశ్చోపరమః క్రియాభ్యః॥

ఏకత్వము, సమత్వము, సత్యత, సదాచారమందుస్థిరత్వము, భూతదయ, ఋజుత్వము (నిష్కాపట్యము) సమస్తకర్మలందు నుపరమము, వీనికిసమానమైనవిత్తము(ధనము) బ్రాహ్మణులకు లేదని తాత్పర్యము. ఇట్టివిత్తమునార్జించుటకు సర్వదా ప్రయత్నము చేయుచుండువారెవరో వారుబ్రాహ్మణులు, వీరుఇతరులను తరింపజేయుచు తామునుతరింతురు, అదెట్లన.

శ్లో॥ జపైర్మంత్రైశ్చ వేదైశ్చ స్వాధ్యాయాధ్యయనేనచ।
నావం వేదమయీం కృత్వా తారయంతి తరంతి చ॥

జపముల చేతను, మంత్రముల చేతను, అధ్యయనము చేతను, వేదమునే నావగా చేసికొని, నావికుడేరీతి నావయందందరిని కూర్చుండబెట్టి, వారినందరిని గట్టుచేర్చి తానును యొడ్డుచేరునో బ్రాహ్మణుడును అట్లనే అందరినిగట్టెక్కించి తానును గట్టెక్కునని తాత్పర్యము.

మఱియు నిట్టివారి తేజస్సు కేవలప్రకాశమానంబై వారిని చుట్టియుండును.

శ్లో॥ అసృజద్బ్రాహ్మణానేవం పూర్వం బ్రహ్మప్రజాపతిః
ఆత్మతేజోభినిర్వృత్తాన్ భాస్కరాగ్ని సమప్రభాన్॥

పూర్వమున ప్రజాపతియగుబ్రహ్మ సూర్యునియొక్కయు, అగ్నియొక్కయు తేజస్సువంటి తేజస్సుతోచుట్టియుండునట్టి బ్రాహ్మణులను సృజించెనని తాత్పర్యము. నిజమైన బ్రాహ్మణుల తేజస్సు సూర్యాగ్నుల తేజస్సువలె అమితప్రకాశమానంబైయుండుననుటకు సంశయములేదు. అదెందుకన వీరు ఇప్పటివారివలె దేహపోషణ, దేహసుఖములే సర్వంబని తలంచక బ్రాహ్మణ

దేహము తపశ్చర్యమునకుగానే బహుజన్మముల సుకృతఫలము చే ప్రాప్తమైనదని భావించి కేవలము ఉత్తరవాదత్వము వహించి పరోపకారమునకుగాను దానినెంత పరిశుద్ధపరచి, తేజోబలములతో వృద్ధిచెందించవలెనో అంతయు జెందించి ముల్లోకముల కుశలమునకై యుపయోగించుచుండిరి.

అదెట్లన,

శ్లో॥ సంపతన్ దేహజాలానికదాచిదిహమానుషే
బ్రాహ్మణ్యంప్రాప్య తేజంతుః తత్పుత్రపరిపాలయ
బ్రాహ్మణస్యతు దేహాయంనకామార్థాయజాయతే
ఇహక్లేశాయతపసే ప్రేత్యత్వనుపమంసుఖం॥

జంతువు (జీవుఁడు) అనేక దేహములలో పడిపడి ఒకానొకప్పుడు బ్రాహ్మణదేహమును పొందును. అట్లుపొందినపుడు, దానిని (బ్రాహ్మణదేహమును) బాగుగాపాలించుము. బ్రాహ్మణదేహమువచ్చుటదానిని సుఖపెట్టుటకుకాదు. ఇచ్చట (ఈలోకమందు) కష్టపడుటకును, తపస్సుచేయుటకుగానే వచ్చినదిగనుక తపస్సు ఆచరించుటచేతను పరోపకారమునకై కష్టపెట్టుటచేతను బాగుగ పాలింపుమని శుకులవారికి వ్యాసులుబోధించినట్లు మహాభారతమందుదాహరించఁబడినది.

మరియునచ్చటనే బ్రాహ్మణదేహమును సుఖపెట్టుటదానిని హేళనచేసినట్లనియు వ్యాసులవారు శుకులవారి కాజ్ఞయిచ్చివారు.

శ్లో॥ బ్రాహ్మణ్యంబహుభిరవాప్య తేతపోభి
స్తల్లబ్ధ్వానరతిపరేణహేళితవ్యం
స్వాధ్యాయేతపసిదమేచనిత్యయుక్తః
క్షేమార్థీకుశలపరస్సదాయతస్వ॥

బ్రాహ్మణదేహము బహువిధములతపస్సుచేయుటచే లభించుచున్నది. అట్టిదానినిపొంది దానిని సుఖపెట్టుటచేత హేళనచే

యావద్దుఅనగా తిరస్కరించవద్దు. సర్వదాఅధ్యయనముచేయుట చేతను, తపస్సునరించుటచేతను, శమదమాదులుకల్గియెడతెగక లోకశ్రేష్ఠులులోకకుశలమునకే ప్రయత్నించుచుండుమని వ్యాసులు శుకులకాజ్ఞయిచ్చిరని తాత్పర్యము.

బ్రాహ్మణులకు భూతదయయే ఉత్తమధనముగనుక ఆధనార్జనయందే తమకాలము గడుపుచుందురు,

శ్లో॥ సర్వభూతహితంకుర్యాత్ నాఽహితంకశ్చిద్ద్విజః
మైత్రీసమస్తభూతేషు। బ్రాహ్మణస్యోత్తమంధనం॥

బ్రాహ్మణుఁడు సమస్తభూతములకు హితమునేచేయవలయునుగాని అహితముచేయదగదు. సర్వభూతములందు మిత్రభావమే బ్రాహ్మణులకు సర్వోత్తమమైన ధనమని విష్ణుపురాణమందు చెప్పఁబడినది.

నిజమైనబ్రాహ్మణులకు సర్వభూతహితము అనగా లోకోపకారముచేయుట సహజముగనుండును. దేహమునకు నిద్రాహారములెట్లు స్వభావమో అట్లనే లోకోపకారము చేయుటకూడా స్వభావముగానుండును.

శ్లో॥ నధనార్థంయశోర్థంవా ధర్మస్తేషాంయుధిష్ఠిర
అవశ్యంకార్య ఇత్యేవశరీరస్యక్రియాస్తథా॥

ఇట్టిబ్రాహ్మణులుధర్మాచరణ ద్రవ్యనిమిత్తముగాని యశస్సు కీర్తినిమిత్తముగానిచేయరు, శరీరనిమిత్తమైన నిద్రాహారక్రియలెట్లు అవశ్యములో అట్లనేధర్మాచరణమును అవశ్యమైయుండునని తాత్పర్యము.

ఇట్టిబ్రాహ్మణులయొద్దనివసించుచుండవలెనని చెప్పఁబడినది.

శ్లో॥ యత్రధర్మమనాశంకాచరేయుర్వీతమత్సరాః
భవేత్తత్రవశేచ్చైవపుణ్యశీలేషుసాధుషు ॥

మత్సరాదిదుర్గుణములులేక స్వభావముగానే ధర్మమునాచరించు పుణ్యశీలములుగల బ్రాహ్మణులతోకూడగాని సమీపముననగా

ని నివసించవలెనని తాత్పర్యము.

ఇట్టివారినాశ్రయించియుండుటచే నేమిఫలమన.

శ్లో॥ యథోదయగిరేర్ద్రవ్యం సన్నికర్షేణదీప్యతే
తథాసత్సన్నికర్షేణహీనవర్ణోపిదీప్యతే
యథాతిలానామిహపుష్పసంశ్రయాత్
పృథక్ పృథగ్యాతిగుణాతిసౌమ్యతాం
తథానరాణాంతువిభావితాత్మనాం
యథాశ్రయంసత్వగుణప్రవృద్ధతే॥

ఉదయగిరి సమీపమునకు తీసికొనిపోయిన పదార్థ మెట్లు ప్రకాశించుచున్నదో అట్లనే భాస్కరాగ్నుల తేజస్సువంటి తేజస్సుగల ద్విజులనాశ్రయించి పూజించుటచే వర్ణహీనులును సువర్ణముగలవారగుచున్నారు. నువ్వులను సుగంధ పుష్పములతో పదేపదే చేర్చినట్లంతయు నువ్వులకుసుగంధమెట్లు హెచ్చుచున్నదో అట్లనే ఆత్మవేత్తలైన బ్రాహ్మణులతోకలిసి సేవించుచుండుటచే సత్వగుణము వృద్ధిచెందుచున్నదని తాత్పర్యము.

దీనిచేతనే భక్తిగోరువారు శరీరపరిశుద్ధికై యిట్టిద్విజుల పూజచేయవలెనని చెప్పఁబడినది. ఇట్టిగుణములేక నామమాత్రమున బ్రాహ్మణులుగానుండువారినిమాత్ర మెప్పటికిని ఆశ్రయించదగదు. అర్థనిమిత్తమై ధర్మాచరణ సేయువారు సద్బ్రాహ్మణులుకారు.

శ్లో॥ ధర్మమర్థ నిమిత్తంచ చేరేయుర్యత్రమానవాః।
నతాననువసేజ్జాతు తేహిపాపకృతోజనాః॥

ద్రవ్యాపేక్షచేతధర్మమననుసరించువారు పాపిష్ఠులుగనుక అట్టివారిని ఎప్పటికైన ననుసరించదగదు. ఎందుకన,

శ్లో॥ అసతాందర్శనాత్ స్పర్శాత్
సంజల్పాశ్చసు ఖాసనాత్
ధర్మాచారాఃప్రహీయంతె
సిద్ధించిచనమానవాః॥

పాపిష్ఠులనుచూచుటచేతను, స్పృశించుటచేతను, వారితో మాటలాడుటచేతను వారితోకూడకూర్చుండుటచేతను, ధర్మాచార నాశమై మానవుఁడుసిద్ధిచెందడని తాత్పర్యము. కనుక మనకిప్పు డగుపడుబ్రాహ్మణులు ప్రాయశః ఈరెండవతరగతివారుగానుండు టనుపట్టిమనకీగతి సంభవించినది. భక్తిగోరువారందరు మొద టితరగతివారిని పూజించవలెగాని రెండవతరగతిద్విజులనుకాదు.

గురువుకంటె నధికుడెవడునులేడు. గురువనగా అజ్ఞానాంధకారమునుండీ తొలగించువాడు. సచ్ఛిష్యుడుగురువును దేవునిగా నెంచును.

శ్లో॥ గురుర్మాతాపితాచైవగురుదేవహిబాంధవః
గురుదైవాత్పరంనాస్తితస్మైశ్రీగురవేనమః॥

గురువే తల్లి, గురువేతండ్రీ, గురువేబంధువు, గురువే దైవము, గురువుకంటె నధికదైవమేదియులేదు గనుక గురువుకు నమస్కారమని గురుగీతలందు చెప్పబడినది.

గురువననెవరు?

శ్లో॥ కోగురురధిగతతత్త్వశ్శిష్యహితాయోద్యతస్సతతం॥

ఎవడు తత్త్వమును తెలిసి శిష్యులహితమును సర్వదాకోరు చుండునో వాడుగురువని శ్రీశంకరాచార్యులవారు ప్రశ్నోత్తర రత్నమాలయందుచెప్పినారు. గురువు, శిష్యుడు దేహపరిశుద్ధ మందును, మనోనైర్మల్యమందును, బుద్ధికుశలతయందును, జ్ఞాన సంపత్తియందును, తేజఃప్రకాశమందును, తనవంటివాడుకావలె నని సర్వదాకోరుచుండును. శిష్యుడుతాను సమస్తవిషయము లందును గురువుయొక్క గుణములనుపొందవలెనని యిచ్ఛయించు చు గురువునందు అమితభక్తివిశ్వాసములుగలిగిసేవించుచుండును. గురువు తనకుగల సుగుణసంపత్తినంతయు శిష్యునకు అనుగ్రహించవలెననియు, శిష్యుఁడు ఆసంపత్తిని పరిగ్రహించవలెననియు సర్వదా యిచ్ఛయించుచునేయుందురు. గురుశిష్యులకు అను

గ్రహ పరిగ్రహములే పరస్పరసంబంధముగానుండును. అను గ్రహపరిగ్రహధర్మము ననుసరించి (Law of positive and negative states) పరిగ్రహించు స్థితిలోనుండు శిష్యుడు అనుగ్రహించు స్థితిలోనుండు గురువుయొక్క స్థితిని పొందితీరును. అయస్కాంతమునకు (సూదంటురాయి) యినుమును ఆకర్షించుశక్తి గలదు. అయస్కాంతమునకును యినుమునకును క్రమముగ పరస్పర అను గ్రహ పరిగ్రహసంబంధము గలదు. అనగా అయస్కాంతమున కుగల యినుమునుఆకర్షించుశక్తి అయస్కాంతముతో అర్ధగంట సేపుచేర్చియుంచిన యినుపముక్కకుగలుగును. అనగా అయ స్కాంతముతో అర్ధగంటసేపు చేర్చియుంచిన యినుపముక్క యింకొక యినుపముక్కను ఆకర్షించును. దీనికి అనుగ్రహ పరిగ్రహ ధర్మమని పేరు. గురువుసమీపమున శిష్యుడు కేవల విన య విశ్వాసభక్తి చేయేమియు చేయక యూరకకూర్చునియుండినను ఆగురువుయొక్క తేజస్సును దేహపరిశుద్ధమును పొందును.

శ్లో॥ నిరారంభోప్యపివయంపుణ్యశీలేషుసాధుషు
పుణ్యమేవాప్నుయాన్మేహపాపంపాపోపసేవనాత్॥

ఆరంభరహితుడుగా (పపనిసేయక) భక్తితో పుణ్యపురు షులైన సాధువులసేవచేయుచుండుటచేతనే ఆపుణ్యమును సాధు త్వమునుపొందునని తాత్పర్యము.

ఈ కారణమునుపట్టి గురుపూజచేత దేహపరిశుద్ధము గలుగునని చెప్పబడినది.

ప్రాజ్ఞులనగా బ్రహ్మవేత్తలు. "ప్రజ్ఞానంబ్రహ్మ" అని ఉపనిషత్తు పలుకుచున్నది. ప్రాజ్ఞులు పజాతివారైననుసరే. అట్టివారిపూజచేయుటచే దేహపరిశుద్ధత్వము పైచెప్పిన అను గ్రహ పరిగ్రహధర్మమును పట్టిపొందుదురు.

బ్రహ్మచర్యమనగా స్త్రీ సంపర్కముచేగాని లేక నితర విధమువగాని వీర్యస్ఖలితముగాక స్త్రీకామసంకల్పమును మనసున

రానివ్వక నిగ్రహించియుండుట. స్త్రీసంపర్కము చేతను, వీర్య స్రవము చేతను దేహపటుత్వముతప్పును. దానిచేత పలురోగ ములు వాటిల్లును. భక్తి పొందుటకు కేవల భంగకరములగు దేహసాధనంబులుండును. ఇదిగొప్పధర్మము. ఇట్లనినప్పుడు గృహస్థధర్మమునను౦డువారికి భక్తి కలుగదాయని శంకకలుగు చున్నది. వివాహాదులు పూర్తిగా వదలవలయునని చెప్పుటకు కూడా ఆస్పదమగుచున్నది. దానిచే ప్రజావృద్ధికిని జగత్తు యొక్క స్థితికిని భంగమగుచున్నదని ఆక్షేపణకలుగుచున్నది. బ్రహ్మచర్య వ్రతమవలంబించవలెననగా వివాహములువదలి అందరు ఏకాంగులైవర్తించవలెనని అర్థముచేయదగదు. వివాహముచేసికొనినవారైనను బ్రహ్మచర్యవ్రతమెట్లు ఆచరించ వచ్చునో అట్లుఆచరించవలెను. అదెట్లన;—

ఏగృహస్థుమధ్యాహ్నమొకపూట రాత్రియొకపూట-ఈరెండు పూటలుమాత్రము భుజించుచు ఈమధ్యకాలమున ఏమియుతినక నీరైనను త్రాగకనుండునో వాడు సదోపవాసియనియు, ఋతుకా లమనగా స్త్రీకిగర్భగ్రహణకాలము ప్రాప్తించినప్పుడు మాత్ర ము తనభార్యతోకూడువాడు నిత్యబ్రహ్మచారియనియు, దేవకార్య మందును పితృకార్యమందును అతిథిపూజలందును మాత్రమువారి కి సమర్పించి శేషించినమాంసముతినుచు మరల నెప్పటికిని తి నకుండువాడు అమాంసభక్షకుడనియు, తనవలెనేతనపజ్త్కిలోభు జించుటకు కూర్చున్నవానిని భుజింపజేయువాడు విఘశాసనుడు అనగాయజ్ఞశిష్టమును భుజించువాడనియు, తనసేవకులందరు భు జించినతరువాత భుజించువాడు అమృతాసియనియు, పగలు నిదు రబోని పుణ్యుడు అస్వప్నుడనియు శ్రీమన్మహాభారత అనుశాసనీ క పర్వమందుదాహరింపబడినది. ఇవిగృహస్థుకు ముఖ్య ధర్మ ములు.

వివాహముచేసికొనుటయొక్క ముఖ్యోద్దేశము సత్సంతా

నోత్పత్తియు గృహస్థధర్మమునకుపుటయు గనుక సత్సంతానోత్ప త్తియగుటకు ఏకాలము, ఏసందర్భము, ఏస్థితి, ఏలక్షణము, భార్యయందగుపడునో అప్పుడుమాత్రము కూడిధర్మము నెరవేర్చుటచే బ్రహ్మచర్య వ్రతము తప్పినవాడుకాడు. ఈస్థితి, సందర్భ, కాల, లక్షణములు కలిగియుండుసమయమే ఋతుకాలముగాని నెల నెలకు రజస్వలయగుకాలము మాత్రమే కాదు. ఈవిషయముల న్నియు వివాహనిషేకధర్మ ప్రదీపికయందు విశేషముగ ప్రమాణ ములతోను యుక్తులతోను గొప్పపాశ్చ్యాత్యులగు డాక్టర్లతాత్ప ర్యము లుదాహరించుచు వ్రాయబడినది.

ఇట్టిసంపర్కము ధర్మమునకు విరుద్ధమైనదికాదు. ధర్మ మునకు విరుద్ధముకానికామము నేనేయని శ్రీకృష్ణులవారు భగవ ద్గీతయందుపదేశించినారు.

శ్లో॥ ధర్మావిరుద్ధోభూతేషు కామోస్మిభరతర్షభ॥''

ధర్మమునకు విరుద్ధము కాని కార్యములన్నియు భగవత్కా ర్యములేయనుటకు సంశయములేదు.

ధర్మమునకు విరోధముగా స్వభార్యయందైనను రతిసల్పు టచే దేహమనంబులెట్లు చెడునది విచారింతము.

నచికేతునికి యముడు అనుపమానసౌందర్యముగల అనేక అప్సరస స్త్రీలనిచ్చెదనని చెప్పగా ఆనచికేతను డిట్లుత్తరమి చ్చెను.

శ్లో॥ శోభావామర్త్యస్యయదంతకేతత్సర్వేంద్రియాం
ణాంజరయంతి తేజః॥

స్త్రీసంభోగమాదియందు మిక్కిలిసుఖముగా దోచునుగా ని పర్యవసానమందు సమస్తేంద్రియంబుల తేజస్సును హరించును గనుక నాకు ఆస్త్రీలసహవాసమువద్దని చెప్పెనని కఠోపనిషత్తు నందుచెప్పబడినది. ధర్మవిరుద్ధ స్త్రీసంగమముచే దేహేంద్రి య పటుత్వముచెడును. అతిసంగమము చేత రోగములుత్పత్తి

యగును.

శ్లో॥ అత్యంబుపానాదతిమైథునాచ్చ
దివాస్వపంజాగరణంచ రాత్రౌ
సంధారణాన్మూత్రపురీషణంచ
షడ్భిర్మనుష్యైఃప్రభవంతిరోగాః॥

అతిగానీళ్లు త్రాగుటచేతను, సంపర్కముచేతను, పగలు నిద్రించుటచేతను, రాత్రిమేల్కొనియుండుటచేతను, మలమూత్రములు బిగియపట్టుటచేతను, ఈఆరింటిచేత రోగములుత్పత్తియగుచున్నవని వైద్యశాస్త్రము నుడువుచున్నదిగనుక బ్రహ్మచర్యవ్రతము దేహసంబంధ తపస్సని చెప్పఁబడుచున్నది.

ఈ కారణమునుపట్టి భక్తి గోరువారందరు దేహపరిశుద్ధత్వమునకుగాను శారీర తపస్సగు బ్రహ్మచర్యధర్మ మతిక్రమించక సలుపవలెను.

అహింస అనగా జీవజంతువులను కష్టపెట్టకుండుట. ఏప్రాణుల దేహమునకుగాని తనకర్మేంద్రియములతో బాధపెట్టకుండుట. ఇదియు శరీరసంబంధమైన తపస్సు.

ఈ తపశ్చరణచే కాయము అనగా స్థూలదేహము పరిశుద్ధముగా నుంచవలెను.

స్థూలదేహముమట్టుకు పరిశుద్ధముగా నుంచినమాత్రము చాలదు. సూక్ష్మకారణదేహములును పరిశుద్ధముగానుంచవలెను. కేవలదేహేంద్రియ సుఖసంబంధములైన కోరికలనే కోరుచుండుటచే సూక్ష్మదేహము పరిశుద్ధముకాదు. ఇచ్ఛలన్నియు పరోపకారమునుగురించినవిగానుండవలెను. ఇంద్రియోద్రేకము కలుగజేయు యిచ్ఛలుగానుండదగదు. నిర్మలమైన కోరికలచే సూక్ష్మదేహము పరిశుద్ధము చెందును.

కారణదేహము కేవలపారమార్థిక తలంపులచేతను, వ్యాసంగముచేతను, నిష్ఠచేతను, ఆచరణచేతను పరిశుద్ధమయి పె

రుగును. కారణదేహమును ఆదియందు పెంచవలసినది భక్తులకువిధి. ఇవ్విధమున కాయమనగా దేహమును అనగా మూడు దేహములను పరిశుద్ధపరచి స్వాధీనమందుంచుకొనవలెను.

ఇదిగాక మనస్సుశుద్ధపరచి స్వాధీనముచేసికొనవలెను. ఇదిఅన్నిటికంటెకష్టము. అదెట్లన మనస్సునందు దురిచ్ఛలు, దుస్సంకల్పములు, జనించుచుండినను, ఆయిచ్ఛలను, సంకల్పములను బాహ్యమందు రానివ్వక వాక్కును దేహమును ఇంద్రియములను నిగ్రహించుట కష్టతరసాధ్యముగనుండును. అవ్విధమున చేయువారనేకులుగలరు. కానిమనస్సునందట్టి కామక్రోధసంకల్పములును, ఆశలును పుట్టకనేచేయుట కష్టతమము. మనస్సునందు జనించిన యిచ్ఛలు, సంకల్పములు వీనికిలోబడక ఆయిచ్ఛలను తలంపులను కార్యములందు పరిణమింపజేయక ఆపువారిని యింద్రియనిగ్రహులని చెప్పుదురు. ఇట్టిసంకల్పములు బొత్తుగా మనస్సునందు పుట్టకుండచేసినవానికి యోగారూఢుడని పేరు.

శ్లో॥ యదాహిచేంద్రియార్థేషునకర్మస్వనుషజ్జతే।
సర్వసంకల్పసన్యాసీయోగారూఢస్తదోచ్యతే॥
(గీ. 6—4.)

ఎప్పుడు యింద్రియార్థములందు అనగా నింద్రియసుఖోపకరణంబులగు విషయములను సంపాదించుపనులందు యిచ్ఛవదలి సమస్తసంకల్పములను పరిత్యజించినవాడగునో అప్పుడు యోగారూఢుడని పిలువబడునని భగవద్గీత ఆరవ అధ్యాయమందు శ్రీకృష్ణులు అర్జునుని కుపదేశించినారు. సంకల్పములుడిగితేనే గాని మనస్సుస్వాధీనముగాదు.

దీనినిసాధించుటకుమనోమయతపస్సు అవలంబించవలయు.

శ్లో॥ మనఃప్రసాదసౌమ్యత్వంమౌనమాత్మవినిగ్రహః।
భావసంశుద్ధిరిత్యేతత్తపోమానసముచ్యతే॥
(గీ. 17—16)

మనస్సును, ద్వంద్వములగు సుఖదుఃఖాదులుకలిగినను వికలత్వమును చెందనివ్వక సమముగానుంచుకొనుట అభ్యసించుచురావలెను. ఎప్పటికిని సంతోషముకలిగియుండుట అలవాటుచేయవలెను. మనస్సునునిగ్రహించుచు గొప్పవిషయములు మననముచేయుచు విశుద్ధమైన భావములు మనస్సునందుంచికొనుచుండుటచేత బహుకాలమునకు క్రమక్రమముగా స్వాధీనమునకు వచ్చును.

ఇట్లువాక్కును, కాయమును, మనస్సును స్వాధీనపరచుకొని భక్తిగోరువారు ధ్యానయోగము లభ్యసించవలయును. ధ్యానయోగాభ్యాసకులు "బుధ్యావిశుద్ధ యాయుక్తో" మొదలిడి "యతవాక్కాయమానసః" అనుటవరకు చేయదగినవన్నియు ధ్యానయోగములకు సాధనలు. వీనిసాధించక ధ్యానయోగము లభ్యసించుట కడుదుర్లభము. ధ్యానయోగసిద్ధిచేతనే పరమాత్మను చూడనలవియగునుగాని వేరువిధముగ కాదు.

అనన్యభక్తి గోరువారికి ధ్యానయోగంబులత్యవసరము. ధ్యానయోగంబులచేతఁ దక్క వేరువిధముగఆత్మనుగాని, పరమాత్మనుగాని తెలిసికొనుటకు సాధ్యముకాదు ఆత్మయొక్క స్థానము హృదయము.

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి॥

ఈశ్వరుడు హృదయప్రదేశమందుండునని భగవద్గీతయందు చెప్పబడినది. ఏవస్తువుఎక్కడనుండునో అక్కడచూచితేనే తప్ప వేరుస్థలములో చూచితేదొరకదనుట అందరికి విశదము. ఈశ్వరుడు హృదయమందుండుటనుపట్టి ఈశ్వరునిపొందగోరువారు హృదయమందుచూడవలెను. ధ్యానయోగంబులచే హృదయమందు చూచువారికితప్ప ఇతరులకుఆత్మస్వరూపము తెలియదనుట స్పష్టము. ఇప్పుడు సామాన్యజనులకుండు దృష్టి బహిర్దృష్టి. ఈ దృష్టిగలవారు బాహ్యవస్తువులను చూడగలరేగాని లోపలనుండు

ఈశ్వరునిచూడజాలరు. ఎందాక ఇంద్రియముల వ్యాపారములుండునో అందాక బాహ్యదృష్టియుండును. కన్నులచే బాహ్యమందుండు వస్తువులను చూచుచున్నారము, చెవులచే బాహ్యశబ్దములను వినుచున్నారము, నాసికముచే బాహ్యవస్తువులనుండి వచ్చుగంధమును ఆఘ్రాణించుచున్నారము, త్వక్కుచే బాహ్యవస్తువులనుండి యుత్పత్తియగు శీతోష్ణముల స్పర్శను అనుభవించుచున్నారము, జిహ్వచే బాహ్యవస్తువులరుచిని తెలిసికొనుచున్నారము. ఇట్లు ఇంద్రియములచే బాహ్యవిషయములను గురించి తెలియుట సాధ్యమగునే గాని లోపలిసంగతి తెలియుటకు సాధ్యము కాదు.

శ్లో॥ పరాంచిఖానివ్యతృణత్స్వయంభూ
స్తస్మాత్పరాఙ్పశ్యతినాంతరాత్మన్॥

ఇంద్రియములు ఆత్మకంటె వేరైనవి గనుక ఆత్మకంటె వేరైన వస్తువులచే చూచుచున్నవిగాని లోపలనుండు ఆత్మను చూడవని కఠోపనిషత్తునందు చెప్పబడినది. గనుక ఇంద్రియములకు ఆత్మను చూచుటకలవిగాదు. మనస్సుతో తెలియుటకును బుద్ధితో గ్రహించుటకును సాధ్యము కాదని అనేక ప్రమాణములుగలవు.

శ్లో॥ నైవవాచానమనసాప్రాప్తుంశక్యో

అని ఆయుపనిషత్తే పలుకుచున్నది. సామాన్యజనులకందరికి ఇంద్రియమనోబుద్ధులే వ్యాపారమందున్నవిగాని వేరేదియు లేదని అందరికి తెలిసేయున్నది. బహుజనులు ఈయింద్రియమనోబుద్ధులకు లోబడియున్నారుగాని వీనినిలోపరచుకొనినవారు అరుదు. ఇంద్రియములు పోయినదారిని మనసును, మనసునను సరించి బుద్ధియు, పోవుచుండునపుడు ధ్యానముగాని యోగముగాని లభించదు. ధ్యానయోగములతోతప్ప వేరువిధముగ లోపల చూచుశక్తిగల అంతరింద్రియమును పక్వపరచుటకు సాధ్యము కాదు. అదెట్లన ధ్యానము సఫలమగుటకు ఏకాగ్రత ముఖ్యమైన సాధనము. విషయములను స్మరించుచుండువరకు బహిః ప్రజ్ఞ

యుండును. అది బహుముఖముల ప్రవేశించుచుండును.

శ్లో॥ బహుశాఖాహ్యనంతాశ్చబుద్ధయోఽవ్యవసాయినామ్॥

మనసును ఏకాగ్రతకు తెచ్చుటకు వ్యవసాయము అనగా ప్రయత్నముచేయనివారి బుద్ధిలెక్కించుటకు మితములేని విధములుగా పోవుచుండునని భగవద్గీత వాక్యప్రమాణము.

శ్లో॥ వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహకురునందన॥

మనసును వ్యవసాయముచే ననగా ప్రయత్నముచే ఏకాగ్రతకు తెచ్చినవారి బుద్ధి ఒకటే ప్రదేశములో నిలచియుండునని అదే గీతాప్రమాణము.

దీనికిపూర్వమున వివరించిన విపిక్తసేవచే అనగా ఏకాంతముగా కూర్చుండి అభ్యసించుటచే సంపాదించిన మనోధారణ అనగా ఏకాగ్రత, ధ్యానపూర్వకముగా అంతరింద్రియమును అనగా యోగదృష్టి, అథవా దివ్యదృష్టి, అథవా జ్ఞానదృష్టిని పక్వముచేసికొని తద్వారా ఆత్మానుభవమును పొందుటకు సదుపాయముగానుండును. అదెట్లుపక్వముచేయవలెనన. మొట్టమొదట బాహ్యవస్తువులను స్మరించుట, వానినిపొందుటకు ప్రయత్నించుట మొదలగునవి విడువవలయు. ఏలనన బాహ్యవస్తుస్మరణవలన దుర్వాసనలు అనగా దురిచ్ఛలు అధికమగుచున్నది. ఆయిచ్ఛలు నెరవేర్చుటకు అనేకకార్యములు చేయబూనవలసివచ్చుచున్నది. కాలమంతయు దానికే వ్యయమైపోవుచున్నది గాని ఆత్మను తెలియుట కవకాశముండదు. ఇందుకే వివేకులు బాహ్యవిషయ స్మరణను వదలుచున్నారు.

శ్లో॥ బాహ్యానుసంధిఃపరివర్ధయేత్ఫలం
దుర్వాసనామేవతతస్తతోధికాం
జ్ఞాత్వావివేకైఃపరిహృత్యబాహ్యం
స్వాత్మానుసంధింవిదధీతనిత్యం॥

బాహ్యవిషయములను స్మరణచేయుచుండుటచేత దుర్వాస

నఫలమే అధికమగుచువచ్చునని తెలిసి వివేకులు బాహ్యావస్తువుల అనుసంధానమునువదలి ఆత్మాను సంధానము చేయవలయునని వివేకచూడామణియందు చెప్పబడినది.

శ్లో॥ బాహ్యేనిరుద్ధేమనసఃప్రసన్నతా
మనఃప్రసాదేపరమాత్మదర్శనం
తస్మిన్సుదృష్టేభవబంధనాశో
బహిర్నిరోధఃపదవీవిముక్తేః॥

బాహ్యావస్తువులను స్మరించుటను నిరోధించుటచే మనస్సు శాంత మొందుచున్నది. మనశ్శాంతిచే పరమాత్మదర్శనమగు చున్నది. ఆదర్శనముచే సంసారబంధము నాశ మొందుచున్నది గనుక బాహ్యానుసంధాననిరోధమే ముక్తిపదవికి మూలమని అదే గ్రంధమందే వివరింపబడినది.

మనస్సుకు ప్రాప్తమైన బాహ్యాను సంధానమలము ఎట్లు పోవునది ఈక్రింది శ్లోకముచే తెలియుచున్నది.

శ్లో॥ యథాసువర్ణంపటుపాకశోధితం
త్యక్త్వామలంస్వాత్మగుణంసమృచ్ఛతి
తథామనస్సత్వరజస్తమోమలం
ధ్యానేనసంత్యజ్యసమేతితత్వం॥

ఎవ్విధంబున బంగారును పుటములువేయుటచే స్వచ్ఛమైతనగుణమునే పొందుచున్నదో అవ్విధంబుననే మనస్సు ధ్యానముచేత సత్వరజస్తమస్సంబంధమైనమలినమును వదలితత్వమును పొందుచున్నదని తాత్పర్యము.

ఈకారణముచేత ఆత్మను తెలియ నపేక్షించువారందరు ప్రతిదినంబును ధ్యానముచేయవలసినది అత్యవసరము. ధ్యానమెవ్విధమున జేయవలెనన, ధ్యానము వారివారిమనః పరిశుద్ధిని పట్టియు, శక్తినిపట్టియు వేర్వేరు విధముగా చేయవచ్చును.

సామాన్యజనులకు సాకారధ్యానము సులభముగానుండు

ను. సాకారధ్యానము మొదట ప్రారంభించి క్రమక్రమముగ ఆత్మను, పరమాత్మను అనుసంధానముచేయుట సుకరము.

బహుముఖములుగఁ పోవుచుండుమనసును మొదటకరచరణా ద్యవయవములుగలిగి సర్వాభరణములతో నలంకరింపబడిన దివ్య తేజోమయంబైన యిష్టదేవుని ఆకారమందునిలుపవలెను. మనసు సర్వదా ఏదో ఒకవస్తువునుగాని విషయమునుగాని తలంచుచుం డునుగాని ఊరకలవలేశమాత్రమైననుండదు. గనుక ఇతరవస్తువు లందును, యితరవిషయములందును పోవుచుండు మనసును యిష్ట దేవతారూపమందు నిలుప నభ్యసింపబూనవలెను. మనసు యితర వస్తువులందుపోక యిష్టదేవతారూపమందు మాత్రముకదల క ఎప్పుడు నిలుచునో అప్పటినుండి క్రమక్రమముగ ఒక్కొక్క అవయవమును మనస్సునుండి వదలవలయును.

సాకారధ్యానమునుగురించి శ్రీకృష్ణులు ఉద్ధవునకిట్లు ఉప దేశించినట్లుశ్రీమద్భాగవతముపకాదశస్కంధమందు చెప్పబడినది.

శ్లో॥ తత్సర్వవ్యాపకంచిత్తంఆకృష్యైకత్ర ధారయేత్
నాన్యానిచింతయేద్భూయస్సుస్మితంభావయేన్ముఖం
తత్రలబ్ధపదంచిత్తంఆకృష్యవ్యోమ్నిధారయేత్
తచ్చత్యక్త్వాముదారోహేనకించిదపిచింతయేత్
ఏవంసమాహితమతిర్మామేవాత్మానమాత్మని
విచష్టేమయిసర్వాత్మకజ్యోతిర్జ్యోతిషిసంయుతం॥

అంతటను వ్యాపించియుండు మనసునుపట్టి ఒకచోట అనగా ఇష్టదేవతయొక్క కరచరణాద్యవయవములుగలదియు, సర్వాభరణములతో నలంకృతమైనదియునగు రూపమందుంచి పఇతరవస్తువునందుగాని మనసునుపోకుండ జేయవలయు. మ నసు ఆయాకారమందు దృఢముగనిలచినప్పుడు క్రమక్రమముగ ఒ క్కొక్క అంగమును మనసునుండితొలగించుచు చివరకు చిరునవ్వు తో యుక్తమగు ముఖమునందుమాత్రముంచవలయు. మనసు అట్టి

ట్టుచలించక ఆముఖమునందే నిలచినతరువాత ఆకర్షించి హృద
యాకాశమందు ఆముఖమును నిలుపవలెను. హృదయమందుండు
ముఖమునందే మనసుకదలకనిలచినప్పుడు ఆముఖమునుకూడ స్మ
రించుటవదలి ఏదియుచింతించక మనసును మాత్రము హృదయమం
దేనిలుపవలెను. గీతయొక్క యెనిమిదవ అధ్యాయమందుదా
హరించిన "మనోహృదినిరుధ్యచ" అనువచనముయిట్లు అభ్యసిం
చుటచేత సార్థకము చెందుచున్నదిగాని ఊరక పదేపదేచదివిన
మాత్రముతో సార్థకముచెందదు. ఇవ్విధంబునబాగుగ గ్రహిం
పబడిన మనసు జ్యోతిజ్యోతితోకూడినట్లు అంతటవ్యాపించియుండు
నాయందుననన్నుధ్యానించుచున్నాడని శ్రీకృష్ణులుద్ధవునకుపదేశించి
నట్లు భాగవతము ఏకాదశస్కంధమందు చెప్పబడినది. మరి
యు అక్కడనేవారే

శ్లో॥ ధ్యానేనేద్ధంసుతీవ్రేణ యుంజతేయోగినోమనః॥

ఇట్లుధ్యానించుటచే యోగులు అతిశీఘ్రముగా మనసును
నిలుపుచున్నారని ఆయుద్ధవునకే ఉపదేశించియున్నారు. కాబట్టి
సాకారధ్యానము అందిరికిసులభము.

ముందుదాహరించిన శ్లోకమందు "నకించిదపిచింతయేత్"
అనిచెప్పబడినదిగదా. దీనిఅర్థము ఇష్టదేవతయొక్క సాకారము
ధ్యానమందు ఒక్కొక అంగముగావదలి, చివరకుముఖముమా
త్రము ధ్యానించుచు ఆముఖమును హృదయమందునిచి తరువాత
ముఖమునుకూడా వదలి యేదియుచింతించకుండు స్థితికితెచ్చుట
అనిచెప్పియుంటిమి. ఈ"నకించిదపిచింతయేత్" అనుస్థితికి వచ్చు
టే యోగముయొక్క పరమావధియని శ్రీశంకరాచార్యులవారు
గీతయొక్క యీక్రిందిశ్లోక భాష్యమునందుచెప్పియున్నారు.

శ్లో॥ శనైశ్శనైరుపరమేచ్ఛ్ బుద్ధ్యాధృతిగృహీతయా
ఆత్మసంస్థంమనఃకృత్వా నకించిదపిచింతయేత్॥

మరియుఉపనిషత్తునందుసహితము "నకించిదపిచింతయేత్"

స్థితికి రావలేనని చెప్పబడినది.

శ్లో॥ ఖమధ్యేకురుచాత్మానమాత్మమధ్యేచఖంకురు
సర్వంచఖమయంకృత్వానకించదపిచింతయ॥

"నకించిదపిచింతయ" అనుస్థితికివచ్చుట అనఁగా ఈస్థూలప్రపంచపు స్మరణపూర్తిగా వదలుటఅని అర్థము. అనగా బాహ్యదృష్టి సంపూర్ణముగవిడుచుటయని తెలియవలెను. బహిః ప్రజ్ఞవదలినదని తలంచవలెను. ఈస్థితివచ్చువరకు హృదయమందు అంతఃఆకారమును ధ్యానించుచుండినను ఆధ్యానముతనకు బయటనుండు తనకంటె నితరబాహ్యాకార ధ్యానమేకాని అంతఃనుండు నిజస్వరూపధ్యానముకాదు. మనను సర్వదా ఏదైననొక వస్తువును తలంచుచుండుట సహజముగనుక ఇతరవస్తువులను తలంచుటకుమారుగా పరమాత్మనైకొనిన ఏదైననొక ఆకారము తలంచుటకుయిచ్చి దానియందుఅదినిలిచిన తరువాత ఆయాకారమును హృదయమందునిలిచి అక్కడమనసు స్థిరముగనిలిచినవెనుక ఆయాకారమును వదలగా మనసుకు బాహ్యాలంబనపోయి హృదయమందుమాత్రము ఏదియు తలంచకుండు స్థితితటస్థించును. ఈస్థితికే "నకించిదపిచింతయేత్" స్థితిఅనిపేరు. దీనికే ప్రశాంత మనస్సనిచెప్పవచ్చును. ఇట్టిప్రశాంతమనస్సుగలవానికి ఆత్మధ్యానము ప్రాప్తమగును.

శ్లో॥ ప్రశాంతమనసంహ్యేనం యోగినంసుఖముత్తమం
ఉపైతిశాంతరజసంబ్రహ్మ భూతమకల్మషమ్॥

రజోగుణమునుశాంతపరచినట్టియు, ప్రశాంతమనస్సుగలిగినట్టియునైనయోగినికల్మషరహితమైన ఆత్మ(బ్రహ్మ) ధ్యానమునకు దొరుకుచున్నదని తాత్పర్యము. మనోవృత్తిని నాశముచేసిన స్థితియేయిది. దీనికేసంప్రజ్ఞాన సమాధియనిపేరు.

శ్లో॥ మనసోవృత్తిహీనస్య బ్రహ్మాకారతయాస్థితః
యోసంప్రజ్ఞానమానాసౌసమాధీత్యభిధీయతే॥

అని శ్రీశంకరాచార్యులవారు వ్రాసియిచ్చినారు, పరమాత్మునియందు అనన్యభక్తి కలగవలసియుంటె అనేకజన్మసహస్రములు ఇట్లు ధ్యానాముల భ్యసించి సమాధినిష్ఠను పొందవలెనని చెప్పబడినది.

శ్లో॥ జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః
నరాణాంక్షీణపాపానాం కృష్ణేభక్తిః ప్రసీదతే॥

ఈ సమాధినిష్ఠ సాకార ధ్యానముతో తప్ప వేరువిధముగ పొందుట కష్టతరము. ఆదియందు అవ్యక్తముగాని నిర్గుణమును గాని ధ్యానించుట సామాన్యజనులకు మిక్కిలికష్టముగనుకనే శ్రీకృష్ణులు అర్జునునకు భక్తియోగము బోధించునప్పుడిట్లు ఆజ్ఞయిచ్చినారు.

శ్లో॥ క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తసంజ్ఞికాం
అవ్యక్తాహిగతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥

అవ్యక్తధ్యానాసక్తుల (అగుపడనిదానిని ధ్యానించ నిశ్చయించిన వారికనుట) కష్టములధికములు. దేహముధరించిన వారు అవ్యక్తమును ధ్యానించుటచే దుఃఖమునుపొందుచున్నారని తాత్పర్యము. దీనిచేతనే మనబోటివారు ఆదియందు స్వామిరూపమును ధ్యానించవలెను.

మనమతగ్రంథములందెచ్చట చూచినను అధికారతారతమ్యము ననుసరించి ధ్యానలక్షణములు వేర్వేరుగా నియమింపబడినవిగాని ఇతరమతములలోవలె అందరికిఒకటేవిధముగ పద్ధతి లేదు. భగవంతుడంతటనున్నాడు భగవంతుడు లేనిచోటే లేదు దేవాలయములు మొదలగునవి నిర్మాణముచేయుట ద్రవ్యనష్టమేగాని దానిచే ప్రయోజనం ఏమియు లేదని కొందరువాదింతురు. అందరికి అన్నిచోట్ల భగవంతుడున్నాడనుట దృఢపడుట సాధ్యమా? ప్రహ్లాదునకు అంతటనుభగవంతుడగుపడినట్లు హిరణ్యకశ్యపునికగుపడెనా? అందరు అంతటనుభగవంతునేచూచుట సాధ్యమైతే పరస్పర తిరస్కార పురస్కారములు, నిందాస్తుతులు, ప్రియాప్రియములు, మొదలగునవి ఉండవు. అంతటను, అన్నింటి

యందును భగవంతుని చూచుట సనకాది మహానుభావులకు తప్ప సామాన్యులకు సిద్ధించదు.

శ్లో॥ యద్యద్వేద్యం వస్తుసతత్వం విషయాఖ్యం
తత్తద్బ్రహ్మైవేతి విదిత్వా తదహంచ ధ్యాయంత్యే
వంయంసనకాద్యామునయోజంతంసంసా
రధ్వాంతవినాశంహరిమీడే॥

ఏవేవిసామాన్యదృష్టికి విషయవస్తువులుగా తెలియబడు చున్నవో అవియన్నియు బ్రహ్మయని తెలిసికొని, ఆబ్రహ్మనే నేయని సనకాదిమునులు ధ్యానించుచున్నారని శ్రీశంకరాచార్యులవారు హరిమీడే స్తవమందు చెప్పియున్నారు. ఇట్లుధ్యానించువారు తరచుగాలేరు. అట్టివారుదొరుకుట కేవల దుర్లభమని భగవద్గీతయందు శ్రీకృష్ణులు అర్జునునకు బోధించియున్నారు.

శ్లో॥ బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్మాంప్రపద్యతే
వాసుదేవస్సర్వమితిసమహాత్మాసుదుర్లభః॥

మితిలేని జన్మములకనంతరము జ్ఞానవంతుడు సమస్త దృశ్యవస్తువులు వాసుదేవుడేయని నన్నుశరణు పొందుచున్నాడు. అట్టివాడు మహాత్ముడు. దుర్లభుడని తాత్పర్యము.

సమస్తము బ్రహ్మమని తెలియుటకుముందు తాను బ్రహ్మగా తెలియవలెను. తనకంటె తనకు సమీపముందుండు వస్తువేదియు లేదు. తన్ను మొదటబ్రహ్మగా తెలియనివాడు యితరవస్తువులను బ్రహ్మగా తెలియజాలడు. అనగా బ్రహ్మవేత్తగాకమునుపు ఆత్మవేత్తగావలెను. అనేక ఆవరణములతో కప్పబడిన ఆత్మ ఆకప్పులుపోయి ప్రకాశమునకువచ్చువిధము ఉద్ధవునికి దెలిపినది ఇంతకుముందే వ్రాయబడియున్నది. అదియొకవిధము. మరికొందరు యింకొకవిధముగా ధ్యానింతురు. అదేమన:—

శ్లో॥ యద్యద్వేద్యంతత్తదహంనేతి
విహాయస్వాత్మజ్యోతిఃజ్ఞానసుఖానంద

మవాప్యయస్మిన్నస్మీఆత్మవిదోయంవిమరీశంతం
సంసారధ్వాంతవినాశంహరిమీడే॥

ఏదేదిమన కెప్పుడు యింద్రియములకు గోచరమగుచున్నదో అది నేను (ఆత్మ) కాదని స్మరించకుండ విడచి జ్ఞానమయమైనదియు, ఆనందమయమైనదియు జ్యోతిర్మయమైన దానిని పొంది దానియందు నేను ఉన్నానని ఆత్మవేత్తలు బ్రహ్మను దెలియుదురని తాత్పర్యము. ఎవ్విధంబున ధ్యానించినను 'నకించిదపిచింతయేత్' స్థితికి రానిదిఆత్మను తెలియజాలరని దృఢపడుచున్నది.

శ్లో॥ అగ్నిర్దేవోద్విజాతీనాం
మునీనాంహృది దైవతం
ప్రతిమాస్వల్పబుద్ధీనాం
సర్వత్రవిదితాత్మనాం॥

బ్రాహ్మణులకు అగ్నిదైవము, మునులకుహృదయముదైవము, అల్పబుద్ధిగలవారికి ప్రతిమలు, (విగ్రహములు) దైవము, ఆత్మవేత్తలకు సర్వముదైవమని తాత్పర్యము.

బ్రాహ్మణులకు సమస్త దేవతలను తృప్తి చెందించి ఆ దేవతలద్వారా లోకమునకు వృష్ట్యాదులు కురిపించుట చేతను, మంత్రములను జపించుట చేత మహామారి, స్ఫోటకము మొదలగు సాంఘాతిక వ్యాధులనుండియు, నితరపీడలనుండియు, దేశమునకు బాధలేకుండ చేయుట చేతను లోకమునకంత హితము చేయుటయే ముఖ్యధర్మము. దేవతలకు ముఖము అగ్నియని చెప్పబడినది. అగ్నియందు వేర్వేరు దేవతలకు ఆహుతులు వేయుటద్వారా ఆయా దేవతలు తృప్తి చెందుదురు. హవనహోమముల చే వారినితృప్తి చెందించవలెను. బ్రాహ్మణులు మంత్రవేత్తలుగా నుండవలెను. హవనహోమములు మంత్రపూర్వకములుగా నుండవలెను. మంత్రముల యొక్క రహస్యమునంతయు తెలిసి యుండవలెను. వేర్వేరు దేవతలకు వేర్వేరు మంత్రములు

ఋషులచే నేర్పరుపబడినవి. వేర్వేరు మంత్రములకు వేర్వేరు ఋషులును, వేర్వేరు దేవతులును, వేర్వేరు బీజములును, వేర్వేరు కీలకములును, వేర్వేరు శక్తులును వేర్వేరు ఫలములును ఉన్నవి. ఏదేవతకు యేమంత్రముపయోగించవలెనో ఆమంత్రమే ఉపయోగించవలెగాని యితరమంత్రముపయోగించదగదు. ఈమంత్ర రహస్యములంతయు తెలిసి విధికాలక్రమముల ననుసరించి మంత్రయుక్తముగా హవనహోమాదులు చేసి లోకమున కంతయు హితముచేయుచుండిరి గనుక బ్రాహ్మణులు యితరవర్ణముల వారికంటె నెక్కువయని కొనియాడబడుచుండిరి.

శ్లో॥ జపైర్మంత్రైశ్చ హోమైశ్చ స్వాధ్యాయాధ్యయనేనచ
నావం వేదమయంకృత్వా తారయంతితరంతిచ॥

బ్రాహ్మణులు మంత్రజపముల చేతను, వేదోచ్చారణచేతను, అధ్యయనమితరులకు చెప్పుటచేతను, తాము అధ్యయనముచేయుటచేతను వేదము నేనావగా చేసికొని యితరులనుతరింపజేయుచు తామును తరింతురని మహాభారతారణ్యపర్వమందు మార్కండేయులవారు ధర్మరాజుకుపదేశించినారు.

బ్రాహ్మణులు తమపరిశుద్ధగుణముచేతను మంత్రబలముచేతను దేవతలను స్వాధీనపరచుకొని వారిగుండా లోకములకంతయు సుఖమొనర్చుచుండిరిగనుకనే వారినిభూదేవతలుగా నెంచియుండిరి.

శ్లో॥ దైవాధీనంజగత్సర్వం మంత్రాధీనంతుదైవతః
తన్మంత్రంబ్రాహ్మణాధీనం బ్రాహ్మణోమమదేవతా॥

జగత్తంతయు దైవాధీనము, దైవము మంత్రాధీనము, మంత్రము బ్రాహ్మణాధీనము గనుక బ్రాహ్మణుడే నాకు దైవమని తాత్పర్యము.

బ్రాహ్మణులు ముఖ్యముగా యజ్ఞయాగాదులుచేసి దేవతలను తృప్తిచెందించి ఆదేవతలద్వారా లోకమునకు పలుతెరంగు

ల సుఖమొనర్చించుచుండిరి. ఎందాక వారు శ్రీకృష్ణులు భగవద్గీత
యందాజ్ఞయిచ్చిన ప్రకారము దేవతలను తృప్తిచెందించి వారి
ద్వారా భూలోకమునకుతృప్తి కలుగ జేయుచుండిరో అందాక పృ
థ్వి క్షామాడంబరములతోను, సాంఘాతికములగు మహావ్యాధుల
తోను అనేకవిధముల దుఃఖములపాలుగాక యుండెను.

శ్లో॥ దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయంతు వః
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి॥

ఈప్రకారముగా అనగా యజ్ఞయాగాదుల చేత దేవతలను తృప్తిచెందించుడు, ఆదేవతలుమిమ్ములనుతృప్తి చేయుదురుగాక! ఇట్లు ఉభయులు పరస్పరతృప్తి చెంది శ్రేష్ఠమైన శ్రేయస్సును పొందుడు. యజ్ఞముచేత దేవతలు తుష్టిచెంది అభీష్టములిచ్చుచున్నారు. వారిచే అభీష్టములనుపొంది మరియు వారికెవరు యివ్వక పోవుచున్నారో వారినిదొంగలని తెలియవలెను. ఇట్లు పరస్పరమిచ్చి పుచ్చుకొనుటచే పరస్పరము మేలుపొందుచు నావల్ల యేర్పరపబడిన యీప్రవృత్తిమార్గమను చక్రమును అనువర్తించక, ఇంద్రియలోలురై యెవ్వరికి నివ్వక తామేభుజించుచున్నారో వారిజీవనము వ్యర్థజీవనమని తెలియవలెనని తాత్పర్యము.

శ్లో॥ అగ్నౌప్రాస్తాహుతిస్సమ్యక్ ఆదిత్యముపతిష్ఠతి
ఆదిత్యాజ్జాయతేవృష్టిః వృష్టేరన్నంతతఃప్రజాః॥

అగ్నియందు వేయబడిన ఆహుతులుఆదిత్యుని (సూర్యుని) సమీపమున జేరుచున్నవి. ఆదిత్యునివల్ల వానకురియుచున్నది, సువృష్టిచే భూములుపండి జనులకుసమృద్ధిగా అన్నముదొరుకుచున్నది. దానిచే ప్రజలు సుఖమునొందుచున్నారని తాత్పర్యము.

ము. ఎటుచూచినను బ్రాహ్మణులు సమస్త దేవతలను తృప్తిచెం దించుటే వారికిముఖ్యధర్మము. దేవతలు అగ్నిలోవేయబడిన ఆహుతులచే తృప్తిచెందుదురు గనుక బ్రాహ్మణులకు అగ్నిదైవ మని చెప్పబడినది.

ఇట్లు దేవతలను తృప్తిచెందించి తద్వారా లోకమునకు హితముచేయుటచేత ఈశ్వరపూజ, ధ్యానమెట్లు ప్రాప్తమగును. ఇదియితర దేవతాతృప్తిచేయుటేగాని జగదీశ్వరుని తృప్తిచెం దించునట్లు కాదని ఆక్షేపణచేయవచ్చును. బ్రాహ్మణులుతమ ధర్మముననుసరించుటచే జగదీశ్వరుడు తృప్తిచెందుచున్నాడని వి ష్ణుపురాణమందు చెప్పబడినది.

శ్లో॥ యేయజంతిపితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్సహుతాశనాన్
సర్వభూతాంతరాత్మానంవిష్ణుమేవయజంతి తే॥

ఏబ్రాహ్మణులుపితృదేవతులను అగ్నిహోత్రునిద్వారా దేవతలను యజ్ఞముచే తృప్తిచెందించుచున్నారో వారు సర్వ భూతాంతరాత్మయగు విష్ణువునే తృప్తిచెందించుచున్నారని తా త్పర్యము.

ఈకారణమునుపట్టి బ్రాహ్మణులకు అగ్నిదైవమని చెప్పబ డినది.

మునులకు హృదయము దైవమని చెప్పబడినదెం దుకన:—

మునులుబ్రాహ్మణులకంటె అధికులు. బ్రాహ్మణులు తమ కంటె నితరులైనట్టియు, తమకంటె నధికశక్తిగలిగినట్టియు, తమ కంటెనెక్కువ తేజస్సుకలిగినట్టియు వివిధదేవతలననుసరించు విధ మును, సంతుష్టిచెందించు క్రమమును, వారినుండి ప్రతిఫలము నొందు ఉపాయమును, తెలిసివాని నన్నింటిని ఆచరించి తృప్తి చెందించి దేశమునకు మేలుచేయువారుగానుండిరి. మునుల ట్లు చేయువారు కారు. మునులు కేవల మింద్రియనిగ్రహముగల

వారై దేహమును మనస్సును లోపరచుకొని ఏకాగ్రతనుపొంది, బహిర్ముఖమును వదలి, అనగా బాహ్యమందగుపడు సమస్తవిషయములందాసక్తిమాని పరిపూర్ణవిరక్తులై, అంతర్ముఖులై సర్వభూత హృదయములందుండు ఈశ్వరుని తమహృదయమందే ధ్యానించుచు శాంతులై తత్ప్రసాదమును సంపూర్ణముగపొంది పరమానందభరితులై తాముపొందినపరమానందమును లోకములకంత వ్యాపింపజేయుదురు. వీరికితరదేవతలతోడ అవశ్యముండదు. స్వయముగానే ఆత్మశక్తిని ప్రకాశమునకు తెచ్చుసమర్థతగలవారు. వీరెచ్చటనుండినను తమనిర్మల మనోబలముచేత లోకక్షేమమును గురించి తలంచినమాత్రముననే లోకమంతయుక్షేమపడును. వీరెవ్విధమున లోకక్షేమమును గురించి ఆశీర్వదించుచుండినదియునిట్లువివరింపబడినది.

శ్లో॥ స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేనమార్గేణమహీంమహీశాః
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తునిత్యం
లోకాస్సమస్తాస్సుఖినోభవంతు॥
కాలేవర్షతుపర్జన్యః పృథివీసస్యశాలినీ
దేశోఽయంక్షోభరహితోబ్రాహ్మణాస్సంతునిర్భయాః
అపుత్రాఃపుత్రిణస్సంతుపుత్రిణస్సంతుపౌత్రిణః
అధనాస్సధనాస్సంతుజీవంతుశరదాంశతమ్॥

రాజులుప్రజలను బాగుగరక్షింతురుగాత, భూమినిధర్మమార్గముగా ఏలుదురుగాత, గోవులకు బ్రాహ్మణుల కెల్లప్పుడు శుభమేకలుగుగాత, సమస్తలోకములోనుండువారందరు సుఖముపొందుదురుగాత! పర్జన్యుడు సకాలమునకు వృష్టికురుపించుగాత! పుడమిసమస్తసస్యములతో వర్ధిల్లుగాత! దేశమంతయు క్షామడాంబరములును, సాంఘాతికవ్యాధులును మొదలగు క్షోభలులేకుండుగాత! బ్రాహ్మణులు నిర్భయులుగా నుందురుగాత! పుత్రు

లులేనివారు పుత్రవంతులగుదురుగాక! పుత్రవంతులు పౌత్రులను పొందుదురుగాత! దరిద్రులుధనవంతులగుదురుగాత! సర్వజనులు నూరుసంవత్సరములు సుఖముగజీవింతురుగాత! అనిఆశీర్వదించు చుందురు. బ్రాహ్మణులుదేవతల సహాయముచే నేయేకార్యములు లోకహితార్థమై చేయుచుండిరో ఆయాకార్యములు మునులు స్వకీయతేజోశక్తిచే చేయుచుందురు గనుక మునులకు హృదయము దైవమని చెప్పబడినది.

అల్పబుద్ధిగల సామాన్యజనులకు ప్రతిమలేదైవమని చెప్పబడినదెందుకనః—

వీరికి బ్రాహ్మణులవలె సాత్విక మితాహారములచేతను, స్నానసంధ్యాజప హోమములచేతను, అనేక తీవ్రవ్రత నిష్ఠలచేతను, నియమానుష్ఠానముచేతను, దేవతలను తృప్తిచెందించు విధిననుసరించుటకుగాని, మునులవలె దేహమును, యింద్రియములను, మనస్సును స్వాధీనమునకు దెచ్చికొని, అంతర్ముఖులై హృదయమందు ధ్యానము చేయుటకు శక్తిలేనివారుగానుందురు. వీరికిని తరుణోపాయముండవలెనుగనుక ఈయింద్రియములకే గోచరమగునట్టి భగవదవతారముల రూపముల విగ్రహములను (ప్రతిమలను) శాస్త్రోక్తముగ కల్పించి వానిని ఆలయములలో గొప్ప తపోనిష్ఠగలవారిచేత ప్రతిష్ఠింపజేసి అర్చనాదులు చేయని శ్రీంచెదరు.

శ్లో॥ స్థాపకస్యతపోయోగాత్ పూజాయాశ్చాతిశాయనాత్
ఆభిరూపాచ్చబింబస్య సదాసన్నిహితో హ్యహం

విగ్రహమును ప్రతిష్ఠచేసిన వారియొక్క తపోబలముచేతను, భక్తులపూజాతిశయములచేతను, బింబముయొక్క సౌందర్యలావణ్యముచేతను నేను ఆబింబమున సదాప్రకాశించుచుందునని స్వామిచెప్పియున్నాడుగనుక కేవలతపోనిష్ఠులు ప్రతిష్ఠచేసిన దేవాలయములలో నంతయు జనులు ప్రవేశించినపుడు వినయభ

యభక్తులు కలుగుచున్నవి. మరియు ఆవిగ్రహములవలన భక్తుల అభీష్టములు నెరవేరుచున్నవి. విగ్రహములను తులసి బిల్వాదులతో అర్చనచేయుటవల్ల గలుగు ఫలములింతకుముందే వ్రాయబడినది.

పరమేశ్వరుడొక్కడైనను జనులయొక్క అభిరుచి భేదములనుపట్టియు, మత భేదములనుపట్టియు, గలుగు ఆకర్షణ విశేషములననుసరించి నానారూప నామక్రియలు దేవతలందారోపణచేసి అనేక దేవతలకు వేర్వేరు దేవాలయములు కట్టియుంచుట అందరికి విశదమైయున్నది. కొందరు శివభక్తులు, కొందరు విష్ణుభక్తులు, విష్ణుభక్తులలోకొందరు రామభక్తులు, కొందరు కృష్ణభక్తులు, కొందరునృసింహము మొదలగుదశావతారములలో వేర్వేరు అవతారమూర్తులభక్తులు, శివభక్తులలో సుబ్రహ్మణ్యనటరాజాదుల భక్తులు, హనుమ విఘ్నేశ మొదలగు దేవతలభక్తులనేకములుగా నుండుట అందరికి తెలిసినవిషయమే. ఇక్కడ భక్తులనగా పైచెప్పబడిన నామరూపములుగల దేవతలనర్చించి సేవచేయువారని అర్థముచేయవలెనుగాని ఏకభక్తి అనన్యభక్తికలవారని అర్థముచేయదగదు. ఎవరెవరికి యేయేదేవతలమీద ప్రీతివిశేషముగా నుండునో వారివారికి ఆదేవతలమూలముగా శ్రేయస్సు ప్రాప్తమగుచున్నదిగనుక మతభేదములుగల వారందరికిని ఉపయోగముగ నుండుటకై వేర్వేరు దేవతలకు ఆలయములు నిర్మించియున్నారు.

ఎవరు ఏవిధమున ఏదేవతను కొలిచినను అన్నికొలువులును పరమేశ్వరునే చేరుచున్నవనుటకు సంశయములేదు.

శ్లో॥ ఆకాశాత్పతితంతోయం యథాగచ్ఛతిసాగరం
సర్వదేవనమస్కారః కేశవంప్రతిగచ్ఛతి
యథాతోయప్రవాహానాం సముద్రపరమావధిః
తథైవసర్వమార్గాణాం సాక్షాన్నిష్ఠామహేశ్వరః॥

ఆకాశమునుండి నీళ్లుయేప్రదేశమున పడినను, ఏముఖమున పారినను ఎట్లుసముద్రమునే ప్రవేశించుచున్నదో అట్లనేయెవరేదేవతారూపమును కొల్చినను కేశవునే ప్రవేశించుచున్నది. సమస్తనదులకు సముద్రమెట్లు పరమగతియో అట్లనే వివిధపూజామార్గములు మహేశ్వరుని నిక్షేపయని తాత్పర్యము.

మనశాస్త్రములిట్లు సమస్తభిన్నభిన్న పూజావిధులు, వేర్వేరు రూపనామములద్వారా అర్చించు అర్చనలును ధ్యానములును ప్రత్యేకమార్గములుగాపరమేశ్వరునేచేరి పరమేశ్వరుడు ప్రీతిజెంది అభీష్టములిచ్చుచున్నాడని చెప్పియుండగా జనులలో కొందరు విష్ణుభక్తులనియు, కొందరు శివభక్తులనియు,మరికొందరు యితరదేవతా భక్తులనుకొనుచు పరస్పరద్వేషముకలుగజేసికొని ఒకరినొకరు నిందించుకొనుటతో తృప్తిచెందక వేర్వేరు వారు కొలుచు దేవతలమీదవినరాని, చెప్పరాని, తలంచరాని దోషములారోపించి దూషించుచునుందురు. ఇంతటితోతృప్తిచెందక ప్రాపంచిక విషయములందుకూడ పరస్పరక్రోధము పెంచుటచే కష్టనష్టములుకలుగచేయుచు తాముదుఃఖములపాలై యితరులకు దుఃఖము కలుగజేయుదురు. ఇంతియెగాక ఒకదేవుని కొల్చుటయందే వేరువిధము లనుసరించుటచే పరస్పర వైరముకలిగి అనర్థములు కలుగజేతురు. వైష్ణవులలోనే తెంగలవడగల వైరముచే గలుగు అనర్థములకు పారమున్నదా? ఏవిధమున తాము నామములుధరించిన నేమి? విగ్రహములకు ఏనామముపెట్టిన నేమి? ప్రబంధముపారాయణముచేసిన నేమి, వేదపారాయణము చేసిననేమి? పీఠనామములు, పీఠములులేని నామములుపెట్టుటను గురించియు, ప్రబంధవేదపారాయణములనుగురించియు అనర్థకలహములు పెట్టుకొని ఒకరినొకరుదూషించుకొనుచు చేతులతోను కఱ్ఱలతోనుపోట్లాడుచు పరస్పరముగాయములు కలుగచేసికొని పోలీసువారివల్ల పట్టుపడి కొన్నిసమయములందు చెరసాలసహా

చేరుదురు. సివిల్ కోర్టులలో జరుగువ్యవహారమునకు పారమే లేదు. ఇట్లుతమక్రోధమును తృప్తిచెందించుటకుగాను దేవాలయములకు బీగములువేసి విగ్రహాదులకు దినముజరగవలసిన పూజలకును, ఉత్సవములకును, నివేదనలకును మట్టిగొట్టి దూరమునుండి విశేషముగ ధనవ్యయముచేసికొని ప్రయాణకష్టములనుభవించి దేవునిసేవించవలెనని వచ్చిన భక్తుల అభీష్టములన్నియు నేటిపాలుచేయుదురు. వీరికి తమక్రోధములు తీర్చుకొనుటయందు ప్రీతియున్నట్లు దేవాలయములందుగాని, దేవునియందుగాని యున్నదాని జనులందైనను కరుణయున్నదాని పదియులేదు. ఇట్లుద్వేషములుపెంచి క్రోధముతోనిండినవారికి భక్తియుండుననుట సర్వాబద్ధము. ఇట్టివారిని దేవాలయములలో పూజలుసేయుటకు నియమించుటయెంతమట్టుకు సరికాదు. వీరియొక్క మనస్సు ఎల్లప్పుడు ద్వేషక్రోధములతోనిండి ఉప్పొంగుచుండును గనుక వీరిదుస్సంకల్పంబులును, ఒకరినొకరిని నాశముచేయుటకు వెతకు దురాలోచనలును, దుర్భాషలును, దుర్వ్యాపారములును వీరుండు ఊరివారి మనస్సునంతయు చెరచి తమదారికే త్రిప్పును. వీరిచుట్టువ్యాపించియుండు ఆకాశమందు సంచరించు గాలిఅంతయు ద్వేషక్రోధభావములతోనిండి అందరియందును ప్రవేశించి వారికిని క్రోధద్వేషములు వృద్ధిచేసి నరకప్రవేశము చేయించును. అదెట్లన:—

శ్లో॥ అసతాందర్శనాత్ స్పర్శాత్సం జల్పాశ్చసహాసనాత్
ధర్మాచారాః ప్రహీయంతే సిధ్యంతిచనమానవాః

దుష్టులనుచూచుటచేతను, స్పృశించుటచేతను, వారితోమాటలాడుటచేతను, తోడగూర్చుండుటచేతను ధర్మాచారములు నాశమొందుచున్నవి. వీరిసమీపమునందుండు మానవులు సిద్ధిచెందరు.

ఇప్పుడు కాంచీపురమునకుపోదుమేని పైనవ్రాసినదంతయు అనుభవమునకువచ్చును. శ్రీరంగము, కంచి, తిరుపతి, చిదంబరము,

రామేశ్వరము, మొదలగు దివ్యస్థలములని పిలువబడు గ్రామముల లోనుండు వారందరు ఈవిషయము బాగుగ యోచించి ఇట్టికల హకారణములను సమూలమునాశముచేసి ఏఉద్దేశముచే పరమప విత్రములైన దేవాలయములు మహానుభావులును, తపోనిష్ఠులును సర్వభూతదయాపరులును అయిన మునులు పరోపకారమునకు నిర్మించిరో ఆయుద్దేశమును నెరవేర్చుటకై సమస్తప్రయత్నములు నుచేసి కృతార్థులుకావలెను. అటుచేయక వారుకలహము లాడినమనకేమని ఉపేక్షభావముతో నుంటిమేని జగత్తుకు అప కారముచేసినదోషమునకు పాత్రులమగుదుమనుటకు సంశయము లేదు. ఇది సమష్టికర్మలో(National Karma)చేరును. ప్రతి మనిషి వ్యష్టికర్మను వేరుగ అనుభవించును. ఇదిఅట్టిది కాదు. ఇదిగొప్పసంఘమునకు బాధచేయును గనుక ఈఫలమునకు అంద రు పాత్రులగుదురు గనుక జాగ్రతపడవలెను.

శివభక్తులును, విష్ణుభక్తులును పరస్పరము ద్వేషించుటకు కారణము మూఢత్వమును మూర్ఖత్వమును తప్పవేరేదియు నగుపడదు. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు, పరమేశ్వరునియొక్క మూడు భాగములు. ఒకపరమేశ్వరుడే తానువ్యక్తపరచు సృష్టి స్థితి ఉపసంహార కార్యములనుబట్టి మూడుభాగములు(Aspects) గా పరిణమించినాడు. ఏభాగము లోపమైనను బ్రహ్మాండముత్ప త్తికాజాలదు. సమస్తము ఈమూటినుండే కలిగినది. ఈ మూడును ఆయొకటినుండివ్యక్తమైనవి. బ్రహ్మచిత్, విష్ణుసత్, మహేశ్వరుడు ఆనందము. సచ్చిదానందములును, రజస్సత్వత మోగుణములును లేని బ్రహ్మాండమేలేదు. సచ్చిదానందములును సత్వరజస్తమోగుణంబులును ఎప్పటికిని చేరియుండునుగాని విడి విడిగానుండవు. సచ్చిదానందములు పురుషలక్షణములు, సత్వ రజస్తమములు ప్రకృతిలక్షణములు, ప్రకృతి పురుషులులేక బ్రహ్మాండమే యుండదు. ఈ రెండును అనాదులే.

శ్లో॥ ప్రకృతింపురుషం చైవవిద్ధ్యనాదీఉభావపి॥
(భగవద్గీత అధ్యాయము 13, శ్లో 20.

శ్లో॥ యఏవం వేత్తిపురుషంప్రకృతించగుణైస్సహ
సర్వథావర్తమానోపినసభూయోఽభిజాయతే॥

ఎవడు గుణములతోగూడ పురుషుని, ప్రకృతిని తెలియుచున్నాడో వాడుమరలపుట్టడని తాత్పర్యము. అనగాముక్తుడగును.

వీనిలో ఏదిగాని విడిగానుండదని యింతకుముందే చెప్పబడినది. ఈశ్వరుడు సత్తుగా పరిణమించినపుడు బ్రహ్మయగును, బ్రహ్మకు సత్ స్వభావము అధికముగాను, చిత్, ఆనందములు తక్కువగానుండును. అనగా బ్రహ్మకు క్రియాశక్తి అధికముగాను, యిచ్ఛాజ్ఞానశక్తులు తక్కువగానుండును. ఈశ్వరుడు చిత్తుగాపరిణమించినపుడు విష్ణువగును, ఇక్కడ చిచ్ఛక్తివిశేషముగాను, సదానందశక్తులు తక్కువగానుండును. అనగా విష్ణువుకుజ్ఞానశక్తిఅధికముగాను క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి తక్కువగానుండును. ఈశ్వరుడు ఆనందముగా పరిణమించినపుడు మహాదేవుడగును. ఇక్కడ ఆనందమధికముగాను, సత్ చిత్తులు తక్కువగానుండును. అనగా మహాదేవునికి యిచ్ఛాశక్తి విశేషముగాను, జ్ఞానక్రియాశక్తులు తక్కువగానుండును. దీనిచేతనే బ్రహ్మకు రజోగుణ మధికముగను, విష్ణువుకు సత్వగుణమెక్కువగను, మహాదేవునికి తమోగుణమతిశయముగనుండునని చెప్పుదురు. ఈకారణమునుబట్టి ఈశ్వరుని సంపూర్తిగ తెలియవిచ్ఛయించినవారు ఆయీశ్వరునియొక్క మూడుభాగములును తెలిసియుండవలెను. ఈత్రిమూర్తులును పరస్పరము అత్యంత అన్యోన్యము గలిగి బ్రహ్మాండముయొక్క ఉత్పత్తి స్థితి ఉపసంహారముల కార్యములు జరుపుదురు. వీరిలో నెవరిని ద్వేషించినను అందరిని ద్వేషించినట్లగును. అట్టిద్వేషబుద్ధిగలిగి వారిలోనెవరిని పూజించినను ఎవరును ప్రీతిచెందరుగనుక అట్టిద్వేషబుద్ధి పూర్తిగావిడు

వవలెను. ఇదియునుగాక శివుడెక్కువ విష్ణువెక్కువ అనేడు దుర్వాదములను మానవలెను. ఈవిషయమై శాస్త్రములేమి చెప్పునది విచారింతము.

యజుర్వేదసంబంధమైన రుద్రహృదయోపనిషత్తునందిట్లు చెప్పబడినది:—

శ్లో॥ యేనమస్యంతిగోవిందం తేనమస్యంతిశంకరం
యేఽర్చయంతిహరింభక్త్యా తేఽర్చయంతివృషధ్వజం
యేద్విషంతివిరూపాక్షం తేద్విషంతిజనార్దనం
యేరుద్రంనాభిజానంతి తేనజానంతికేశవం
రుద్రాత్ప్రవర్తతేబీజం బీజయోనిర్జనార్దనః॥

ఎవరు గోవిందునినమస్కరించుచున్నారో వారుశంకరుని సహానమస్కరించుచున్నారు. ఎవరు హరినిభక్తిచేతపూజించు చున్నారో వారుసాంబశివునిపూజించుచున్నారు. ఎవరు శివుని ద్వేషించుచున్నారో వారు విష్ణువును ద్వేషించుచున్నారు. ఎవరు రుద్రునియెరుగరో వారు జనార్దను నెరుగరు. రుద్రు నుండి బీజమువచ్చుచున్నది. ఆబీజమునకు యోనిజనార్దనుడని తాత్పర్యము.

ఈయుపనిషత్తుయొక్క ముఖ్యాభిప్రాయమేమన:-శివకేశవులలో నెవరిని భక్తితోపూజించినను ఉభయులుతృప్తి చెందుచున్నారనియు, ఒకరిని ద్వేషించి ఇంకొకరిని ఎంతభక్తితో పూజించినను ఎవరును తృప్తిచెందరు. ఈయర్థమును శివునిగాని విష్ణువునుగాని ద్వేషించుచు, ఉభయులలో నెవరినిగాని అర్చించువారు బాగుగగ్రహించవలెను. త్రిమూర్తులు ఒకటియని యెంచక మూఢత్వముచేత వేరనితలంచుచు ఒకరికంటె నొకరు అధికమని వాదించుచు మేముశివభక్తులమని విష్ణువును తిరస్కరించుచు, మేమువిష్ణుభక్తులమనిశివునినిందించుచు, భస్మము ఒంటినిండ బూసికొని మెడలిరుగ రుద్రాక్షులనుధరించినవారును, ఒంటినిం

నామములు పెట్టుకొని, మోయుటకు మీరినన్ని తులసి, తామరమాలలుధరించిన వారును, భక్తులు కారని మాటికిమున్మాటికిదృఢముగా చాటిచెప్పవచ్చును.

మఱియు అదేయుపనిషత్తునందే త్రిమూర్తులనెట్లు వర్ణించినదో విచారింతము.

శ్లో॥ అస్యత్రైలోక్యవృక్షస్య భూమావిటపశాఖినః
అగ్రంమధ్యంతథామూలం విష్ణుబ్రహ్మామహేశ్వరాః
కార్యంవిష్ణుఃక్రియాబ్రహ్మా కారణంతుమహేశ్వరః
ప్రయోజనార్థంరుద్రేణ మూర్తిరేకాత్రిధాస్థితా॥

త్రిలోకమనువృక్షమునకు విష్ణువుఅగ్రము (కొన); బ్రహ్మ మధ్యము (మొదలు); మహేశ్వరుడు మూలము (వేరు). ప్రయోజనమునకై ఒకరుద్రుడే బ్రహ్మవిష్ణుమహేశ్వరులను కారణ క్రియా కార్యములుగా ప్రవర్తించియున్నారు. కారణము మహేశ్వరుడు, క్రియ బ్రహ్మ, కార్యము విష్ణువని తాత్పర్యము.

ఏవృక్షముగాని వేరు, మొదలు,కొనలుండినగాని సంపూర్ణముగనుండదు. వేరునంటి మొదలుండును మొదలునంటికొనలుండును. ఈమూడును ఒకటి నొకటి చేరియుండినగాని వృక్షమనబడదు. మూడునుచేరి పరిణమించునదేవృక్షము. అయితేభూమిలోని భాగమునకు వేరనియు, మధ్యభాగమునకు మొదలనియు, పైభాగమునకు శాఖలనియు పేర్లుగలవుగదా? వృక్షముయొక్క మూడుభాగములు భిన్ననామములతో పిలువబడుచు వేర్వేరువిధములుగ ఉపయోగపడుచుండును. వేర్లుభూమిలోనున్న నీళ్లనుపీల్చి మొదలుగుండా శాఖములకు వ్యాపింపజేయును. మొదలు శాఖముల నన్నింటిని మోసియుండుటేగాక మూలములకు శాఖలకు మధ్యనుండి సంబంధముకలుగజేయునది గానుండును. శాఖము లీరెంటిసహాయముచేత అందరికినీడను, పుష్పములను, ఫలములనుయిచ్చుచు అందరికి ఆనందము కలు

గ జేయుచుండును. ఇవ్విధమున నే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పరమేశ్వరుని యొక్క భావములై వేర్వేరు నామముల చేపిలువబడు చు వేర్వేరువిధంబులగు పనులు సేయుచు బ్రహ్మాండమునంతయు ఉత్పత్తిచేసి రక్షించుచుందురు. కారణమే క్రియద్వారా కార్యమగును. కారణమును కార్యముగా చేయునది క్రియ. కారణకార్యములకు మధ్యక్రియయుండును. కారణక్రియలు లేనిది కార్యము కాజాలదు. చివరకుచూడు నొకటే. ఈ కారణ మునుపట్టి విష్ణువునుకొల్చినను, శివునికొలిచినను, బ్రహ్మనుకొలిచి నను, పరమేశ్వరుడు తృప్తిచెందుననుటకు సంశయములేదు. వీ రిలోనెవరిని ద్వేషించినను పరమేశ్వరుని ద్వేషించినట్లగును గ నుక భక్తినపేక్షించువారు ద్వేషబుద్ధిని నిర్మూలముగ నాశముచే యవలెను.

పైనుదాహరించిన ఉపనిషత్తు రుద్రహృదయోపనిషత్తుగనుక ఇది అద్వైతపరమని కొందరంగీకరించకుండవచ్చును. శివుడు కేశవుని కేశవుడుశివుని ఒకరినొకరు ఎట్లుస్తుతించినది తెలిసెనేని ఉభయపక్షముల వారికి వైషమ్యభావము పోవుననితలంచి ఆవిష యము సంక్షేపముగ విశదపరచెద.

శ్రీమహాభారతము అనుశాసనీకపర్వము ౧౪౭ అధ్యాయ మందు ఋషులుమహాదేవుని వాసుదేవమాహాత్మ్యమునుచెప్పుమని అడుగగా మహాదేవుడిట్లు చెప్పదొడగె.

శ్లో॥ ఋషయః. పినాకిన్భగనేత్రఘ్న సర్వలోక
నమస్కృత। మాహాత్మ్యంవాసుదేవస్య శ్రోతు
మిచ్ఛామి శంకర॥

అనిఋషులడుగగా మహాదేవుడు 64 శ్లోకములతో వాసు దేవుని స్తుతించుచున్నాడు. వానిలోకొన్నిమాత్రము వ్రాసెద:—

శ్లో॥ మహావరాహంతం దేవం సర్వలోకపితామహం
అహంచైవనమస్యామి నిత్యమేవజగత్పతిమ్॥

బ్రహ్మోతస్యోదరభవ స్తథాచాహంశిరోభవః
శిరోరురుహేభ్యోజ్యోతీంషిరోమభ్యశ్చసురాసురాః॥

జగత్పతియైన మహావరాహమూర్తియైన విష్ణువును నేనెల్లప్పుడును నమస్కరించుచున్నాను, బ్రహ్మఆయనయుదరమునుండియు, నేను ఆయనశిరస్సునుండియు, సమస్తమైన జ్యోతులుఆయన తలవెంట్రుకలనుండియు, దేవతలందరు ఆయనశరీరరోమములనుండియు, పుట్టితిమని అనేకవిధముల మహాదేవుడు వాసుదేవుని వర్ణించెను.

అదేఅనుశాసనికపర్వము 14 అధ్యాయమందు ధర్మరాజు భీష్మాచార్యులను శివనామమాహాత్మ్యమును చెప్పుమని అడుగగా భీష్మాచార్యుల వారిట్లుత్తరమిచ్చిరి.

శ్లో॥ నశక్తోహంగుణాన్వక్తుం మహాదేవస్యధీమతః
యోహిసర్వగతోదేవోనచ సర్వత్రదృశ్యతె
కోహిశక్తోభవంజ్ఞాతుం మద్విధఃపరమేశ్వరం
ఋతేనారాయణాత్పుత్ర శంఖచక్రగదాధరాత్॥
సురాసురగురోదేవవిష్ణుత్వంవక్తుమర్హసి
శివాయవిష్ణురూపాయ యదపృచ్ఛద్యుధిష్ఠిరః

అన్నింటియందు వ్యాపించియుండియు యెచ్చటనుఅగుపడనట్టి ధీమంతుండగుమహాదేవుని గుణములనుచెప్పుటకు నాకుశక్తిలేదు ఆపరమేశ్వరుని తెలియుటకు శంఖచక్రగదాధారియగు నారాయణుడుతప్ప నావంటివానికెవనికి శక్యమగునని భీష్మాచార్యులవారు చెప్పుచు ఆనారాయణునే శివమాహాత్మ్యము చెప్పుమని యిట్లువిన్నవించిరి. సురాసురులకు గురువును దైవమును అయిన ఓవిష్ణో యుధిష్ఠిరుడడుగు శివునియొక్కగుణములు నీవుచెప్పుటకు అర్హుడవు గనుక సెలవియ్యవలెనని భీష్ములవారునారాయణునడుగగా నారాయణుడిట్లు చెప్పదొడగె.

శ్లో॥ నగతిఃకర్మణాంశక్యా వేత్తుమీశస్యతత్వతః

హిరణ్యగర్భ ప్రముఖా దేవా స్సేంద్రామహర్షయః
నవిదుర్యస్యభవన మాదిత్యాస్సూక్ష్మదర్శనః
సకథంనరమాత్రేణ శక్యోజ్ఞాతుంసతాంగతిః
తస్యాహమసురఘ్నస్య కాంశ్చిద్భగవతోగుణాన్
భవతాంకీర్తయిష్యామి వ్రతేశాయయథాతథమ్॥

ఈశ్వరునికర్మగతియొక్క యథార్థమును తెలియుటకు బ్రహ్మమొదలైన దేవతలు ఇంద్రుడు, ఋషులు, శక్తులుకారు. ఆదిత్యాదిసూక్ష్మదర్శనులును ఆదేవునిభవనమును తెలియజాలరు. ఇట్లుండమానవమాత్రులు ఆసత్పురుషులకు గతియైన మహాదేవుని యెట్లు తెలియగలరు? వ్రతములకంతయు ఈశ్వరుడైన అసురఘాతకుడైన ఆభగవంతునిగుణములను కొన్నిమాత్రమున్నట్లు నీకుగాను చెప్పుచున్నానని వాసుదేవుడు యుధిష్ఠిరునికి తెలిపి నాలుగైదువందల శ్లోకములతో మహాదేవునిమాహాత్మ్యమును పొగడినట్లు అనుశాసనికపర్వమందుదాహరింపఁబడినది.

హరిహరులిట్లు ఒకరినొకరు అద్భుతముగ స్తుతించుచుఒకరినొకరు పూజించుచు, నమస్కరించుచుండ వారిభక్తులమని చెప్పుకొనువారు ఒకరినొకరు ద్వేషించుచు, తిరస్కరించుచు నిందించుచుండుట యేధర్మమో, యేకర్మమో, యేన్యాయమో, తెలియకున్నది.

భక్తవత్సలుండగు శ్రీకృష్ణుడు తనప్రియశిష్యుండైన అర్జునునికిఎట్టిభక్తుడుతనకుప్రియుడనిఉపదేశించియుండుటవిచారింతము.

శ్లో॥ అద్వేష్టాసర్వభూతానాం మైత్రఃకరుణఏవచ
నిర్మమోనిరహంకార స్సమదుఃఖసుఖఃక్షమీ
సంతుష్టస్సతతంయోగీ యతాత్మాదృఢనిశ్చయః
మయ్యర్పితమనోబుద్ధి ర్యోమద్భక్తస్సమేప్రియః

సమస్తభూతములందు ద్వేషభావములేకుండుటేగాక మిత్రభావమును కరుణయుగలిగి మమకార అహంకారములు విడిచి

సుఖదుఃఖములందు సముడై అనగా సుఖముకలిగినప్పుడుప్పొంగక దుఃఖముకలిగినపుడు ఖిన్నుడుగాక పరులు అపకారముచేసిన ను ప్రత్యపకారముచేయక మన్నించుచు సర్వదా సంతోషముచెంది నాయందేమనస్సును బుద్ధిని సమర్పించినయోగియెవడో వాడు నాకు భక్తుడు నాకుప్రియుడని శ్రీకృష్ణులు అర్జునునికి హితము బోధించిరని గీత 12 అధ్యాయమందు చెప్పబడినది. గనుక ద్వేషభావముబొత్తిగా మానవలెను. సమస్తభూతములందును ఈశ్వరుడు హృదయమందుండుటనుబట్టి యేభూతమును ద్వేషించినను ఈశ్వరునే ద్వేషించినట్లగుననుటకు సంశయములేదు.

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి॥

అనిగీతాప్రమాణము. కనుకనే భగవంతుడు అన్నిభూతములందుండు తన్ను ద్వేషించి ప్రతిమాదులను అర్చించుట వ్యర్థమని సెలవిచ్చినారు.

శ్లో॥ యోమాంసర్వేషుభూతేషు బహిరంతరపావృతం
హిత్వాఽర్చాంభజతేమౌఢ్యాత్ భస్మన్యే
వజుహోతిసః॥

సమస్తభూతములందు లోపలను వెలుపలను వ్యాపించియుండు నన్ను తిరస్కరించి మూఢత్వముచేత విగ్రహాదులను ఎవడుఅర్చించుచున్నాడో వానిఅర్చన బూదిలో హోమముచేసినట్లని శ్రీకృష్ణు లుద్ధవున కుపదేశించియున్నారు. సమస్తభూతములందు ద్వేషభావము వదలి యూరకుండకూడదు. బహుమంది ఎవరెట్లుపోతేమనకేమి మనంతట మనమూరకుండుదమని పరులకేమియుచేయక ఊరకుందురు. అదిభక్తిలక్షణముకాదు. భక్తిగోరువారు సమస్తభూతములందు మిత్రభావమును కరుణాభావమును కలిగియుండవలెను.

శ్లో॥ కింమిత్రం యన్నివారయతిపాపాత్॥

మిత్రమనపాపములనుండి తొలగజేయుటయని శ్రీశంకరా

చార్యులవారు ప్రశ్నోత్తరరత్నమాలయం దుదాహరించినారు. భక్తులు సర్వదా తాము పాపకార్యములు సేయుటమాని యితరులను పాపకార్యములందు ప్రవేశించకుండుటకు యెడతెగని ప్రయత్నములు సేయుచుండవలెను. అనగా తాను తరించి యితరులను తరింపజేయుటే వారికి ముఖ్యధర్మమనియెంచి యుండవలెను. అదెట్లన; యల్లయ్య మల్లయ్యయని యద్దరు స్నేహితులుగలరు. వీరిలోయల్లయ్యఅనువానికి కల్లుత్రాగుమర్నడతకలదు. యల్లయ్య తన స్నేహితుడగుమల్లయ్యను తానుత్రాగుటకుడబ్బులేదు సహాయముచేయమని అడుగగా మల్లయ్య అయ్యోనా స్నేహితుడే వీనికి సహాయముచేయుటేధర్మమని యల్లయ్యకు డబ్బుయిచ్చినట్లైన మల్లయ్య యల్లయ్యకు మిత్రుడుకాజాలడు. అట్లడిగినపుడు డబ్బుయివ్వక నాయనా! నీవుచేయుపని మిగులచెడ్డదని చెప్పుచు అనేకవిధముల వానికి సద్బోధచేసి ఆమరభ్యాసమునుండి యల్లయ్యనుతొలగించి సన్మార్గప్రవర్తనలో ప్రవేశపెట్టినట్లైన మల్లయ్య యల్లయ్యకు మిత్రుడగును. ఇట్లుభక్తులుసర్వదా జనులపాపములను నివారించుపనులు సేయవలెను. అనగా తాము పుణ్యకార్యములు సేయుచు యితరులనుపుణ్యకార్యములు సేయునట్లు ప్రోత్సాహపరచవలెను. పుణ్యపాపములెట్లుగుర్తించవలెననిన?

శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తంగ్రంథకోటిభిః
పరోపకారఃపుణ్యాయ పాపాయ పరపీడనం॥

కోటిగ్రంథములలో చెప్పినదంతయు అర్థశ్లోకములో చెప్పుచున్నాను. అదేదనిన పరోపకారము చేయుటపుణ్యము, పరులకు పీడకలుగుజేయుటపాపము.

భక్తులగువారు సమయము పొసగినపుడంతయు ఉపకారముసేయుదురు. పరోపకారమునకంటె గొప్పకార్యములేదు.

శ్లో॥ పరోపకృతి కైవల్యేతులయిత్వాజగద్గురుః
గుర్వీంచోపకృతింమత్వా అవతారాన్దశాగ్రహీత్॥

జగద్గురువగు విష్ణువు పరోపకారమును, కైవల్యమును త్రాసునందు తూచగా కైవల్యముకంటె పరోపకారము ఎక్కువైనందున పరోపకారమునకై కైవల్యము విడిచి దశావతారములను గ్రహించెనని తాత్పర్యము.

భగవంతుని అభిప్రాయము పరోపకారమునకంటె నెక్కువైనదేదియు లేదనియుండుటనుపట్టియే పరోపకారమే భక్తులు భగవత్పూజగ భావించినారు.

శ్లో॥ ఏన కేన ప్రకారేణ పరస్యపురుషస్యతు
సంతోషం జనయేత్ప్రాజ్ఞః తదేవేశ్వరపూజనం॥

ఏవిధముననైనను పరులకు సంతోషము కలుగజేయుటే ప్రాజ్ఞులకు ఈశ్వరపూజయని తాత్పర్యము.

భక్తులందరు భగవత్పాదపూజ చేయవలెనని అపేక్షించుచుందురు. భగవంతునిపాదమెట్లు దొరకును? భగవంతుడు దొరికినంగదా భగవంతునిపాదములు దొరకును. మనకు ప్రకృతమందుండు యింద్రియమనోబుద్ధులకు గోచరుడుకాడని యింతకుముందనేకచోట్ల చెప్పబడినది. ఇట్లుండ ఆయనపాదమెట్లు పూజించనగును? మనయింద్రియ మనోబుద్ధుల కగుపడు పాదమును మొదటపూజించవలసినది ముఖ్యము. ఈపూజ ద్వారా సర్వవ్యాపకుడైన ఈశ్వరపూజచేయు శక్తిసంపాదించవలెను. అందరికిఅగుపడు ఈశ్వరుని పాదమేదన?

"పాదోస్యవిశ్వాభూతాని" ఆయీశ్వరునిపాదమువిశ్వమును అందులోనుండు భూతములని తాత్పర్యము. ఇదిమనకగుపడు ఈశ్వరునిపాదము. ఈపాదపూజద్వారా జనులు ధన్యులగుదురు. కనుక భక్తినపేక్షించువారు లోకమందుండు యేభూతమునుగాని హింసించక దయతోచూడవలెను.

సమస్తభూతములకు హితముసేయుటే తనపూజయని జగదీశ్వరుడగు వాసుదేవుడు రుక్మిణీదేవికిబోధించినట్లు నారదసూ

త్రములందు చెప్పబడినది. రుక్మిణీదేవి వాసుదేవుని పపూజ చే నీవుతృప్తి చెందుదువని అడుగగా వాసుదేవుడిట్లుత్తరమిచ్చెను.

శ్లో॥ సేవనం సర్వభూతానాం పూజనంచ మహాత్మనాం
కార్యం స్వాభావికం మత్వా కర్మసంధారణం కురు;
ఇదమేవాస్తి మత్పూజా ఇదమేవ పరంతపః
ఇదమేవ పరం జ్ఞానం భక్తియజ్ఞమిదం సదా॥

సమస్తభూతములకు హితమొనరించుటయు, తనకంటెగొప్పవారగుపడినప్పుడు పూజించుటయు ఈ రెండును స్వభావముగా నేర్పడునట్లభ్యసించి నిరంతరమట్టి కర్మ చేయుచుండవలయు. ఇదే నాకుపూజయొనరించుట, ఇదే శ్రేష్ఠమైనతపస్సు, ఇదే ఉత్తమమైనజ్ఞానము, ఇదేనన్ను గురించిన భక్తియజ్ఞమని వాసుదేవుడు రుక్మిణీదేవి కుపదేశించెనని తాత్పర్యము. సమస్తభూతములందు హితమును, పెద్దలయందు వినయభక్తులును యెట్లు అభ్యసించవలెననగా? నస్యముగాని చుట్టగాని అలవాటులేనివాడు మొట్టమొదట వాటినిస్వీకరించినపుడు ఘాటుగాను, అసహ్యముగానుండి హితముగాకుండినను అభ్యాసము చేయుటచే రాను రాను క్రమముగానెట్లు హితముగాతోచునో, అవిదొరకనపుడు యెప్పుడెప్పుడు దొరుకునాయని మనస్సువాటిపైననే యెట్లుపోవుచుండునో, అట్లనే ఆదియందు భూతహితమును, పెద్దలపూజయు చేయుటకు మనసొప్పకపోయినను, జీవజంతువులకు నప్పుడంతయు హింసచేయకుండుచు పెద్దలను చూచినపుడంతయు వందనాదులు చేయుచు రాను రాను భూతహితమును పెద్దలపూజయు స్వభావగుణములుగా నేర్పడును.

ఇవ్విధంబున భక్తులు పరోపకారముద్వారా సమస్తభూతములందు మైత్రిచూపవలెను. మరియు కరుణయుచూపవలెనని శ్రీకృష్ణు లుపదేశించినారు. భగవంతుని కరుణానిధియనియు, దయానిధియనియు వర్ణింతురు. భగవంతుడు జగత్పిత,

జగత్తుకుతండ్రియని చెప్పుదురు. తండ్రికితనపుత్రులందరు తనవ లెసమస్త సుగుణములనుపొంది వర్థిల్లవలెననెడి అపేక్షయుండు ట సహజమనియెవరెరుగరు? భగవంతునికరుణను గోరు భక్తులు యితరులను కరుణతోచూడవలెను. కరుణారసము హృదయములందు పొంగుచుండినట్లంతయు భగవంతుడుమిక్కిలిప్రీతికలిగి తనఅపారమైన దయారసమునేభక్తులందు ప్రవహింపజేయును. అందుకేభక్తులు భూతదయను తమయందు విస్తరింపజేయుమని స్వామిని యెప్పటికిని వేడుకొనుచుందురు. శ్రీశంకరాచార్యుల వారు షట్పదియను స్తోత్రమందిట్లు స్వామినిప్రార్థించినారు.

శ్లో॥ అవినయమపనయవిష్ణో; దమయమనశ్శమయవిషయ
మృగతృష్ణాం భూతదయాంవిస్తారయ
తారయసంసారసాగరతః॥

తా॥ హేవిష్ణో! అవినయము పోగొట్టుము, అనగావినయము (Gentleness) కలుగజేయుము, విషయములను యెండమావులందు నామనసును పోనివ్వకశమింపజేయుము. భూతదయనువిస్తరింపజేయుము, సంసారసాగరమునుండి తరింపజేయుము.

మరియు భాగవతమునందొక భక్తుడిట్లు ప్రార్థించె.

కం॥ నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడినెయ్యమునునితాం
తాపార భూతదయయును
తాపసమందారనాకుదయసేయగదే॥

నీపాదపద్మములసేవయు, నీపాదసేవచేయువారితోస్నేహమును, యెల్లప్పటికిని అపారమైన అనగామితిలేని భూతదయయును నాకుదయసేయుమని తాత్పర్యము.

ఇట్లుదయారసముతో హృదయములునిండి ఉప్పొంగుచు పరులశ్రమ నోర్వజాలక యెప్పుడు వెన్నవలె కరుగుచువచ్చునో అప్పుడేభగవంతుడు వెన్నదొంగగనుక ఆహృదయనవనీతమును

దొంగలించుకొనిపోవును. ఆవెన్నను దొంగలించి అనుభవించు చు ఆనంద మొందుచుండును. శ్రీకృష్ణుడు నవనీతచోరుడనగా హృదయనవనీతమును అపహరించువాడని యర్థము. హృదయ మును నవనీతమువలె మృదువుపరచి స్వామిభుజించుటకైనివేదన మొసంగవలయు. ఆనివేదనస్వామికి అమితరుచిగాను, పరిపూర్ణ ఆహ్లాదకరముగానుండును. భక్తులందరు సమస్తభూతములందు మిత్రభావమును, దయారసమును చూపవలయు.

పరోపకార బుద్ధియు, దయార్ద్రహృదయమును లేకయెన్ని విధముల పూజచేసినను భగవంతుడు తృప్తిచెందడనుట సిద్ధ ము. పరులకు దయజూపుటవలన భగవంతుఁడు సంతసించినట్లు యితరయేవిధముచేతను సంతసించడు. దీనికొకకథకలదు.

పూర్వకాలంబున ఏకనాథుడను ఒకపరమభక్తుడుండె ను. ఆయన సర్వదా అతిథి అభ్యాగతులపూజ క్రమముతప్ప క చేయుచు సకలభూతంబులందును దయచూపుచు ప్రసిద్ధిజెంది యుండెను. భగవంతుడు ఆయన దయాహృదయమునకును సుశీల సంపదకును మెచ్చి ఆయన యింటిలో పరిచారకుడుగా తా ను భగవంతుడని తెలుపక పనిచేయుచుండెను. ఇట్లు కొన్నాళ్లు జరిగిన వెనుక యేకనాథుని తండ్రిశ్రాద్ధదివసము తటస్థించెను. అదివిధ్యుక్తముగా నెరవేరుటకు తగిన సామగ్రి తెచ్చియింట నుంచి భార్యను యథాశాస్త్రముగ శుచితో వంటచేయ నియ మించి తత్పూర్వము తగిన బ్రాహ్మణులను నిమంత్రణకు పిలిచి అన్నియేర్పాటులు చేసియుండెను. ఇట్లుండ నొకపెద్దమాల మాదిగ గుంపు యెక్కడికోపోవుచు మిక్కిలి మార్గాయాసముచే తను, ఆకలిచేతను బాధపడుచు, ఏకనాథుడు యేజాతివారికైనను ఆకలిగొన్నవారికి అన్నముపెట్టువాడను ప్రసిద్ధివిని ఆయనయిం టియొద్దకువచ్చిరి. ఆగుంపులోపిల్లలు, ముసలివారు, స్త్రీలువీరం దరుండిరి. ఆకలికోర్వజాలక పిల్లలేడ్చుచుండుటయు, తల్లులు దుః

ఖపడుటయుం చూచి యేకనాథుడోర్వజాలక యింటిలోనికిచని భార్యతో అతిథులు కేవలక్షుద్బాధతోవచ్చినారని చెప్పగా ఆమ హాపతివ్రత శ్రాద్ధమునకు వంటసిద్ధమైనది. ఇదివారికి పెట్టుదుము, నేను మరల గృహముశుద్ధిచేసికొని స్నానముచేసి వంటచేసెద నని చెప్పగా యేకనాథుడు పరమసంతోషమొంది సిద్ధమైన పదార్థములన్నియుగారెలు బూరెలతో ఆచండాలుల గుంపుకు పెట్టిపంపెను. వారుపరమ ప్రీతులై ఆగారెలు బూరెలు తినుచు బ్రాహ్మణవీధి గుండా యేకనాథుని పొగడుచువెళ్లిరి. ఇదంత యు చూచి ఆబ్రాహ్మణులందరు ఇదేమిచెడుకాలము! శ్రాద్ధదివస మందు బ్రాహ్మణులను పిలిచి బ్రాహ్మణుల భోజనము కాకమును పే మాలవాండ్లకు అన్నముపెట్టి శ్రాద్ధమునంతయు మాలల పాలుచేసిరి. ఏకనాథునికులములోనుండి వెలిదీయుదమని మిక్కిలి కోపపడి ఏకనాథుని యింటికి ఎవరునుపోకూడదని నిశ్చయించిరి. ఏకనాథుని యింటియందు యేకనాథుని భార్యయిల్లంతయు గోమ యముతో నలికిశుద్ధిపరిచి పాత్రలన్నియుతోమి స్నానమొనర్చి కేవలముశుచిగా శ్రద్ధతోవంటచేసి పెనిమిటికి మనవిచేయగా ఆ యన నిమంత్రణకుచెప్పిన బ్రాహ్మణులయింటికిపోయి వినయముతో శ్రాద్ధమునకుదయచేయవలెనని ప్రార్థింప నాబ్రాహ్మణులు అమి త కోపముతో ఓరీ! నీయింటికే బ్రాహ్మణుడువచ్చును? నీకుమాల మాదిగలందుగల విశ్వాసముబ్రాహ్మణులందుగలదా? నీవుఅప్పుడే మాలమాదిగలకు శ్రాద్ధముపెట్టితివి. ఆమాలఎంగిలి కూడు బ్రాహ్మణులకుపెట్టెదనని పిలిచెదవే నీధైర్యమేమనవచ్చును? నీవు చండాలుడవు నీవుమాయిండ్లవద్దికి రానుఅర్హుడవుకావు వెళ్లుము ని అందరు యేకమైతరిమిరి. ఏకనాథుడుమిక్కిలిచింతజెంది నేనె ట్లు శ్రాద్ధమునెరవేర్చెదను గ్రామమంతయు నొకటియైనదియేమి చేతునని వ్యథపడుచు యిల్లుచేరెను. అనంతరము భార్యతో జరిగినదంత చెప్పుచుండ పరిచారికుడువిని యెందుకు చింతించెదరు

నేను గ్రామాంతరమునకుపోయి శ్రేష్ఠమైన బ్రాహ్మణులను తోడ్తె
చ్చెదనని ధైర్యమిచ్చి కొంతదడవునకే విష్ణుస్థానమునకును, విశ్వే
దేవస్థానమునకును, పితృస్థానమునకును మంత్రములుచెప్పి కార్య
ము నెరవేర్చుటకును నలుగురినితోడ్తెచ్చెను. ఇట్లు శ్రాద్ధము జరు
గుచుండ యీవార్తవిని ఆగ్రామము బ్రాహ్మణులందరు గుమిగూడి
ఆచండాలునింట ఎవరో బ్రాహ్మణులు బ్రాహ్మణార్థమునకువచ్చి
శ్రాద్ధముజరుపుచున్నారట వారెవరైనదికనుగొని వారిని బహి
ష్కారముచేయవలెనని నిర్ధారించుకొని యేకనాథునింటవచ్చిచూ
డగా విష్ణుస్థానమందువిష్ణువును, విశ్వేదేవస్థానమందు విశ్వేదేవు
లును పితృస్థానమందు పితృలును, మంత్రములుచెప్పుటకుబృహస్ప
తియు ప్రత్యక్షముగా అగుపడిరి. అదిచూచి బ్రాహ్మణులందరు
పరమాశ్చర్యముచెంది యేకనాథుడు మహానుభావుడని గుర్తెరిగి
తాముచేసిన అపరాధము క్షమించవలెనని వేడికొని నాటినుండి
యేకనాథునందు వినయ భయవిశ్వాసములుగలిగి గౌరవించనా
రంభించిరి.

ఏకనాథుడు జాతికుల భేదమేదియు లెక్కగొనక అందరి
హృదయమందుండు ఈశ్వరుడొకడేయని తలంచి ఆకలిచే బాధ
పడువారిని చూచియోర్వజాలక శ్రాద్ధదివసమైనను అన్నము
పెట్టి అందరిని సంతోషపెట్టిన పూజకు భగవంతుడు తృప్తిజెంది
అనుగ్రహించెను. ఏకనాథుడు అందరివలె శ్రాద్ధదినమందెవరి
కి బిచ్చము కూడపెట్టదగదనిఆయాకలిగొన్నవారినితరిమియున్న
ఆశ్రాద్ధమునకు విష్ణ్వాదులువచ్చియుందురా?

శ్లో॥ ఏనకేనప్రకారేణపరస్యపురుషస్యతు
సంతోషంజనయేత్ప్రాజ్ఞఃతదేవేశ్వరపూజనం॥

అనెడు వాక్యము సత్యమని చెప్పుటకేమి సంశయముగ?
పరోపకారమునకంటె నెక్కువైన భగవత్పూజలేవియునులేవు.
ఈవిషయమునుగురించి విష్ణుపురాణమందు విపులముగా వివరింప

బడినది. అందు ముఖ్యమైన కొన్నిశ్లోకములిచ్చట వ్రాసెద.

శ్లో॥ భగవన్ భగవాన్ దేవ స్సంసారవిజిగీషుభిః
సమాఖ్యాహిజగన్నాథో విష్ణురారాధ్యతేయథా॥

సంసారమందుండువారు విష్ణువును ఏవిధమున ఆరాధించవలెనని మైత్రేయులవారు పరాశరమహామునిని అడుగగా వారు యీవిషయమై సగరచక్రవర్తికి ఔర్వమహాముని చెప్పినది తెలిపిరి. అదేదన;—

శ్లో॥ పరాపవాదంపైశున్యమనృతంచనభాషతే
అన్యోద్వేగకరంయశ్చతోష్యతే తేనకేశవః॥
పరదారపరద్రవ్యపరహింసాసుయోరతిమ్
నకరోతిపుమాన్ భూపతోష్యతే తేనకేశవః॥
నతాడయతినోహంతిప్రాణినోనాసదీహతే
యోమనుష్యోమనుష్యేంద్రతోష్యతే తేనకేశవః
దేవద్విజగురూణాంయిశ్శుశ్రూషాసుసదోద్యతః
తోష్యతే తేనగోవిందఃపురుషేణనరేశ్వర
యథాత్మనిజపుత్రేషుసర్వభూతేషుయస్తథా
హితకామోహరిస్తేనసర్వదాతోష్యతేసుఖమ్
యస్యరాగాదిదోషేణనదుష్టంనృపమానసం
విశుద్ధచేతసావిష్ణుస్తోష్యతే తేనసర్వదా॥

ఎవడుపరులను నిందించడో ఎవడుకొండెములుచెప్పడో, ఎవడు అపద్ధమాడడో, ఎవడు యితరులను జడిపించడో, వానిచేత కేశవుడు తృప్తిచెందుచున్నాడు. ఎవడు పరస్త్రీలనపేక్షించడో, ఎవడుపరధనము నపహరించడో, ఎవడుపరులను హింసించడో వానిచేత కేశవుడు తృప్తిచెందుచున్నాడు. ఎవడు ఏజంతువునుగానికొట్టడో, ఎవడు దేనినిగాని చంపడో, ఎవడే ప్రాణినిగాని హింసింపడో, వానిచేత కేశవుడు తృప్తిచెందుచున్నాడు. ఎవడుదేవతులను, బ్రాహ్మణులను, గురువులను సేవ

చేయుటయందు సర్వదా యత్నించుచుండునో వానిచేత గోవిందుడు తృప్తి చెందుచున్నాడు. ఎవడుతనయందును, తనపుత్రునియందును, సమస్తభూతములందును భేదములేకనొకవిధముననే హితముచేయుచుండునో అట్టివానిచేత హరియెల్లప్పటికి సులభముగ తుష్టిచెందుచుండును. ఎవనికి రాగద్వేషములచేత మనసు చెడకుండునో ఆపరిశుద్ధమైన మనసుగలవానిచేత విష్ణువుసర్వదాతృప్తి చెందుచుండును.

పైనుదాహరించిన శ్లోకార్థమును భక్తిగోరి భగవదనుగ్రహమునొందనపేక్షించు వారందరు బాగుగ్రహించవలెను. ఆశ్లోకాభిప్రాయము రీతినస్వామినితృప్తి చెందించుచు అర్చకులు ఏదేవాలయములందు పూజ కేర్పడియుందురో ఆదేవాలయములందంతయు భగవదనుగ్రహము నిండియుండును. అట్టిదేవాలయములందు భగవత్సేవచేయబోయినవారందరు భగవదనుగ్రహమునుపొంది అభీష్టములన్నియు నెరవేర్చుకొని ఆనందభరితులై తమనివాసములకు జనుదురు. అర్చకులు ఆయనుగ్రహరాసియందుయెల్లప్పుడును మునిగియుండుటచే దయాపూర్ణులై దేవాలయములకు దర్శనమునకును, సేవించుటకును, అర్చించుటకు, వచ్చినవారందరికి ఆనందమొందించి పునీతులను చేయుదురు. మరియు దేవాలయములకు పోనివారికైనను అట్టిఅర్చకుల సాంగత్యముచేతభక్తి గలుగును. సద్బుద్ధిపుట్టును, దయారసముంకురించును. ప్రేమ అతిశయించును. దుశ్చేష్టలుడుగును. ఆనందానుభవము ప్రాప్తమగును.

భగవదనుగ్రహమును ఆకర్షించి తమనిండనించికొని తమముఖమునుండి యితరులకు వ్యాపింపచేయునట్టియు, దేవాలయములు ఆయనుగ్రహముచే పరిపూర్తిగ నిండియుండునట్లు చేయునట్టియు అర్చకులుగల దేవాలయములందు ప్రవేశించువారు వినయభక్తులుగలిగి ఆనందమగ్నులై దేవాలయములనుండి వెళ్లి

వచ్చుటకు యిష్టములేనివారై యుందురు.

అటుగాక తెంగల వడగల మొదలగు వైషమ్యభావముల చే కలుగు క్రోధ ద్వేష, మత్సర, మద, ఈర్ష్యాదులతోనిండిన అర్చకులు దేవాలయములందు అర్చనకు పోయినపుడు దేవాలయములన్నియు వీరి క్రోధాది దుర్భావములతోనిండినవై, భగవదనుగ్రహరూపకములైన శాంత్యాది సద్భావములన్నియు అదృశ్యములగును. ఆలయములందు స్థాపింపబడిన విగ్రహములకు స్థాపకుల యోగ బలముచే కలిగిన మహిమాదులునశించిపోవును. శిలావిగ్రహములు భగవత్కళావిహీనములై నిలిచియుండును. దూరదేశములనుండి దేవతారాధనకు వచ్చినభక్తులు దేవాలయములలో ప్రవేశించినతోడనే అర్చకరూపములుధరించిన ఈర్ష్య, క్రోధ, మత్సర, మద, దంభపిశాచములును, యాచకులరూపముధరించిన ఆశాపిశాచములనుచూచి వారిచే అంతటనుపీడింపబడినవారై యెప్పుడెప్పుడు ఈపీడతప్పించుకొని పోదుమని విసుకుచెంది విగ్రహములను చూచినతోడనే దేవాలయములనుండి వెళ్లివత్తురు.

సామాన్యమైన ఒకప్రదేశ ప్రభువు ఒకగ్రామముప్రవేశించునపుడు ఆగ్రామములోనుండు కశ్మలమంతయు చిమ్మియెత్తివేసి కుప్పతొట్లలోనుండు చెత్తచెదరనంతయుకాల్చి వీధులన్నియు శుద్ధిపరచి నీళ్లుచల్లి గృహములకుసున్నముపూసి, అచ్చటచ్చట స్వాగతమంటపములతోను తోరణములతోను పురమంతయుఅలంకరించి ఆప్రభువును ప్రవేశపెట్టుదుము. ఇదియిట్లుండ ముజ్జగములనేలు ఈశ్వరునిఆలయములని పిలువబడుచోట్లలో క్రోధాది కశ్మలమును ఆశాది పిశాచములను ప్రవేశపెట్టవచ్చునా? ఇదిధర్మమా! న్యాయమా! పరమపరిశుద్ధుడైన ఈశ్వరుడిట్టి అపరిశుద్ధ ప్రదేశములందుండునా?

దేవాలయములందు అర్చించు అర్చకులకు పూజారులకై యుష్ట

నామముకూడయున్నదిగదా. వారుపూజకు అరులు అనగా శత్రులుగానుండకూడదు. వారుసర్వదా భగవంతుడు ధరించిన రూపముల సన్నిధియందుండువారుగానుందురు. ఆసన్నిధి బలము చేత వారియందు భగవద్గుణములగు దయాదిసుగుణములు ఆలయ బాహ్యమందుండు వారికంటె నధికముగానుండవలసినది ధర్మముకదా? గర్భాలయములందు వారికితప్ప యితరులకు ప్రవేశము లేదుకదా? అదెందుకైనది గుర్తించవలెను. వారుసర్వదా భగవదారాధనపరులై యుండుటనుపట్టి యితరులకంటెపవిత్రులనికదా వారికి ఆభాగ్యముకలిగినది. వారుగర్భగుడిలో ప్రవేశించునపుడు వారిదేహములు, మనసు, హృదయములెంత పవిత్రములుగానుండవలెను? వారియందెంత ఉత్తరవాదమున్నదో బాగుగగనుగొనుడు. దేవాలయములకు వచ్చువారినందరిని పునీతులుగా చేయు భారము వారిమీదమోపఁబడియున్నది. వారది గుర్తెరుగక ధర్మమును నీతియుదప్పి కామక్రోధాదులకు, ఆశాపాశముల కునుచికిత్సఉపేక్షభావముతోయిచ్ఛానుసారము వర్తించుచుండిరేని దేవాలయములకు వచ్చువారిపాపకర్మలకంతయు వారేగురిఅయి యీదేహానంతరము పరలోకమందు అనుభవించరాని కష్టముల నుభవించి రాబోవు జన్మమందు అతినీచయోనులందు పుట్టుదురు. ఇదిసత్యము సత్యము, మూటికి ముమ్మాటికిసత్యము. కాబట్టి అర్చకులందరు తులసి పుష్పాదులతో పూజచేయుటకు ముందు భగవంతుని యీక్రిందనుదాహరించినపుష్పములతో పూజచేయవలెను.

శ్లో॥ అహింసాప్రథమంపుష్పం పుష్పమింద్రియనిగ్రహః
సర్వభూతదయాపుష్పం, క్షమాపుష్పంవిశేషతః
శాంతిపుష్పంతపఃపుష్పం, ధ్యానపుష్పంతథైవచ
సత్యమష్టవిధంపుష్పంవిష్ణోఃప్రీతికరంభవేత్॥

మొదటిపుష్పముఅహింస, రెండవదియింద్రియనిగ్రహము, మూడవది సర్వభూతములందుదయ, నాలుగవది క్షమ అనగా

మనన్న, అయిదవపుష్పము శాంతము, ఆరవది తపస్సు, ఏడవది ధ్యానము, ఎనిమిదవపుష్పము సత్యము, ఈఅష్టదళములతో భగవదారాధన చేయవలెను. జ్ఞానమను అగ్నియందు దేహవాసన, శాస్త్రవాసనాది వస్తువులచే ధూపమొసంగవలయు.

శ్లో॥ సాజ్యంత్రివర్తిసంయుక్తంవహ్నినాయోజితంమయా
గృహాణమంగళందీపంత్రైలోక్యతిమిరాపహ॥

అనుమంత్ర ముచ్చరించుదురుగదా. కామమే ఆజ్యము, దారేషణ, ధనేషణ, పుత్రేషణముల నెడు యీషణత్రయంబులే మూడువత్తులు. వీనినిజ్ఞానదీపముతో వెలుగించి దీపమొసంగవలయు. కామమను ఆజ్యముతో యీషణత్రయములు కాలిన కొలదియు గర్భగుడిలోనుండు ఈశ్వరస్వరూపము బాగుగ తెలియును.

నివేదనకుహృదయమునే నవనీతముగాజేసి నివేదనమొనరించవలెను. ఇవ్విధంబున అర్చనలొనరించు అర్చకులు ఏ దేవాలయంబులలోనుందురో ఆదేవాలయంబులుండు గ్రామము వారును అచ్చటికి యితరస్థలములనుండివచ్చువారును భక్తినొంది భగవదనుగ్రహమునకు పాత్రులగుదురనుటకు సంశయము లేదు.

దేవాలయముల పవిత్రతయు, మహిమయు, ధర్మమును తప్పిచెడుట అర్చకులవలన మాత్రమే కాదు. ఇతరులును దానికి తోడ్పడుచున్నారు. పురాతన దేవాలయములందుండు మహిమయు, జనులహృదయములను ఆకర్షించు శక్తియు, భక్తినివృద్ధిజేయు సమర్థతయు నూతనదేవాలయములందు లేవు. దేశమందనేక వెంకటరమణస్వామి దేవాలయములును, రంగనాయకుల దేవాలయములను, నృసింహదేవాలయములును, వరదరాజ, ఆంజనేయదేవాలయములును, భిన్ననామములుగల మహాదేవుని దేవాలయములును ఉన్నవిగదా? ఇట్టిదేవాలయములు లెక్కకు మిక్కిలిగానుండినను, తిరుపతి, శ్రీరంగము, అహోబళము,

కాశీ, రామేశ్వరము, చిదంబరము, కంచి, కాళహస్తి, గోకర్ణము, ఉడిపి, శ్రీశైలము, అరుణాచలము, మధుర, అనంతశయనము మొదలగుపురాతన దేవాలయములకుజనులు బహుదూరము నుండి విశేషముగ ద్రవ్యము వ్యయముచేసికొని, మార్గాయాసమనుభవించుచు, ఇతర బాధలుపడుచు వెళ్లుచున్నారు.

అదెందుకన ఆపురాతనదేవాలయములు కట్టినకాలపు జనులకుండిన భక్తియిప్పటిజనులకు లేదు. అప్పుడుకట్టించుట కుద్యమించిన యజమానునికిని, కట్టుటకుబూనిన పనివారికిని, కూలివారికిని, స్వామియందు భక్తి యేకరీతినయుండినది. కట్టించు యజమానుడు ప్రతిష్ఠగాని, స్వయముగ ప్రతిఫలముగాని లేశమైన ఆపేక్షించక ఆదేవాలయములనుండి బహుమంది సర్వవిధముల మేలుపొందవలెననెడు ఉద్దేశముచే కట్టించుచుండెను. పనివారు సహితము "మేముదేవాలయము కట్టుచున్నారమే, మాకుస్వతహా కట్టించుసామర్థ్యములేకపోయినను యీమహాకార్యమునకు వంచనలేక తోడ్పడుదుమ"ని మిక్కిలి విశ్వాసముచే, నియమించిన కాలములో నేమాత్రము సోమరితనముచే వ్యర్థముచేయక పాటుపడుచు భక్తితోను మంచిమనసుతోను శిల్పశాస్త్రజ్ఞులు విధించినమేరకు యించుకైన అతిక్రమించక, యథావిధిగా కట్టుచుండిరి. చిన్నకూలివారుకూడ ఇదిభగవత్కార్యమని, పనిచేయు సమయమందు ఆడుకొనక ప్రీతిచే, తమకు నియమించిన పనులుచేయుచుండిరి. విగ్రహమును తీర్చు శిల్పి తానుతీర్చు విగ్రహమందు యేమాత్రముస్ఖాలిత్యముగాని లోపముగాని యేర్పడెనేని స్థాపనకనర్హమగుననియు, అట్టి స్ఖాలిత్యముగల విగ్రహమందు మహిమపూర్ణముగ నుండదని దానిచే బహుమందికి గలుగుమేలుకు భంగమగుననియు, ఆదోషమునకు తానుపాత్రుడగుననెడి భీతిచేకేవలము జాగ్రతగలిగి శాస్త్రోక్తముగ తీర్చుచుండెను. ఇవ్విధంబున సద్భావములతో కట్టబడిన

దేవాలయములందు అందరికీ మేలు కలుగవలెననెడి మనసుతో తీర్చిన విగ్రహములను, తపోనిష్ఠాగరిష్ఠులును, భూతదయాపరులును, లోకహితమే ప్రథమధర్మముగ పూనిసంచరించు మహాపురుషులును జగదుద్ధారమునకై వచ్చి స్థాపించుచుండిరి.

స్థాపించు సమయమందుచ్చరించు స్వరయుక్త మంత్రశక్తి చేతను, స్థాపకుని తపోమహిమచేతను, మంత్రరహస్యవేత్తలును ఆగమనియమ తత్వజ్ఞాతలును జరుపుచుండిన శాస్త్రోక్తకర్మలచేతను, ఆదేవాలయములందంతయు నయవినయభక్తులుత్పత్తి చేయు శక్తి ఆకర్షితమైనిండుచున్నది.

ఇట్లుసామాన్య కూలివారు మొదలుకొని స్థాపించిన మహాపురుషునివరకునుండిన నిర్మల మనోహృదయభావములును, దూరదేశములనుండి సేవానిమిత్తమైవచ్చినవారి భక్తిప్రేమాతిశయములును, ఆపురాతన దేవాలయములమహిమను ఇప్పటికిని కొంతమాత్రమైనను ఆపిపెట్టినవి.

ఇంతియెగాక ప్రతిసంవత్సరమును బహుజనులు వచ్చుటకుగాను యేర్పరచిన రథోత్సవము, గరుడోత్సవము, నందివాహనము మొదలగు ఉత్సవసమయములందు నియమించిన వివిధకర్మవిశేషంబులు అనేకతత్వరహస్యములను బయల్పరచుచున్నవి. ఆరహస్యములు తెలిసిన అర్చకులుగాని లేకయితరులుగాని ఆయుత్సవసమయములందు భక్తులకు విశదపరచి ఉపన్యాసములిచ్చిన మహదుపకారము చేసినట్లగును. ధర్మరక్షణసభవారు దీనినిగురించి ప్రయత్నించవలెనని మాప్రార్థన.

ఇట్లుపరమపవిత్రములైన దేవాలయములందు వెలయాండ్రను నృత్యములాడుటకును గానముసేయుటకునుహారతులెత్తుటకును నియమించియుండుట లేశమైనధర్మముకాదు. పూర్వకాలంబున కేవలపరిశుద్ధ మనోభావములును, పరమభక్తులును, బ్రహ్మనిష్ఠాగరిష్ఠులును, విషయానంద విముఖులును, శుదివ్రతులు

ను, ఊర్ధ్వరజస్వలలునైన కన్నియలు దేవాలయములందు నృత్యగాన, హారతులు మొదలగు నానావిధంబుల స్త్రీలుచేయదగిన సేవ కావృత్తికి నియమింపబడుచుండిరి. అట్టిసేవ సేయువారికి దేవకన్నియలను నామమిడబడినది. అవిద్ధయోనిగలవారికే కన్నియలనిపేరుగాని మితిమీరి విటపురుషులనుంచుకొన్నవారికి కాదు. ఇట్టిజారస్త్రీలను దేవాలయములలో ప్రవేశపెట్టుటకంటె గొప్ప తప్పిదియు లేదని చెప్పుటకేమి సంశయము?

వీరివల్ల కలుగుఉపద్రవమెంతనిచెప్పవచ్చు? ఇంద్రియనిగ్రహము లేని అర్చకులు మొదలు, దివిటీలుపట్టుసేవకులవరకునుండు జనుల మనంబులన్నియు వికలములగును, దేహవికారము చెందును. ఇది దేవాలయమే పవిత్రస్థలమే అనుస్మృతిదప్పును. చిత్తభ్రమగలుగును. దేవాలయములందు నానావిధములైన అపవిత్రత కలుగజేయును. సమస్తకామములకంటె స్త్రీకామము ప్రబలమైనది. దీనినణుచుటకడుదుర్లభము.

శ్లో॥ మత్తేభకుంభదళనేభువిసంతిధీరా
కేచిత్ప్రచండమృగరాజవధేపిదక్షా
కింతుబ్రవీమిబలినాంపురతప్రసహ్య
కందర్పదర్పదళనేవిరళామనుష్యాః॥

మదించినయేనుగు కుంభములను చీల్చినధీరులును, కోపోద్రేకముచే మండుచుండు సింహమును యెదురుపడి హతముచేసిన వీరులును గలరుగాని జ్ఞానబలముతో స్త్రీలనేత్రబాణముల చేనుత్పత్తియైనమన్మథోద్రేకమును తెగటార్చినశూరులుతరుచుగా లేరని యెలుగెత్తిచాటించెదనని భర్తృహరి చెప్పియున్నాడు.

స్త్రీకామమింతబలిష్ఠమైనది గనుకనే విశ్వామిత్రపరాశరాది ఋషులును కొన్నిసందర్భములయందు దానికి చిక్కుబడి దానిఫలమనుభవించిరని చెప్పబడినది.

శ్లో॥ విశ్వామిత్రపరాశరప్రభృతయో వాతాంబుపర్ణాశనా

స్తేపి(స్త్రీ)ముఖపంకజంసలలితందృష్ట్వైవ మోహంగతా॥
శాల్యన్నంసఘృతంపయోదధియుతంయేభుంజతేమానవా
స్తేషామింద్రియనిగ్రహోయదిభవేద్వింధ్యస్తరేత్సాగరే॥

విశ్వామిత్రపరాశరులు మొదలగు మహర్షులు, గాలి, నీరు ఆకులు ఆహారముగలవారైయుండినను స్త్రీలముఖపద్మములు చూచి మోహమును పొందియుండ, శాల్యన్నము నెయ్యి పాలు పెరుగుతోభుజించుసామాన్యమానవులకు యింద్రియనిగ్రహముగలిగెనేని వింధ్యపర్వతము సముద్రమందు తేలదాయని అదేభర్తృహరి వచనముగలదు. కనుక పులిహోర, పొంగలి, దధ్యన్నము, యిడ్డెనలు, వడలు, దోసెలు మొదలగు రుచ్యమైనపదార్థములను కడుపారభుజించు అర్చకులు మొదలగువారికి జారస్త్రీలనుజూచి చిత్తభ్రమణకలుగదనుట సర్వాపద్ధము. కాబట్టి వారాంగనలను దేవాలయములందు రాకుండచేయుట భగవంతుని ప్రథమకైంకర్యము. అటుచేయుటచే దేవాలయముల పవిత్రత కాపాడఁబడును. గానభక్తులందరు నీపనికి మొదటప్రూనవలయు.

కొందరు దేవాలయమునందు ఇస్పేటుచీట్లాడుదురు. (Cards). పులిజీతము మొదలగు జూదములాడుదురు. ఇవియును దేవాలయముల పవిత్రతను నశింపజేయును. ఈదుష్కార్యముల చే కలహములు, రోషములు, కోపము, ద్వేషము మొదలగు దుర్భావములుత్పత్తియై పెరిగి అనర్థములు కలుగజేయును. ఈదుస్వభావము దేవాలయములందువ్యాపించి వానిలోప్రవేశించు వారికి భక్తిపుట్టించుటకుమారుగా ఈదురాచారములుకల్పించును.

శ్లో॥ ద్యూతమేతత్పురాకల్పే దృష్టంవైరికరంనృణాం
తస్మాద్ద్యూతంనసేవేత హాస్యార్థమపిబుద్ధిమాన్॥

జూదముపూర్వకల్పములనుండి వైరమును కలుగజేయునదని తెలియబడినదిగనుక బుద్ధిమంతులు వేడుకకైనను జూదమాడరాదని మనుస్మృతియందుదాహరింపబడినది.

సామాన్యస్థలములందుకూడ జూదమాడుటదోషమని చెప్పి యుండ దేవాలయములలో ఆడుటనుగురించి తలంచనేల?

మరియు దేవాలయములందు పొగచుట్టలుకాల్చుట, బీడీలు, సిగరెట్లు త్రాగుట మొదలగు దుష్కార్యములచేగలుగు దుర్గంధ ధూమములను వ్యాపింపజేయుట మిగుల గర్హితమైనది. సుగంధధూపాదులచే దేవతలాకర్షింపబడి వారి సత్స్వభావపుమహిమ దేవళములందు వ్యాపింపజేయుదురు. దుర్గంధధూమముచే దుష్టపిశాచములాకర్షింపబడి దుస్స్వభావమహిమను వ్యాపింపజేయునుగనుక పవిత్రస్థలములందిట్టి అపవిత్రకార్యములు సేయుట పరమపాతకము. ఈపాతకము అచ్చటికిపోవువారిలోకూడ ప్రవేశించునుగనుక ఇట్టిదుష్కార్యముసర్వథా చేయదగదు.

కొన్నిప్రదేశములలో ముఖ్యముగ అనంతపురము, బళ్లారి కడప, కర్నూలు జిల్లాలలో దేవాలయములందు రాజకీయఅధికారులు తహశీల్ దార్లు, డిప్టీకలెక్టరులు, వారలసిబ్బందీ, విద్యాధికారులు, ఇంజనీరుఅధికారులు మొదలగు వివిధశాఖలకుచేరిన వారు బసచేసి పాకాదులుచేయుటేగాక కుటుంబములతో వెళ్లినపుడు దేవాలయములను శయ్యాగృహములుగ నుపయోగింతురు. ఇంతియకాదు అచ్చటనే కచేరిసయితముచేయుదురు, సాక్షివిచారణ మొదలగు కార్యములన్నియు అచ్చటనేసలుపుదురు.

ఆర్చనధ్యానాదుల కుపయోగించదగిన పరమపవిత్రస్థలములను పాకశాలలగాను, పడకటింట్లుగాను, పాతకానృతములు పలుకుకూటస్థలములుగాను ఉపయోగింతురు. ఈవిచారణలుజరుపుకాలములందు నానాజాతివారును, నానాతెగలవారును, వివిధనేరములు చేసినవారును, అనృతముపలుకువారును పలికించువారును ఏకకాలమున చేరియుందురు. ఇందరిస్వభావబలమహిమ ఆదేవాలయములందు ప్రవేశించి అచటి పవిత్రభావములనెప్పుడోపారదోలును. దీనినేపూజయనవలెనో తెలియదు.

దేవాలయములపవిత్రమును, మహిమను, కట్టించినవారి సముద్దేశమును కాపాడవలసిన క్రమమిదేనా! ఆర్యవంశజులారా! వెనుకుముందుయోచించక దినదినమును తెలిసియో, తెలియకనో యెట్టిఅకృత్యములను చేయుచున్నారము! ఈదోషకార్యఫలమనుభవింపకతప్పునా? చేసినకార్య ఫలమనుభవించేతీరవలెననుటె సిద్ధాంతముగనుక దేవాలయములందు పూజ, సేవ, ధ్యానము, అర్చనము, స్తోత్రముమొదలగు సత్కార్యములనేచేయుచు అందలిపవిత్రతను నశింపజేయక, మనసుసద్భావములచేఅభివృద్ధిచేయుచు, ఏపనికియేస్థల ముపయోగించవలెనో ఆస్థలమునుఆపనికి మాత్రమే ఉపయోగించుచు భక్తిగలిగి పరమాత్ముని అనుగ్రహమునకు పాత్రులగుదుముగాక.

ఇంకఆత్మవేత్తలు అంతట యెట్లు భగవంతుని ధ్యానించువిషయము యోచింతము.

ఇదిగొప్పవిషయము. దీనికినిరంతరాభ్యాసము కావలయును. ఆయభ్యాస మెట్టిదనిన:—

ఈశ్వరుడు (భగవంతుడు) సమస్త కల్యాణగుణములుకలవాడని అందరు (సమస్తమతములవారు) నిరాక్షేపముగ అంగీకరించియున్నారనుటకు సంశయమేమియులేదు. పరమదయానిధియనియు, పతితపావనుడనియు, ఆపద్బాంధవుడనియు, అనాథరక్షకుడనియు, ఆర్తత్రాణుడనియు, భయాపహరణుడనియు, పురుషోత్తముడనియు, నిర్మలుడనియు, సదానందుడనియు, నిర్వికారుడనియు, సర్వసముడనియు, పాపభంజనుడనియు, శాంతుడనియు, సర్వజ్ఞుడనియు, శరణాగతరక్షకుడనియు, సత్యసంధుడనియు, బహువిధములపొగడుచుండుట అందరికితెలిసేయున్నది.

అంతటను భగవంతునిచూచుటకుముందుతనయందుచూడవలెను. తానుఅందరిలోనొకడుకదా? తనయందు భగవంతుడుండునదిలేనిది మొదటతెలియవలెను. పైనవివరింపబడినభగవం

తుని కల్యాణగుణములు తనయందుండునది లేనిదికని పెట్టవలెను. దీనికిమరేవరిసహాయముగాని అవసరములేదు. "ఆత్మైవహ్యాత్మనఃసాక్షీ కృతస్యాపకృతస్యచ" అనిభారతప్రమాణముకలదు. మంచిచెడ్డలుచేసినందుకు తనకంటె నితగసాక్షులెందుకు? తనకు తెలియకనే యేకార్యమెవడుగాని చేయడుగదా? భగవంతుని పరమదయానిధియని చెప్పితిమి. ఆదయాస్వభావముతనయందు ప్రాంగుచుండెనేని తనయందుభగవంతుడు దయానిధిగా అగుపడినట్లాయె. తనయందు దయాస్వభావములేక కాఠిన్యముండెనా తనయందు భగవంతుడు దయారూపకముగలేడాయె. భగవంతుని తనయందుచూడగోరువాడు అప్పుడేమిచేయవలెనన, తనయందుండు కాఠిన్యమును నిర్మూలముగ నాశమొనరించి ఆకాఠిన్యమునకుమారుగ దయనుపెంచవలెను. దానినభ్యసించు క్రమమేదన? ప్రతిదినమును ధ్యానించుసమయమందు భగవంతుని తన హృదయమందు దయాస్వరూపునిగా ధ్యానించుచు దయారసముయొక్క సుఫలంబులు తలంచుచుండి బాహ్యమందు నిత్యకృత్యములుచేయునపుడు జన్మజన్మముల అభ్యాసముచే పట్టుబడిన కాఠిన్య స్వభావము అతిక్రమించి వచ్చునపుడంతయు కేవలదృఢమనసుతో దయనుచూపుచురావలెను. ఎందాకతనయందుండు కాఠిన్యస్వభావము పూర్తిగనాశమై దానికిమారుదయాభావము పట్టుపడుచున్నదో అందాక ఈఅభ్యాసము వదలకూడదు. ఇట్లనేతనయందుండు ప్రతిదుర్గుణమును పూర్తిగనశింపజేసి తద్వ్యతిరేకమైన సుగుణమును పైనగుపరచిన, అభ్యాసముద్వారా దృఢముగనాటునట్లు చేయవలెను. ఒకొ్కకసుగుణముతనయందు నాటినట్లంతయు భగవంతుడుఅంతమట్టుకుప్రకాశించుచువచ్చును. ఎప్పుడుపైనుదాహరించిన కల్యాణగుణములన్నియు తనయందు దృఢముగ పట్టుబడునో అప్పుడు భగవంతుడు తనయందు పూర్తిగ ప్రకాశించును. అట్లివాడేతనయందు భగవంతుని చూచు

వాడగును.

జీవుడు (మనుష్యుడు) ఈశ్వరుని అంశమే గనుక ఈశ్వరునియందు విశేషముగ ప్రకాశించుచుండు సమస్తకల్యాణగుణములు జీవునియందు బీజరూపముగ అప్రకాశమైయుండును. ఇట్లు అప్రకాశకముగనుండుటకు కారణమేమన జీవుని అశుద్ధస్వభావ దేహబీజములు(Permanent atoms of lower bodies)విశేషముగ ప్రకాశించుచుండుటతప్ప మరేమియు కాదు. ఈఅశుద్ధస్వభావ దేహబీజములెట్లు నాశనమగునన పైనచెప్పిన రీతిన భగవంతుని కల్యాణగుణములు ధ్యానించుచు సమయము దొరికినపుడంతయు ఆగుణములుచూపుచు రానురాను క్రమక్రమముగ అశుద్ధస్వభావ గుణములకు ఆహారమివ్వకపోవుటచే అవి కృశించి కృశించి చివరకు నాశనమొందును. ఈ అశుద్ధగుణములు కృశించినట్లంతయు విశుద్ధమైన కల్యాణగుణములు ప్రకాశించుచు వచ్చుచు అశుద్ధగుణములు పూర్తిగ నాశనమొందినపుడు ఈశ్వరసంబంధమైన విశుద్ధకల్యాణగుణములు పూర్తిగప్రకాశించును. అప్పుడు అట్టివానిని పూర్ణుడందురు. వాడేఈశ్వరుని తనయందు చూచువాడు. దీనికినిరంతరాభ్యాసము కావలెను. ఇదిఒకజన్మమందు చేయుఅభ్యాసముచే రాజాలదు. ఒకఅశుద్ధ దేహబీజమును నాశమొనరించి తద్వ్యతిరేక శుద్ధగుణమును స్థాపించుటకే అనేకజన్మములు కావలసియుండును. అనంతకల్యాణగుణములను స్థాపించుటకెన్నిజన్మములు కావలసియుండునో యోచించవలయును. కనుకనే.

శ్లో॥ జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాదిభిః
నరాణాంక్షీణపాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే॥

అనిచెప్పబడినది. అనగా అనేకజన్మసహస్రములందు చేసినతపస్సుచేతను, ధ్యానముచేతను, సమాధిచేతను స్వామియందు అనన్యభక్తికలుగుచున్నదని తాత్పర్యము. పైనక

నుపరచిన అశుద్ధగుణనాశనముచేయుటకును శుద్ధగుణమును వృద్ధి పరచుటకును చేయుఅభ్యాసమునకంటె నెక్కువ తపస్సేదియు లేదు. ఇట్టితపస్సుచేత తానునిర్మలుడైన పరమాత్మను తనయందు చూచిన దొరుకునుగాని తానుమలినుడై చూచినంతట చూడజాలడు.

"సర్వత్రవిదితాత్మనామ్"

అనికదా చెప్పబడినది. ఆత్మను తెలిసినవారు అనగాతన్ను తెలిసినవారు అంతటనుభగవంతుని చూచుచున్నారని తాత్పర్యము.

భగవంతుని అంతటచూచుటకుముందు అంతట తన్ను చూడవలసినదిముఖ్యము. దీని నెట్లు అభ్యసించవలయుననిన:—

మొదట నితరులతో ప్రపంచ వ్యవహారములు సలుపునపుడు సుఖదుఃఖములందు తనతోపోల్చుకొని వర్తించవలెను.

శ్లో॥ యథైవాత్మాపరస్తద్వత్ ద్రష్టవ్యస్సుఖమిచ్ఛతాం
సుఖదుఃఖానితుల్యాని యథాత్మనితథాపరే॥

అనగా సుఖముకోరువాడు తన్నుగురించి యెట్లుచూచునో యితరులనుగురించియు అట్లనే చూడవలెను. సుఖదుఃఖములు తనయందెట్లువర్తించునో యితరులందుకూడ అట్లనే వర్తించునని దక్షస్మృతి ప్రమాణము.

శ్లో॥ ఆత్మౌపమ్యేనసర్వత్ర సమంపశ్యతియోఽర్జున।
సుఖంవాయదివాదుఃఖం సయోగీపరమోమతః॥

సకలభూతములను సుఖదుఃఖములందు తనతోసమానముగా నెవడుచూచుచున్నాడో వాడేయోగియని నాఅభిప్రాయమని శ్రీకృష్ణులు భగవద్గీతయందు అర్జునునికి ఉపదేశించియున్నారు.

శ్లో॥ ఆత్మౌపమ్యేనభూతేషు దయాంకుర్వంతిసాధవః॥

సాధువులు తన్నుపోల్చుకొని యితరులందు దయచూపుచున్నారని తాత్పర్యము.

సుఖదుఃఖములు ప్రాప్తమయినపుడు తన్నుపోల్చుకొని వర్తించినచో నేశాస్త్రప్రమాణమును అవశ్యముండదు. దీనికు దాహరణముగ స్వానుభవమునుగురించి నడచినది తెలియచేసెద. నేను గుత్తిలోనుండినపుడు నాపెద్దకొమార్తె ప్రసవించి మిక్కిలి జబ్బుగానుండెను. ఆమెకు కసవాపురపు ఆంజనేయుల సేవచేయుటచే గుణమగునని నమ్మకముండెను. అచ్చటికిపోయిన రోగనివారణ మగునని గట్టిపట్టుపట్టినందున అక్కడికివిధిలేకతీసికొనిపోతిమి. అట్టిపట్టుపట్టుటకు కారణమేమన:— ఆబిడ్డకు యీరోగమువచ్చుటకు రెండుసంవత్సరములకుముందు గొప్పవాయుసంబంధమైనవ్యాధిసంభవించి పేరుపొందిన అనేకయింగ్లీషు, హిందూ, మహమ్మదీయ వైద్యులచేత ఘనమైనమందులిప్పించినను నివారణకాకపోయె. ఈవైద్యులందరు ఈరోగము నివారణకాదని దృఢముగచెప్పినందున దేవతాసేవద్వారానైన నివారణమగునేమోఅనెడితలంపుతో ఆదేవాలయమువ్యాధులునివారణమగుటయందును, అనేకఅభీష్టములు సిద్ధించుటయందును విశేషప్రసిద్ధిచెందియుండినందున అచ్చటికితోడ్కొనిపోతిమి. అచ్చటనాలుగు దినములుఆమెతల్లియైన నాభార్యప్రదక్షిణములొనరించి పూజచేసినతరువాత అయిదవరాత్రి నాకుమార్తెయగు రోగికి ఉత్తరేణిఆకుతెచ్చి పసుపుపొడితోనూరి నొప్పియుత్పత్తియగుచోట పెట్టికట్టినయెడల నివారణమగునని స్వప్నమాయెను. ఆస్వప్నమైనసంగతి నాభార్యతోచెప్పెను. వ్యాధినివారణనుగురించియేతలంచుచుండుటచే నట్టిస్వప్నమైనదని యుపేక్షాభావముతోనుండిరి. అదేరాత్రి ఆదేవాలయము కసువుచిమ్ముసంజీవుడనువానికి అదేస్వప్నమేఆయెను. వాడువేకువలేచినతోడనే పొలమునకువెళ్లి వుత్తరేణిఆకుతెచ్చి నాభార్యను పసుపుపొడిఅడిగి యీఉత్తరేణిఆకు పసుపుపొడితోదంచికట్టితే మీకూతురి నొప్పిపోవుచున్నదని స్వామినాకుకలలో చెప్పెనని చెప్పెను. ఆమెవిని యు

దేమివింత నాకూతురికికూడా యిదేకలేరాత్రివచ్చినదని పసుపుపో
డియిచ్చెను. దానినిపుచ్చుకొని ఉత్తరేణి ఆకుతోకూడాదంచి
నొప్పియుండినచోట కట్టిన పదినిమిషములకే నొప్పిపూర్తిగాపో
యెను. తరువాతయేడురోజులు అట్లనేకట్టబడెను. మరల
ఆనొప్పిఆమెకురాలేదు:-దీనినిపట్టి యిప్పుడువచ్చినజాడ్యమును అ
చటికిపోయిన నివారణమగునని నమ్మిఅక్కడికి పిలుచుకొనిపొమ్మని
పట్టుపట్టినందున తోడ్కొనిపోతిమి. రెండురోజులలో వ్యాధిఅధి
కమాయెను. జీవించుటకష్టమని తెలిసినది. దేవాలయములో
మృతినొందిన సంప్రోక్షణాదులు చేయవలసివచ్చునని అర్చకులు
మొదలగువారు దేవాలయమునువిడిచి పొమ్మనినిర్బంధపెట్టిరి.
అప్పుడు రాత్రిపదిగంటల సమయము. దేవళముయూరికి ముప్పాతి
కమైలుదూరములోనున్నది. ఆగ్రామములో సత్రము మొదలగు
బాటసారులు దిగుచోటేదియు లేదు. ఆదినముఆషాఢబహుళ
యేకాదశి, మబ్బుకప్పియుండినది. చినుకులుపడుచుండినది.
నేను నాఅల్లుడుతప్ప మరెవరునుయుండలేదు. చచ్చుటకుయిల్లు
యెవరివ్వరుగదా? ఏమియుతోచక కొంతదడవుండి బండితెప్పిం
చి ఆబండిలో ఆమెనువేసికొని ఊరిలోనికిపోయి అయూరిపురో
హితుని యింటిముందర బండినినిలిపి నిదురపోవుచుండిన ఆపురో
హితునిలేపి నావిపత్తుచెప్పుకొంటిని. నాడు ధనిష్టానక్షత్రము.
అట్లుండియు ఆయన రెండవమాటాడక తనయింటిముందరి గదినియి
చ్చెను. ఆగదిలో ఆరోగినియుంచి ఉపచారములుచేయుచుండ
రెండుగంటలలో ప్రాణముపోయెను. ఆయనయందు భగవం
తునికి నైజమైన ఆపద్బాంధవగుణముండినదని చెప్పుటకేమిసం
శయము. ఇట్లుగదా సమయమునుతటస్థించినపుడు భగవద్గుణ
ములు చూపవలెను? ప్రతిమనిషియు పరులకుదుఃఖములు ప్రా
ప్తమగునపుడు ఆదుఃఖములు తనకు ప్రాప్తించినట్లుతలం
చినట్లయిన యితరులయందు తన్నుచూచినట్లాయెను. అప్పుడుతా

ను తనఆపత్తును తొలగించుకొనుటకు యేయత్నముచేయునో యి తరులఆపత్తు తొలగించుటకు అదేయత్నమేచేయును. సుఖదుః ఖములు యితరులకు సంభవించినపుడు ఆసుఖదుఃఖములు తనవిగా భావించుచు రానురాను తనకును యితరులకును భేదములేనిస్థితి పట్టుబడును. ఇదిగొప్పయోగము. ఈయోగమును భూలోక మందు పొందినవాడు గురుకటాక్షముకలిగినపుడు అతిశీఘ్రముగ ఏకత్వమునుచూచును. వానికి శోకమోహము లుడుగును.

"తత్రకోమోహఃకశ్శోకః ఏకత్వమనుపశ్యతః"

ఏకత్వమునుచూచు వానికిశోకమోహములులేవని ఈశావా స్యోపనిషత్తు పలుకుచున్నది.

శ్లో॥ సర్వభూతేషుచాత్మానం సర్వభూతానిచాత్మని
పశ్యతేయోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనః॥

సర్వభూతములందుతన్ను, తనయందు సర్వభూతములను యోగయుక్తుడైన సమదర్శనముగలవాడు చూచుచున్నాడని భగవద్గీతయందు చెప్పబడినది.

భగవంతునిఅంతటనుచూచు విషయములో తనయందుభగ వంతుని చూచువిధముపైనచెప్పబడినది. ఇతరులందు భగవం తునిచూచువిషయమునుగురించి యింక విచారింతము.

లోకమందు సమస్తభూతములందును ఏదైననొక సుగుణ ముండకుండదు. ఒకనియందు దుర్గుణములుమితిమీరియుండినను ఏదైననొక సుగుణముండేతీరును. భగవంతుడు సమస్త కల్యా ణగుణోపేతుడు. ఎవనియందే కల్యాణగుణమున్నను అది భగవత్సంబంధగుణమే. ఇతరభూతములందుండు దుర్గుణము లను యించుకైనలెక్కగొనక వానియందుండు సుగుణములను మాత్రము గణించుచు వర్తించుచుండుట సమస్తభూతములందు భగవంతునిజూచెడి అభ్యాసముసాధించుట. దీనిచేత వానిని నికృష్టముగాచూచుట తొలగును. వానియందు ద్వేషభావము

పూర్తిగవదలి గౌరవభావమువృద్ధియగును. ఈఅభ్యాసమును సాధించినట్లంతయు సమస్తభూతములందును వినయ విశ్వాసము లుచూపుట స్వభావమైనిలుచును.

శ్లో॥ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా
తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశసంభవం॥

అనిభగవద్గీతయందు శ్రీకృష్ణులు చెప్పినారు. కనుక దేనియందు ఏసుగుణమున్నను ఆగుణగ్రహణముభగవంతుని గుణగ్రహణమేగాని వేరుకాదు.

శ్రీకృష్ణులు భాగవతము ఏకాదశస్కంధమందు సర్వత్ర భగవంతుని చూచుటకు చేయవలసిన అభ్యాసమునుగురించి యిట్లు ఆనతిచ్చినారు.

శ్లో॥ విసృజ్య స్మయమానాన్స్వాన్
దృశంవ్రీడాంచదైహికీం
ప్రణమేద్దండవద్భూమా వాశ్వచండాలగోఖరం
ఈశ్వరోజీవకళయా ప్రవిష్టోభగవానితి
యావత్సర్వేషుభూతేషు మద్భావోనోపజాయతే
తావదేవముపాసీత వాఙ్మనఃకాయవృత్తిభిః॥

స్వకీయమైన అభిమానమునువదలి దేహముగల సమస్తభూతములను ప్రీతితోఁజూచుచు ఆభూతములందంతయుఈశ్వరుడు జీవకళగాప్రవేశించినాడని తలచి కుక్కను, చండాలునికిని, గోవుకును, గాడిదెకును, భేదమేమాత్రమును యెంచక యెందాక వానియందంతయు నాభావము (ఈశ్వరభావము) గన్పడకుండునో అందాక మనోవాక్కాయ కర్మలచే సాష్టాంగదండప్రణామము చేయుచు రావలయును. ఇదియొక అభ్యాసము. ఒకవేళ కాయకముగా చేయుటకు తాత్కాలిక సందర్భములనుపట్టి వీలులేకపోయినను మనసుతోనైన చేయుచురావలెను. ఇవ్విధంబున అంతటను భగవంతునిచూచుట అభ్యసించవలెను.

పైనఁగుపరచిన పలుతెరంగులగు ధ్యానములలో నేదిరొంత రికిసుకరమనితోఁచునో దానినభ్యసించుటచేత క్రమక్రమముగ స మాధినిష్ఠ చెందవలెను. సమాధియందుతప్ప నితరత్ర ఈశ్వరు ని చూచుటకువల్లపడదు. ప్రజ్ఞ యొక్క (Consciousness) నాలుగవస్థితితురీయము. అది పొందువరకు నిజముగబ్రహ్మానుగాని, తన్నుగాని తెలియుటకు సాధ్యముకాదు. జాగ్రదవస్థయందు దేహముతాననెడి భావమును, బహిర్ప్రపంచమే నిశ్చయమను భ్ర మయునుండును. స్వప్నావస్థయందు యథార్థముకాని బ హిర్ప్రపంచవాసనయే అంతఃవ్యాపించి భ్రమింపచేయుచుండును. దీనికి అంతఃప్రజ్ఞయని పేరు. నిద్రావస్థయందు పైరెండువిధము లైన భ్రమలును లేక దేహమనస్సంబంధములైన యేలాటిదుఃఖ ములుగాని, బాధలుగాని అనుభవించక ఆనందముయొక్క స్వభావమేమియు తెలియక అజ్ఞానముతోనిండి తత్త్వము తెలియ కనుండును. దీనికి ఘనప్రజ్ఞయని పేరు. ఈమూటికావలదే తురీయస్థితి. దీనికే పేరును లేదు. నాల్గవదియని చెప్పుదురు. ఇ దేసమాధిస్థితి. ఈస్థితినిపొందుటకు ధ్యానయోగముతప్ప వేరుసాధనములు లేవుగనుకనే భక్తినిపొందుటకు ధ్యానయోగ పరుడుకావలెనని గీతయందు స్వామి ఉపదేశించినాడు.

ప్రపంచ వ్యవహారములందు సర్వదా కాలముగడుపు సా మాన్యనరులకు అంత్యకాలమందు భగవధ్ధ్యానము కలుగుట కడు దుర్లభము. అనేకజన్మములు ధ్యానయోగంబుచే సమాధిని ష్ఠను చెంది పదేపదే ఆనిష్ఠనభ్యసించుటచే ఈదేహమునువిడచి మరల ప్రవేశించు సమర్థతగలవానికితప్ప నితరులకు దేహాంత సమయమందు తదేకధ్యానము కలుగదు. అదెట్లన:—సర్వ సాహసముచేసి ఏకాగ్రతనుపొంది ధ్యానముచేయు సమయమం దు దేహమునకేదైన ఉపద్రవముకలిగినతోడనే మనసు ధ్యేయప దార్థమునుండి తొలగి క్షోభజెందును. శీతముచేగాని ఉష్ణ

పైనుదాహరించినప్రమాణము ననుసరించి యోగముచేత పక్వదేహులగువరకు అంతకాలమందు భగవంతునినే ధ్యానించుచు శరీరమువిడుచుటలభించదని స్పష్టమగుచున్నదిగనుక భక్తిగోరువారు యోగముచేత పరిపక్వదేహమునుపొందవలెను. అట్టిదేహము కలిగినప్పుడు అంతఃనుండు ఆత్మ ప్రకాశమునకువచ్చును.

శ్లో॥ అగ్నిర్దారుగతోయద్వ ద్భిన్నోదారౌనదృశ్యతె
తద్వైవాత్మాశరీరస్థో యోగేనైవానుదృశ్యతె
అగ్నిర్యథాహ్యుపాయేన మథిత్వాదారుదృశ్యతె
తద్వైవాత్మాశరీరస్థో యోగేనైవాత్రదృశ్యతె॥

భారతము, శాంతి, మోక్షధర్మపర్వము. వార్ష్ణేయాధ్యాత్మము, 210 వ అధ్యాయము.

కట్టెయందున్నఅగ్ని కట్టెనువిడచివేరుగా నెట్లగపడదో అట్లనేశరీరమందున్నఆత్మ యోగముచేత అక్కడనే అగుపడుచున్నది. ఉపాయముగ మథనచేయుటచే (రాపడిచే) కట్టెయందుఅగ్ని యెట్లుప్రకాశించుచున్నదో అట్లనే శరీరమందున్న ఆత్మ యోగముచేత ప్రకాశించుచున్నదని తాత్పర్యము.

యోగముచేతను ధ్యానముచేతను మనోవాక్కాయముల చే జన్మజన్మములనుండి చేసినపాపములన్నియు దగ్ధమై పరిశుద్ధమైన శరీరముకలుగును దానిచేత ఆత్మప్రకాశించును.

శ్లో॥ యదిశైలసమంపాపం విస్తీర్ణంబహుయోజనం
భిద్యతేధ్యానయోగేన నాన్యోభేదఃకదాచన॥

బహుయోజనముల విస్తీర్ణముగల పర్వతమువలెచేరియుండు పాపములన్నియు ధ్యానయోగములచే నశించిపోవుచున్నవని ధ్యానబిందూపనిషత్తునందు చెప్పబడుచున్నది.

కట్టెలోనుండినఅగ్నిని ప్రకాశమునకు తేవలసియున్న, కట్టెమీదకట్టెనుంచి మథనచేయవలెను. అట్లుచేయగా కట్టెలో దాగియుండిన అగ్నిప్రకాశమునకువచ్చును. శరీరములోదాగి

యున్న ఆత్మయెట్లుప్రకాశమునకు వచ్చుటనుగురించి శ్వేతాశ్వత రోపనిషత్తునందిట్లు చెప్పబడినది:—

శ్లో॥ స్వదేహమరణింకృత్వాప్రణవంచోత్తరారణిం
ధ్యాననిర్మథనాభ్యాసాద్దేవంపశ్యేన్నిగూఢవత్॥

తనదేహమునే క్రిందికట్టెగాజేసి ప్రణవమును పైకట్టెగాజేసి ధ్యానాభ్యాసముచేత మథనచేయగా శరీరమంధుదాగినట్లున్న దేవునిచూడగలడని తాత్పర్యము.

ఇట్లుయోగాగ్నిచే సమస్త పాపములను దహించి ఆత్మను ప్రకాశమునకు తెచ్చినవారి శరీరమెట్లుప్రకాశించుచుండునది అదే శ్వేతాశ్వతరోపనిషత్తునందిట్లు చెప్పబడినది.

శ్లో॥ నతస్యరోగోనజరానదుఃఖం
ప్రాప్తస్యయోగాగ్నిమయంశరీరం
లఘుత్వమారోగ్యమలోలుపత్వం
వర్ణప్రసాదంస్వరసౌష్ఠవంచ
గంధశ్శుభోమూత్రపురీషమల్పం
యోగప్రవృత్తింప్రథమాంవదంతి॥

యోగాగ్నిచే పరిశుద్ధమైన శరీరముగలవారికి రోగముగాని, ముసలితనముగాని దుఃఖముగానియుండదు. వారిశరీరములఘువుగాను, ఆరోగ్యముగాను, పేరాసలేనిదిగాను, ప్రశస్తమైన వర్ణముగలదిగాను, సుస్వరముగలదిగాను సుగంధముగలదిగాను, జలమలములు అతిస్వల్పముగానుండునదిగానుండును. ఇదియోగాభ్యాసారంభులకు ప్రథమఫలమని తాత్పర్యము.

యోగాగ్నిచే సమస్తదేహమనోదోషములను దగ్ధముచేసిన శరీరములుగల వారికి తేలుపాము మొదలగు విషజంతువుల వలన భయమేమాత్రముసుండదు. ఈదుష్టజంతువుల విషము వారిశరీరములకెక్కదు. అవికరచినను వారికించుకైనబాధ లేకుండును. ప్రహ్లాదుని హిరణ్యకశ్యపుడు విషజంతువులచే

కరిపించినను ఏలాటి ఉపద్రవము కలుగలేదని భాగవతమందు చెప్పియుండలేదా?

"సమత్వంయోగఉచ్యతే"

సర్వవిషయములందును సర్వభూతములందును రాగద్వేషములులేక సమభావమును చెందియుండుటయోగమని భగవద్గీతయందు చెప్పబడినది. వీరు సర్వభూతములకు అభయమిచ్చి తామును యేభూతములనుండిగాని భయముచెందకుందురు.

శ్లో॥ అభయంసర్వభూతేభ్యోదత్వాయశ్చరతేమునిః
నతస్యసర్వభూతేభ్యోభయముత్పద్యతేక్వచిత్ ॥

అనిమహాభారతము శాంతిపర్వమునందు చెప్పబడినది.

దేనినుండిగాని యెవ్విధంబునను భయములేనివారికి తదేకధ్యానముకలిగియుండునుగాని యేమాత్రభయముయొక్క బీజమున్నను తైలధారవలె అవిచ్ఛిన్నమైన ధ్యానముకలుగదు. ఇట్టిధ్యానయోగాభ్యాసములు లేక అనన్యభక్తినిపొందజాలరు. అనన్యభక్తి అనగా సర్వావస్థసర్వకాలములందు భగవంతునియందే మనోబుద్ధులుంచి సమస్తకార్యములు భగవంతుని కార్యములుగా జేయుచుండుట.

శ్లో॥ మయ్యేవమనఆధత్స్వమయిబుద్ధింనివేశయ
నివసిష్యసిమయ్యేవఅతఊర్ధ్వంనసశయః॥

శ్రీకృష్ణులు భగవద్గీత 12-వ అధ్యాయమందు భక్తియోగము బోధించునపుడు "నాయందే మనమునుంచుము, నాయందే బుద్ధిని ప్రవేశింపజేయుము, అట్లచేసినట్లయిన నాయందే నీవు ఉందువు అందుకు సంశయములేదు" అనిచెప్పియున్నారు గనుక ధ్యానయోగము నభ్యసించుట ఆత్మస్వరూపమును తెలియుటకును తద్వారా బ్రహ్మసాక్షాత్కారముచేసికొనుటకును అత్యవసరములు. ధ్యానయోగములచే మనోవృత్తినశించును. మనోవృత్తిహీనునికి బ్రహ్మసాక్షాత్కారమై బ్రహ్మానందముసిద్ధించును.

మనసోవృత్తిహీనస్యబ్రహ్మాకారతయాస్థితిః
యాఽసంప్రజ్ఞాతనామాస్తి సమాధిస్స్వభిధీయతే॥
అని శ్రీశంకరాచార్యులవారు చెప్పినారు. ధ్యానయోగ పరుడై విరక్తినిచెంది అహంకారము లేశమైనలేక బలదర్పములు డిగి కామక్రోధములనువదలి మమకారముంచక శాంతిచెందినవా డు బ్రహ్మాఅగుటకు తగినవాడగునని చెప్పబడినది.

ధ్యానయోగములను గురించి యింక విశేషముగ చెప్ప నక్కరలేదు. వైరాగ్యమునుగురించియు కామక్రోధములను గురించి యింతకుముందే వివరింపబడినది. అహంకార మమ కారములనుగురించి యిప్పుడు కొంచము విచారింతము.

శ్లో॥ సంత్యన్యేప్రతిబంధాః పుంసస్సంసారహేతవోదృష్టాః
తేషామేవంమూలంప్రథమవికారోభవత్యహంకారః
తస్మాదహంకారమిమంస్వశత్రుం
భోక్తుర్గళేకంటకవత్ప్రతీతం
విచ్ఛిద్యవిజ్ఞానమహాసినాస్ఫుటం
భుంక్ష్వాత్మసామ్రాజ్యసుఖంయథేష్టం॥

మనుష్యులకు సంసారకారణములగు అనగా జననమరణ కారణంబులగు నితర ప్రతిబంధములెన్నియోయున్నవి వాని కన్నింటికి మూలమగు మొదటివికారము అహంకారము. కాబ ట్టి భుజించ నిచ్ఛయించినవారికి గొంతులో ముల్లువలెనుండు శత్రువైన యీఅహంకారమును విజ్ఞానమను గొప్పఆయుధముచే నరికియథేష్టముగా ఆత్మానందవైభవమునమభవించుమని శ్రీశం కరాచార్యులవారు వివేకచూడామణియందు సెలవిచ్చినారు. కనుక అహంకారమునకంటె నెక్కువైన మోక్షవిఘ్నకారి యేదియులేదు.

నేను గొప్పవాడను, నేను విద్వాంసుడను, నేనుధని కుడను, నేనుభక్తుడను, నేనుబలవంతుడను, నాసమానమెవరు

న్నారు? అనెడి అహంకార మెందాక నరులందుండునో అంధాక మనుష్యుడు భక్తినొందజాలడు. ఈఅహంకారికే బలదర్పములు నిండియుండును. అహంకారము నాశముచెందిన చో వెంటనేబలదర్పములు నశించును. ఈఅహంకారము నెట్ల ణచవలెను? ఒకనికితాను విద్వాంసుడను నహంకారముండి దా నిని నాశపరుప నిచ్ఛకలిగినపుడు తనకంటె నెక్కువ విద్వాంసుని తో తన్ను పోల్చుకొనుచుండవలెను. అప్పుడు వానికి సమ్మత వినయముకలుగును. లేకతనకు రానివిద్యవచ్చిన యితరులతో బోల్చుకొని ఆవిద్యయందుతన కెంత అజ్ఞానమున్నదని తలంచుచు, ఆవిద్యగలవానిని మెచ్చుట అభ్యసించినట్టైన దినదినంబునకు అ హంకారమణగిపోవును. అట్లనేయెవనికి దేనియందు తానధికు డను దురభిమానముకలిగియుండునో వాడు పైచెప్పినరీతిన తనకం టెనధికుని పోల్చుకొనుచు వినయమువృద్ధిచేయుటద్వారా అహం కారమును నాశ మొనర్చవలెను.

అహంకారమెక్కడనుండునో అక్కడనే మమకారముం డును. నేనుఅను వస్తువునకును, నేనుకాదనువస్తువునకును సంబం ధముగలుగజేయునదే మమకారము. "నేను" అనెడి, దానికిని "అది"అనెడిదానికిని సంబంధముకలుగగానే "నాది" అనిఆయె. దీనికి "మమకార"మని పేరు. నాదియిల్లు, నాదితో ట, నాదిభార్య, నాదిధనముఅనుట నేనుఅనువస్తువుకును యిల్లు, తోట, భార్య, ధనము, వీనికినిగల సంబంధమే. "నాది"అను భావమే సకలదుఃఖములకు కారణము. దీనికేరాగమనియు స్నే హమనియు చెప్పుదురు.

శ్లో॥ నాస్తివిద్యాసమంచక్షుః నాస్తిసత్యసమంతపః
నాస్తిరాగసమందుఃఖం నాస్తిత్యాగసమంసుఖం॥

విద్యతోసమానమైన కన్నులేదు, సత్యమునకు సరియైన తపస్సులేదు, రాగములోపాటి దుఃఖములేదు, త్యాగముతోసరివ

చ్చు సుఖమును లేదని విదురుడు ధృతరాష్ట్రునికి బోధించినాడు. కనుక రాగమునకంటె నెక్కువైన దుఃఖహేతు వేదియు లేదనుట స్పష్టము.

ధర్మరాజు అరణ్యవాసమునకు పోయిన కాలమందు దుఃఖపడుచుండినపుడు సర్వదుఃఖములకు కారణము స్నేహమేఅని బోధించినారు.

శ్లో॥ స్నేహమూలానిదుఃఖాని స్నేహజానిభయానిచ
శోకహర్షౌతథాఽయాసః సర్వం స్నేహాత్ప్రవర్తతే॥

దుఃఖములకన్నిటికిమూలము స్నేహము (రాగము,) భయములకన్నిటికి హేతువు స్నేహమే, సమస్తశోకములకును, సంతోషములకును, ఆయాసములకును కారణము స్నేహమే అనితాత్పర్యము. (ఇక్కడ స్నేహమనగా రాగము, స్నేహితముకాదు).

దీని నెట్లు విడువవలెను? దీనివిడుచుటకుకూడ ఉపాయము కలదు. ఏదైననొకవస్తువునందు అపేక్ష కలిగినపుడు ఆవస్తువునందుండు సారమునుగురించియు, నిస్సారమునుగురించియు బాగుగవిచారము చేయవలెను. అట్లువిచారము చేయగా తనకంటె నితరవస్తువులందెల్లప్పుడును సుఖమునకంటె దుఃఖమధికముగతోచుననుటస్పష్టము. అట్లుతోచినపుడు ఆవస్తువునందుపేక్ష పుట్టును. అట్టివస్తువును తానను భవించుచుండి పోయినను దుఃఖము కలుగదు. ఈకారణముచేతనే శ్రీశంకరాచార్యులవారు సంసారమునకు కారణంబులగు వస్తువులందుండు అసారమునే సర్వదా చింతించుచుండవలెనని ప్రశ్నోత్తర రత్నమాలయందానతిచ్చినారు.

శ్లో॥ కాఽహర్నిశమనుచింత్యా
సంసారాఽసారతానతుప్రమదా॥

ఇట్లుబాహ్యవస్తువులందుండు అసారమునే చింతించుటచేత మమకారమువదలిపోవును. అహంకార మమకారములు నశిం

చినతోడనే శాంతముకలుగును. భగవంతుడు శాంతస్వరూపు డు. విష్ణువును స్తుతించినపుడు "శాంతాకారం, భుజగశయనం" అనిస్తుతింతురు. మహాదేవుని స్తోత్రముచేయునపుడు "శాంతం పద్మాసనస్థం" అనిస్తోత్రముచేయుదురు. కనుక శాంతముగల వాడే ఆత్మను ప్రసన్నముచేసికొనును. శాంతుడైనవాడు దుః ఖించడు, దేనినిగాని అపేక్షించడు. సమస్త భూతములందు స ముడై అనన్యభక్తినిపొందును.

ఇట్టిశాంతి స్థితినిపొందుటకే సకలయోగములు, ధ్యానము లు నియమింపబడినవి.

శ్లో॥ ప్రశాన్తమనసం హ్యేనంయోగినంసుఖముత్తమం
ఉపైతిశాంతరజసంబ్రహ్మభూతమకల్మషం॥

మనస్సును శాంతమొందించినట్టియు, రజోగుణమునణ చినట్టియు, పాపములనాశముచేసినట్టియు, బ్రహ్మస్వభావమును పొందినట్టియోగి ఉత్తమమైన సుఖమునుపొందుచున్నాడనిభగవద్గీ తయందుచెప్పబడినది.

మఱియుదానికావలి శ్లోకమందు,

శ్లో॥ యుంజన్నేవంసదాత్మానంయోగీవిగతకల్మషః
సుఖేనబ్రహ్మసంస్పర్శమత్యన్తంసుఖమశ్నుతే॥

ఏయోగి పాపములనుపోనాడి యివ్విధంబున యెల్లప్పుడు మనస్సును శాంతపరచుచున్నాడో ఆయోగి సులభముగ బ్రహ్మ సాంగత్యమైన అత్యంత సుఖమును అనుభవించుచున్నాడు. అ నగా బ్రహ్మానందమందు మగ్నుడగుచున్నాడని తాత్పర్యము.

"బుద్ధ్యావిశుద్ధయాయుక్తో" అనెడిశ్లోకమునుండి "సమ స్తర్వేషుభూతేషు" అనెడిపదమువరకు చెప్పబడినరీతిన అభ్యా సముచేయుచురానురాను, ఆపదమునకావలయుండు "మద్భ క్తింలభతేపరాం" అనగా తనయొక్క పరమభక్తిని పొందుచు న్నాడని స్వామి అర్జునునికుపదేశించిన విషయమునుగురించి

వ్రాయుటయందు అయభ్యాసము లెట్లు చేయవలసినది నాకుతోచి నంత వివరించితిని.

ఈఅభ్యాసముచే భగవంతుని సాక్షాత్కరించికొని ఆనందము పొందువారు పరమభక్తులని చెప్పుటకుసంశయములేదు.

భక్తులలక్షణము.

అట్టిభక్తులెల్లప్పటికిని తాము జన్మజన్మములనుండి చేసిన సదభ్యాసబలముచే సంపాదించిన భగవదనుగ్రహప్రవాహమగు ఆనందరాశిని లోకమునందుండు నెల్లరియందు వ్యాపింపచేయుటచే అందరిని దుఃఖసాగరమునుండి కడతేర్చి ఉద్ధరించుటే వారిముఖ్యధర్మముగా తలంచుదురు. తాముమాత్రమనుభవించుటకు కాదు. పరమభక్తుడగు ప్రహ్లాదుడేమిచెప్పె?

శ్లో॥ ప్రాయేణ దేవమునయస్స్వవిముక్తి కామాః
మౌనంచరంతివిజనేనపరార్థనిష్ఠాః
నైతాన్విహాయకృపణాన్విముముక్షయేకో
నాన్యంత్వదస్యశరణంభ్రమతోనుపశ్యే॥

సాధారణముగ దేవమునులు తమకు ముక్తికావలెనను కోరికచే నిర్జనప్రదేశమందు మౌనాది తపశ్చర్యలు సలుపుచున్నారు. ఇందరు కృపణులు సంసారసాగరమందు మునుగుచు దుఃఖించుచుండగా వీరినందరినివిడిచి నేనుమాత్రము ముక్తిపొందుటకిచ్ఛయించను. నీశరణుతప్ప నాకింకేమియువద్దని చెప్పెను.

శ్లో॥ శివాయలోకస్యభవాయభూతయే
యఉత్తమశ్లోకపరాయణాజనాః
జీవంతినాత్మార్థమసౌపరాశ్రయం
ముమోచనిర్వేద్యకుతఃకళేబరం॥

భగవద్భక్తులు లోకశుభమునకును, సమస్తభూతముల క్షేమమునకును జీవించుచున్నారుగాని తమసుఖమునకు కాదని శ్రీమద్భాగవతమందుదాహరింపబడినది.

శ్లో॥ నచలతినిజవర్ణధర్మతోయ
స్సమమతిగాత్మసుహృద్విపక్షపక్షే
నహరతినచహంతికించిదుచ్చై
శ్శితమనసంతమ్మవైహివిష్ణుభక్తిం

ఎవడు తనవర్ణధర్మమును వదలడో, యెవడు తనవారియందును, పగవారియందును, సమముగవర్తించునో, యెవడు పరులసొత్తు నపహరించడో, యెవడుయేజంతువునుగాని చంపడో అట్టినిర్మల మనస్సుగలవానిని విష్ణుభక్తుడని తెలియుమని యమభటునికి యముడుచెప్పినట్లు విష్ణుపురాణమందు చెప్పబడినది.

ముఖ్యముగా భక్తులలక్షణములలో ప్రథమము సమస్త భూతములందు సమత్వము. ఏభూతమందెవరికిగాని లవలేశము ద్వేషభావముండెనా వాడుభక్తుడుకాడు. అదెందుకన ఈశ్వరుడు సమస్త భూతములహృదయములందుండుటనుపట్టి ఏభూతమును ద్వేషించినను ఈశ్వరునే ద్వేషించినట్లగును గనుక అట్టివాడు భక్తుడుకాజాలడు. సర్వభూతములందు సమభావము కలవాడెట్లుధ్యానించిన నేమి?

తస్యైవాహంమమైవాసౌస ఏవాహమితిత్రిధా॥

నీవాడనునేననియు, నావాడునీవనియు, నీవేనేననియు మూడువిధంబులను ధ్యానించిగతినొందవచ్చును.

శ్లో॥ సత్యపిభేదాపగమేనాథతవాహంనమామకీనస్త్వం
సాముద్రోహితరంగఃక్వచనసముద్రోనతారంగః

అద్వైతమునిశ్చయమైనప్పటికిని, ఓనాథా! నీవాఁడను నేనుగాని నావాఁడవునీవుగావు. అలలుసముద్రసంబంధమైనవని అందురుగాని అలల సంబంధము సముద్రమని అనరు. అనిశ్రీశంకరాచార్యులవారానతిచ్చినారు. ఇట్లుధ్యానించువారుకొందరు.

శ్లో॥ హస్తముత్క్షిప్యయతసిబలాత్ కృష్ణకిమద్భుతం
హృదయాద్యదినిర్యాసిపౌరుషంగణయామి తే॥

హేకృష్ణ! నీవునావాఁడవు, నేనుపట్టినచేతినిబలవంతము గవిడిపించికొనిపోను యత్నము చేయుచున్నావు. ఇదేమిఆశ్చర్యము. నిన్నునాహృదయమందు కట్టివేసినాను. అచ్చటనుండి విడిపించుకొనిపోయినట్లైన పౌరుషమనియెంచెదననిగోపికాస్త్రీలు చెప్పిరి. ఇవ్విధంబున మరికొందరు ధ్యానింతురు.

శ్లో॥ సకలమిదమహంచవాసుదేవః
పరమపుమాన్పరమేశ్వరస్సఏకః
ఇతిమతిరచలాభవత్వనంతే
హృదయగతేవిషయాన్విహాయదూరాత్॥

ఈసమస్తలోకములును నేనును అంతయు వాసుదేవుడే, అనిఅచలమైన మనస్సుతో సర్వభూతములందును వాసుదేవుని తలంచుచు భజించువారనేకులునుగలరు.

ఎవరెవరికి యేయేరీతిన భజించిన మేలుకలుగునో ఆయారీతిన భజించవచ్చును. ఎట్లుభజించినను పరమేశ్వరునికి అర్పితమగును. పరంతు సమస్తభూతములందు సమత్వమేమో ఉండితీరవలెను.

శ్లో॥ విష్ణోస్తుశ్రవణేపరీక్షిదభవత్ వైయాసికిఃకీర్తనే
ప్రహ్లాదః స్మరణేతదంఘ్రి భజనేలక్ష్మీఃపృథుఃపూజనే
అక్రూర స్త్వభివందనేఽథహనుమాన్ దాస్యేచసఖ్యేర్జునః
సర్వస్వాత్మనివేదనే బలిరభూత్ కైవల్యమేషాంసమం॥

విష్ణుచరిత్రవినుటచేత పరీక్షన్మహారాజును, కీర్తనచేత వ్యాసులవారును, స్మరణచేత ప్రహ్లాదులవారును, పాదధ్యానము చేలక్ష్మీదేవియు, పృథుచక్రవర్తి పూజచేతను, అక్రూరుడువందనములొనర్చుటచేతను, సేవచేత హనుమంతుడును, స్నేహభావముచేత అర్జునుడును; తననేసమర్పించుకొనుటచే బలిచక్రవర్తియు, వీరందరు వేర్వేరువిధభజనములచే కైవల్యము నొందిరి.

భగవంతుడుతృప్తిచెందుటకు హృదయనిర్మలత్వమును, స

ర్వభూతములందు సమత్వమును, దయాభావంబును, రాగద్వేష రాహిత్యమును, శుచివ్రతత్వము మొదలగు కల్యాణగుణసంపదతో యుక్తమగు అనన్యభక్తి కావలెగాని పూజాభేదంబులంత ముఖ్యముకావు. అట్టిభక్తితో భగవంతుని తెలిసినవాడు భగవంతుని పొందుననుటకు సంశయములేదు.

శ్లో॥ భక్త్యామామభిజానాతి యావాన్యశ్చాస్మితత్వతః
తతోమాంతత్వతోజ్ఞాత్వా విశతేతదనంతరం॥

ఇట్టిభక్తినిపొంది ఆభక్తిచేతభగవంతుని తెలిసికొని ఈభక్తివిషయము ఆస్తికుల కుపదేశించినవారికంటె భగవంతునికి ప్రియులెవరును లేరని భక్తవత్సలుడైన శ్రీకృష్ణులానతిచ్చినారు.

శ్లో॥ యఇమంపరమంగుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి
భక్తింమయిపరాంకృత్వా మామేవైష్యత్యసంశయః
నచతస్మాన్మనుష్యేషు కశ్చిన్మేప్రియకృత్తమః
భవితానచమేతస్మా దన్యఃప్రియతరోభువి॥

అనిభగవంతుడుచెప్పినాడుగనుక పైనచెప్పినరీతిని అభ్యాసముచేసి భక్తినిసంపాదించి, తద్వారాభగవంతుని నిజస్వభావమెరిగి ఆజ్ఞానమునులోకులకందరికి వ్యాపింపచేయుటచే ఉద్ధరించినవారై, తామునుకడతేరి మెచ్చుటను ఆనందప్రవాహ ముప్పొంగజేయుచు భగవదనుగ్రహమునకు పరిపూర్ణపాత్రులై పూర్ణశాంతినిపొంది లోకమంతయు శాంతిసముద్రమునందు మగ్నమగునట్లు చేయుదురుగాక! దయానిధులైన పరమర్షులు ఆశీర్వదింతురుగాక!

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు.
ఓంశాంతిః, శాంతిః, శాంతిః॥
సర్వంశ్రీ పరమేశ్వరార్పణమస్తు.

———:0:———

